Saraswati Series 20.

శ్రీ

# నన్నయభట్టారకచారిత్రము.

(ప్రథమభాగము)

ఇది

కాశీభట్ల బ్రహ్మయ్యచే

విరచింపఁబడినది.

"వినవలె నెవ్వరు చెప్పిన
విన్నంతనె వేగపడక వివరింపఁ దగున్
గని కల్లనిజము తెలిసిన
మనుజుఁడెపో నీతిపరుఁడు మహిలో సుమతీ."

COCANADA:

PRINTED BY P. BRAHMANANDAROW AT THE SUJANARANJANI PRESS
AND PUBLISHED BY THE EDITOR OF THE SARASWATI.

1901.



[వెల 8 అణాలు

**Saraswati Series 20.**

శ్రీ

# నన్నయభట్టారకచారిత్రము.

(ప్రథమభాగము).

ఇది

కాశీభట్ల బ్రహ్మయ్యచే

విరచింపఁబడినది.

"వినవలె నెవ్వరు చెప్పిన
విని నంతనె వేగపడక వివరింపఁ దగున్
గని కల్లనిజము తెలిసిన
మనుజుఁడెపో నీతిపరుఁడు మహిలో సుమతీ."

COCANADA:

PRINTED BY P. BRAHMANANDAROW AT THE SUJANARANJANI PRESS.
AND PUBLISHED BY THE EDITOR OF THE SARASWATI.

1901.



[వెల 8 అణాలు.

# నన్నయభట్టారకచారిత్రము.

## పీఠిక.

పాశ్చాత్యవిద్యాసూర్యపదప్రచారము మనయాంధ్రకవితాఘనతకుఁ క్రొత్తరాగమును గలిగించుచున్నది. ఆహేతువుచేతనే మనలోఁ బూర్వకవిచారిత్రము లనేకము లీనడుమ నుత్పన్నములైనవి. కాని యవియన్నియునుగూడఁ బల్వురు కవులనుగూర్చి ముచ్చటించునవి యగుటచేఁ బ్రతికవినిగూర్చియును మిక్కిలి సంగ్రహముగా ముచ్చటించునవియై యున్నవి. ముఖ్యకవిశిఖామణుల చారిత్రము లైనను బాగుగా విస్తరింపఁజేయఁబడి యుండలేదు. ఇట్టిసంగ్రహములవలనఁ గొంతలాభము కలదుగాని మొత్తముమీఁద నాయాచరిత్రములఁ జక్కఁగాఁ దెలిసికొని యానందించుటకును విషయమును బాగుగా గ్రహించుటకును జదువరుల కంతగా సహాయము కలుగదు. కాఁబట్టి ముఖ్యకవులచారిత్రములను విపులముగా వ్రాయుతలంపుతో నేనీయాదికవిచారిత్రమును బ్రారంభించి యిప్పటికి మొదటిభాగమును మాత్ర మాంధ్రసరస్వతికి వ్యాపకార్థమై యొప్పగింపఁ గలిగితిని. ఆనాఁటి నన్నయభట్టారకునిచారిత్ర మీనాఁడు వ్రాయుటలో నాతనిసాంసారికచారిత్రమును విస్తరించి వ్రాయుట కనుపడదు. అది యంతగా నవసరమును గాదు. నన్నయభట్టనామకకవి చారిత్రమును మనము వ్రాయుచున్నామే కాని నన్నయభట్టనామకగృహస్థచారిత్రమును మనము వ్రాయుటలేదు. ఒకకవిచారిత్రమును వ్రాయునప్పు డాతనికేవైన గండములు వచ్చినవో లేవో యాతని పితరులపేళ్లేవో సతియెవరో సుతులెందఱో తెలియకుండిన నాచారిత్రమున కింతయు హానిలేదు. ఆతఁ డెట్టివంశమువాఁడో యెట్టిబుద్ధిగలవాఁడో యెట్లు విద్యాభ్యాసము నందెనో యెంతవిద్యను నేర్చెనో యెట్టికవిత్వమును జెప్పి భాష కెట్టివిశేషమును గలిగించెనో లెస్సగాఁ దెలిసినఁ జాలును. అయ్యవి చదువరులబుద్ధికి వికాసమును గలిగించును. నన్నయచారిత్రవిషయములో నీసంగతులు బాగుగాఁ దెలిసికొనుటకును జర్చించుటకును జాలినంత యవకాశము కలదు. కావున నాకనువైనంతవఱకు విషయపరిశోధనమును జేసి నాయల్పబుద్ధికిఁ దోఁచిన ట్లీచారిత్రమును వ్రాయుచుంటిని. నావ్రాసిన దెట్లున్నను నాయుద్యమము మంచిది గావున నీచిన్నిపొత్తము వివేకులకు నీయుద్యమమును నెగ్గింపఁ బ్రోత్సాహము నైన నొసంగు నని తలంచెదను. మఱియును నాలోచించిచూడఁగా మనభాష పలుభాషలవికారమైనట్లు నాకును దోఁచుటచే నేనావిషయమునే యిందు వ్రాసియుంటిని. సత్యమగుచారిత్రమును

గనుగొనఁబోవువార లభిమానగ్రస్తులు కాఁగూడరు గదా! కాన భాషాభిమాను లీతలంపు మనభాష కేదో లోపమును గలిగించు ననునూహకు లోనుగాక సత్యాన్వేషణప్రియులై యీపీఠిక నావ్రాసినదంతయుఁ జదివి గ్రాహ్యమైన గ్రహింతురుగాక. అగ్రాహ్యమైనఁ ద్యజింతురుగాక. ఇతరభాషలవలన మనభాషపుట్టిన దనినదాన మనభాష కింతయు నగౌరవము లేదు. వస్తువుల ఘనతాఘనతలు వానియందు వెలయు గుణములనుబట్టి యుండును గాని పుట్టుకను బట్టి యుండవు.

గీ. జన్మమెందైననేమి తా సద్గుణంబుఁ । గలిగి వర్తించెనేని జగమ్ము మెచ్చు
తమ్మి బురదలోఁబుట్టియుఁ దగుగుణముల । సరసులందుఘనతతో నెసంగుఁగాదె.

కాన జన్మ మెందైనను మనభాష మృదుమధురమై "దేశభాషలలోనఁ దెలుఁగులెస్స" యనుఖ్యాతిని గడించినది. కొందఱుబుద్ధిమంతులు "తెనుఁ" గనునది "తేనె" వలనఁ గలిగిన దనితలంచిరి. దీనిని శబ్దశాస్త్రజ్ఞు లంగీకరింపరైరి. తెనుఁగు తేనెవలనఁ బుట్టినను బుట్టకున్నను తేనెవలె బుట్టి తేనెవలె నుండునది యైయున్నది. అనఁగాఁ దెనుఁగనుపదము తేనెయనుపదమునుండి పుట్టినను బుట్టకున్నను తెనుఁగుభాష తేనె యెట్లు బహుపుష్పములసారమువలనఁ గలిగి యతిమధురమై యొప్పెనో యట్లే బహుభాషలసారము కారణముగాఁ గలదియై యన్నిటిని మించినమాధుర్యము కలదియై విరాజిల్లుచున్నది. ఇట్లు వాసిగాంచుచున్న యీభాషావిశేషమునకు జన్మమెట్టిదైనను దాన లోపము రాదు గావున దురభిమాన మాంధ్రుల నావహింపక సత్యపరాయణత్వము వారిమనముల వెలయించుఁగాక.

కాకినాడ-జగన్నాథపురము,
ది 16-4-01 సం॥

కా. బ్రహ్మయ్య.

శ్రీరస్తు.

శుభమస్తు.

# నన్నయభట్టారక చారిత్రము.

---



## ప్రథమప్రకరణము.

### వంశాదికము.

ఉ. ఉన్నతగోత్రసంభవులు నూర్జితసత్త్వులు భద్రజాతిసం
పన్నులు సద్ధతాన్యపరిభావిమదోత్కటు లున్నరేంద్రపూ
జోన్నయనోచితంబులయి యొప్పెడు నన్నయభట్టకుంజరం
బెన్నిరంకుశోక్తిగతి నెందును గ్రాలుటఁ బ్రస్తుతించెదన్.

ఎఱ్ఱాప్రగడ.

ఏ మహనీయుఁడు గాసటబీసటలచేఁ గాలముపుచ్చు నాంధ్రుల యభివృద్ధి నభిలషించి యాంధ్రకవితాసతిని నీలోకంబునఁ బుట్టించి విద్యాదయితుండై యొప్పెనో యే సత్ప్రతిభాంచితుఁడు దానిఁ బలువిధములఁ బెంచి వృత్తనియమముల నేర్పి చక్కఁగా శాసించి వాగనుశాసనుండై యలరారెనో యే పుణ్యుఁడు పంచమవేదము నాంధ్రమున నిర్మించి బ్రహ్మయన నెగడెనో యట్టి శ్రీనన్నయభట్టారకుఁడు ముద్గల గోత్రుఁడు నాపస్తంబసూత్రుఁడును నఘువంశసంభూతుఁడైన బ్రాహ్మణోత్తముఁడైన ట్లీక్రింది భారతమునం గల పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

ప్రాసనీసము.

తనకులబ్రాహ్మణు . ననురక్తిననిరతు । జపహోమతత్పరు - విపులశబ్ద
శాసను సంహితా - భ్యాసు బ్రహ్మాండాది । నానాపురాణవి - జ్ఞాననిరతుఁ
బాత్రు నాపస్తంబ - సూత్రు ముద్గలగోత్ర । జాతు సద్వినుతావ - దాతచరితు
లోకజ్ఞు నుభయభా - షాకావ్యరచనాభి । శోభితు సత్ప్రతి - భాభియోగ్యు
నిత్యసత్యవచను - మత్యమరాధిపా । చార్యు సుజను నన్న - పార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు - వరచళుక్యాన్వయా । భరణుఁ డిట్టు లనియెఁ - గరుణతోడ.

భారతము

పైపద్యములవలన నితని గోత్రాదులే కాక యితని ప్రజ్ఞాదికములను శాఖయును గూడ వెల్లడియగుచున్నవి. అందుఁ దన కృతిపతియగు రాజరాజనరేంద్రునికిఁ దాను కులబ్రాహ్మణుఁడనని వ్రాసికొనెను కులబ్రాహ్మణుఁ డనఁగాఁ గులగురువగు పురోహితుఁడు గాన నీతండు వైదికశాఖా బ్రాహ్మణుఁడని స్పష్టమగుచున్నది పైపద్యములో “లోకజ్ఞుఁడ” ను విశేషణముండుటచే నీతండు లౌకికశాఖవాఁడని కొందఱనఁ జూచుచున్నారు కాని యది యనాకరము. ఇది లౌకికశబ్దార్థము దిన్నఁగా విచారింపకపోవుటవలన వచ్చిన తప్పు (ఆంధ్రదేశస్థిత బ్రాహ్మణులలో వైదికులని, నియోగులని రెండుతెగలవారు గలరు. వారిలో మొదటివారు మతవిషయముల (లౌకికవైదికముల*) నడపువారుగాను రెండవతరగతివారు రాజకీయవిషయముల నడపువారుగా నుండిరి. అంతియే కాని లౌకికశాఖయను నొక శాఖలేదు. నియోగులు రాజకీయవ్యాపార ధురీణులయినట్లుగాఁ గవి జీవితాదులు ఘోషింపుచున్నవి ఇంక వృత్తుల విడచిన లోకాయత్తమగు లౌకికత్వ మనునది యుభయశాఖలందును గలదు. వేదపఠనమొనరించి వేదవిహితకార్యాచరణరతులయి యుండువారందఱు నేశాఖలోనివారైనను వైదికులైయున్నారు. కావుననే తిక్కన తాను నియోగియై యున్నను భారతములో ‘వైదికమార్గనిష్ఠమగు వర్తనము’ గలవాఁడనని వ్రాసికొనియె లోకమనఁగా వేదేతరమగు శాస్త్రాదికము. దానియందు పరిశ్రమకలవారందరు లౌకికులయియున్నారు. వేదమునీతిద్వయమును జదువుకొనినవాఁడు వైదికుఁడు, కావ్యాదికమును జదువుకొనినవాఁడు లౌకికుఁడునై యున్నారు. “లోకసర్వలోకాట్ఠఞ్” అను సూత్రముచే సిద్ధమగు లౌకికత్వ మందఱియందును గలదు. మఱియు “తత్రనియుక్తః” అనుదానిచే ఠక్ప్రత్యయాంతమగు లౌకికత్వము నియోగులందు మాత్రమే వర్తించునని ననవచ్చును. నియోగి యనినను నియుక్తుఁడను నర్థమే వచ్చుచున్నది కావున నీవిధముగా లౌకికులనఁగా నియోగులుమాత్రమే యని చెప్పవచ్చునుగాని యీ లౌకికశబ్దముచే రాఁదగిన యర్థము లోకజ్ఞశబ్దముచే వచ్చునా? లోకవ్యాపారనియుక్తుఁడు లౌకికుఁడు, లోకజ్ఞానముగలవాఁడు లోకజ్ఞుఁడు, మొదటిది వ్యాపారమును దెల్పునది. రెండవది బుద్ధివిశేషమును దెల్పునదియైయున్నది. మొదటిది విశేషవాచి రెండవది సామాన్య

---

* మనలోనన్యదేశీయులవలె మతవిషయములకును సంఘవిషయములకును వేఱుగు నేర్పాటులులేవు. రెండును గలసియున్నవి. మనము చేయు కర్మాదులు లౌకికములును వైదికములునునైయున్నవి.

వాచియు నైయున్నది లౌకికులందఱు లోకజ్ఞులు కావచ్చునుగాని లోకజ్ఞులందఱు లౌకికులు కావలసిన యవసరము లేదు అట్లయిన వేదజ్ఞులందఱు వైదికశాఖలోనివారగుదురా? అట్లగుచోఁ దిక్కన తండ్రియు వైదికుఁడే కావలయును ఏలయనఁ దిక్కన యతనిని "సాంగవేదవేది" యని భారతమున వాడినాఁడు. ఇప్పటికిని నియోగులలో నక్కడక్కడ వేదజ్ఞులు కలరు వారు వైదికులగుదురా? వారిని వేదజ్ఞు లనఁగూడదా? కావున "లోకజ్ఞుఁడ"ని నంతమాత్రమున నన్నపార్యుని నియోగియనుట తగదు. "లోకజ్ఞుఁడ"నఁగా లోకజ్ఞానము కలవాఁడని యర్థము. కవిజీవితాదులందు నుడువుచున్నది అట్టిచో లోకజ్ఞానమంతయు నియోగులే చూఱఁగొనిన యెడ నీతని, నియోగి యనవచ్చునుగాని యట్లనుటకు లోకజ్ఞు లెవ్వరును సాహసింపరు. ఏకారణముచేనైన నొకవేళ నెవ్వరైన సాహసించి యనినను లోక మంగీకరింపదు అది లోకవిరుద్ధము లోకజ్ఞ శబ్దము నియోగినే తెల్పునేని రామాయణమున నారదుఁడు "త్రిలోకజ్ఞుఁడ"ని వాడఁబడియుండెఁగాన నాతఁడు ముప్పేట నియోగి (అనఁగా ఆఱువేల నియోగియు నందవరీక నియోగియు తెలగాణ నియోగియు) కావలసి వచ్చును నియోగియని తెలుపుటకుఁ గాకున్న లోకజ్ఞుఁడను విశేషణమేల నన్నపార్యుఁడు వాడుకొనెనని కొందఱు శంకించుచున్నారు. కాని యట నా విశేషణము నిరర్థకము గాదు. తాను కవిననియు రాజునకుఁ గులగురుఁడ ననియుఁ జెప్పఁబోవుచున్నాఁడు కాన నాయా వ్యాపారములకుఁ దగిన లక్షణములఁగూడఁ గవి స్పష్టపఱచె. లోకజ్ఞానము కవి కుండవలయునని యాలంకారికమతము. కావుననే పూర్వులు

> శ్లో॥ శక్తిర్నిపుణతా లోక శాస్త్ర కావ్యాద్యవేక్షణాత్
> కావ్యజ్ఞ శిక్షయాఽభ్యాస ఇతి హేతుస్తదుద్భవే.

అని పలికిరి.

తానపూర్వముగా నాంధ్రకవిత్వమును గలిగించుచున్నాఁడు కావున నట్టివాఁడు లోకజ్ఞానము విశేషముగాఁ గలవాఁడయి యుండవలెను కావునను నా విశేషణమట కవియొక్క సామర్థ్యమును దెలుపుటకై యవసరమైయున్నది.)

ఇఁక నన్నయభట్టును నియోగిని జేయుటకై కవిజీవితము లోక యద్భుత గాథను ద్రవ్వుచున్నది. అవి స్వవచన వ్యాఘాతములతోడను నన్యోన్యాశ్రయ దోషాదులతోడను నిండియుండి తమవాద దుర్బలత్వమును దామే వెల్లడిచేసికొనుచున్నవి.

(౧) నన్నయనాటి కిప్పటి కేవలవైదికశాఖ లేదనియు లౌకిక వైదికములు రెంటిని నడుపు నొక యపూర్వశాఖ కలదనియు వాని వాదము. అట్లయిన నాశాఖను లౌకిక వైదికశాఖ యనవలయును గాని లౌకికశాఖ యనుట యెట్లు? బ్రాహ్మణునకుఁ బ్రధానమైనది వైదికత్వము అట్టి ప్రధానమైన వైదికత్వము పోయి లౌకికత యెట్లు నిలచినది? లౌకికత వైదికత యనునవి వేఱువేఱుగా నున్నపుడు కదా యీతఁడు లౌకికశాఖవాఁడు ఈతఁడు వైదికశాఖవాఁడు నని నుడువవలెను. మఱియు శ్రీనాథుని తాతయగు కమలనాభునందు లౌకికత లేకపోవుటచేత నతనికి నియోగ బిరుద మేదియు లేకపోయెనని కవిజీవితములు చెప్పుచున్నవి అట్లుండ వైదికత్వమున నున్న నన్నయ కీ "లోకజ్ఞ" బిరుదమేల? అదిగాక లౌకికవ్యాపారమునందు లేకపోవుటచేతఁ గమలనాభునకు నమాత్యబిరుదము లేకపోయెననునది తప్పటూహ. శ్రీనాథుఁడు తన తాతను స్తుతించునెడ

మ. కనకక్ష్మాధరధీరు వారిధితటీకాల్పట్టణాధీశ్వరున్
ఘనునిం బద్మపురాణ సంగ్రహ కళా కావ్యప్రబంధాధిపున్
వినమద్భ్యాంతర సార్వభౌము గవితా విద్యాధరున్ గొల్తు నా
యనుఁగుం దాతఁ బ్రదాత శ్రీకమలనాభామాత్య చూడామణిన్.

అని కమలనాభుని నమాత్యచూడామణిగా వర్ణించియేయున్నాఁడు. మఱియును కవి జీవితములు మొదటిసంచికలో ("దీనింబట్టి శ్రీనాథుని కాలమువఱకును నియోగులు వైదికవృత్తిలో నున్నవారు. అమాత్యాది నియోగ బిరుదాంకములం గైకొనకయున్నట్లును లౌక్యవ్యాపారములోఁ దిరుగువారుమాత్రమే యమాత్యాది శబ్దముల గ్రహించుచున్నట్లును గాన్పించును దీనింబట్టియే శ్రీనాథుఁడు తన తాతపేరు వ్రాయుచు కమలనాభ తనూభవయని మాత్రము వ్రాసెను కమలనాభుఁడొక గొప్ప యాంధ్రకవియైనను లౌక్యవృత్తిలో లేమి గావున నమాత్యశబ్దము నుంచి చెప్పలేదు" అని నుడివి దీనికి విరుద్ధముగా శ్రీనాథునిగూర్చి చెప్పు భాగములో "శ్రీనాథుఁడేగాక యతనితండ్రియుఁ దాతయుఁ గూడ వైదికవృత్తిలేనివారు" ని వక్కాణించె.)

(౨) నన్నయ మహారాష్ట్రదేశమునుండి యిచటికి వచ్చినట్లును నాదేశమున లౌకికశాఖ వైదికశాఖయను భేదములేక రెంటిని నడపెడు శాఖ యొకటియె కలదనియుఁ గవి జీవితములు నుచ్చరించియుఁ గూడ మఱల నాంధ్రదేశమున కొక్కమాఱుగా లౌకికశాఖవారు వచ్చిరనియు వారితరువాత వైదికశాఖవారు వచ్చిరనియు నుడువుచున్నవి. ఇది యెటు పొసఁగును.

(౩) శ్రీనాథుఁ డెక్కడనో యొకచోటఁ దన తాతనుగూర్చి వ్రాయుటలో నవ పదమును దేశిని జేర్పకపోవుటచే నతనిని వైదికవృత్తియం దున్నవానినిగా నూహించి శ్రీనాథునివఱకును నియోగిశాఖయే లౌకిక వైదిక వ్యాపారములఁ జక్కఁ బెట్టుచువచ్చినట్లు ఇది నుడువ సాహసించుచున్నది. ఇది యబద్ధము. శ్రీనాథుఁడు తన వీధినాటకములో బాపన (వైదిక) భామలను నియోగికభామలను భిన్నముగా వర్ణించియుండుటచే నప్పటికి పూర్వముండే వైదికులు నియోగులు ననురెండు శాఖలున్నట్లు గ్రహింపవలసియున్నది. మఱియును బూర్వపు శాసనముల వలనఁ గూడ నీ రెండుశాఖలు వేఱువేఱుగానున్నట్లూహింపఁ దగియున్నది. కాన నన్నయ భట్టారకునినాటికే యీ భేదముండవచ్చును.

(౪) మొదట లౌకికు లీదేశమునకు వచ్చిరనియు వారు తమ లౌకికమునే కాక వైదికులప్పటికింకను రాకపోవుటచే విధిలేక వైదికత్వమును గూడఁ దమ తలలందు బూనిరనియుఁ దరువాత వైదికులు రాఁగా దమయందపూర్వముగా వచ్చిపడిన వైదికత్వమును వారికొసంగిరనియు నిట్లు వీరిరువురునువచ్చి యీదేశమున నివసించిన తరువాత నీ వైదిక నియోగిభేదము వచ్చినదనియు నిది చెప్పుచున్నది. మొదటినుండియూ నియోగులు వైదికులునను భేదముండఁగా నిచటికివచ్చిన తరువాత నీభేదము కలిగిన దని చెప్పుటయెట్లో తెలియకున్నది. ఆదినుండియును లేకుండిన మొదట నియోగులును దరువాత వైదికులును వచ్చుటయెట్లో స్ఫురింపకున్నది.

(౫) ఎట్లుచూచినను కవిజీవితములందలి యపూర్వగాథ నమ్మఁదగియుండలేదు. బ్రాహ్మణశాఖ యాంధ్రదేశమున వ్యాపించిన తరువాత దీనికిఁ గారణాంతరముచే నియోగమను నొక పదవిక బయలుదేఱినది. ఇది మొదటిశాఖతో సంబంధించినదే యైనను దీనికిఁబుట్టు సుమనఃపాళి మూలశాఖయొక్క సుమనఃపాళికంటె భిన్నవర్ణముకలదైనది. బ్రాహ్మణునకుఁ బ్రధానమైనది వైదికమార్గప్రవర్తనముగాన మొదట బ్రాహ్మణులందఱు వైదికులేయైయున్నారు. ఈ వైదికశాఖలోనుండి విడి భిన్నవృత్తియందుఁ బ్రవేశించినది నియోగిశాఖ. కావుననే యిప్పటికిని బ్రాహ్మణులను వ్యవహారమొక్క వైదికులందు మాత్రము కలదు. నియోగులమీరు బ్రాహ్మణులా? యనిన గ్రామకరణముల మందురు. ఆ గ్రామమున బ్రాహ్మణులయిండ్లు పల్లును కరణములవి మూఁడును గలవని లోకులు వ్యవహరింతురు శ్రీనాథుఁడును వైదికాంగనను "బాపన

భామ'యనియు విప్రభామ*యనియు నీవాడి నియోగ్యంగనను జూచి యుచ్చటించుచు "నాంధ్రనియోగిభామ" యనిప్రయోగించె. ఇట్టి బ్రాహ్మణత్వమునుండి విడి నియోగవృత్తియందుఁ బ్రవేశించినవారు నియోగులైరి వీరినే కరణములు కాయస్థులు మొదలగు పేళ్ళచేఁ బిలుతురు. వీరివృత్తి రాజకీయోద్యోగములందుండి లెక్కలువ్రాయుట ఈవృత్తి మొదట కరణజాతివారిదైయుండె వారినే యిప్పుడు సృష్టికరణములందురు. సృష్టిచేత నియోగవృత్తిగల యీకాయస్థులను బ్రాహ్మణేతరులవలనఁ గ్రమప్రకారముగా బ్రాహ్మణులకుఁ జిక్కు లెక్కుడు కాఁగా వానిని వారించుకొనుటకై బ్రాహ్మణులలోఁ గొందఱువిడి యావృత్తియందుఁ బ్రవేశించి వేఱుశాఖవారైరి. రాను రాను తుదకీ పెట్టునియోగులు పుట్టునియోగులనుకొను లోకజ్ఞతకు వచ్చిరేకాని మొదటినుండియుఁ గాయస్థజాతిలోనివారు కారని తోఁచెడిని

కాఁబట్టి కవిజీవితములందలి యపూర్వగాథ నమ్మనర్హముగాఁ దోఁచుటలేదు కాన రాజరాజనరేంద్రుని కులబ్రాహ్మణుఁడనని చెప్పుకొనిన నన్నయభట్టారకుఁడు వైదికుడనియే చెప్పఁదగును.

మఱియు నితని నామాంతమందలి "భట్టు" అను నుపపదమును నితఁడు వైదికుఁడని బోధించుచున్నది. భట్టు ఉపాధ్యాయాదుల వైదికులును మంత్రి, అమాత్య ప్రధానాది శబ్దములను నియోగులును నుపపదములుగా వాడుకొందురు "ఆర్య" శబ్ద మూభయులచేతనుగూడ వాడుకొనఁబడుచున్నది. నియోగులెవరును భట్టు బిరుదమును వాడుకొనియుండలేదు. వైదికులలో నీబిరుదు పేరులందును నింటిపేరులందును గూడ మిగులవ్యాపకములలోనున్నది. "భజ పూజాయాం" అను ధాతువునుండివచ్చిన భట్ట బిరుదు సర్వజనులకును నాచార్యులగు వైదికులును రాజకార్య ధూర్వహులగు నియోగులు మంత్రి అమాత్యాది బిరుదములును బూనిరనుట సమంజసమయిన మాటగా నున్నది. నియోగులెవరును భట్టబిరుదమును వాడుకొని యుండలేదుగాని శ్రీనాథుఁడొకమాత్ర మొకచో "పద్మనయనమౌళి శ్రీనాథ భట్టసుకవి" అని ప్రయోగించుకొనినట్లు కానిపించుచున్నది. ఇదితక్క[illegible]మఱెక్కడను గంచుకాగడావేసి వెదకి [illegible] నియోగులు భట్టశబ్దమును బ్రయోగించుట కానరాదు. శ్రీనాథుడైనను "నన్న

---

* శ్రీనాథుని వీధినాటకములోని మొదటిపద్యములోనందలి విప్రభామ వైదిక భామయేగాని సామాన్యముగా బ్రాహ్మణజాతియందుఁ బుట్టిన విప్రస్త్రీ కాదు. వీరికి నుడివపునేర్పు మాటలును సూక్ష్మవిలోకన భాషణంబులును విభంగవయు భాషమును లేవని చెప్పి నియోగ్యంగన వీనియందు నేర్పు కత్తెయనియు భోగగుణభామయనియుఁ దద్విరుద్ధముగా వర్ణించియున్నాఁడు.

యభట్టు నారాయణభట్టు" అనినట్టుగాఁ దన నామాంతమున దీనిని బిరుదుగాఁజేర్చి కొనియుండలేదు. తన గద్యములలో నన్నిటియందును 'శ్రీనాథ' యని వాడినాడు ఇంకను నితర స్థలములం దన్నిటియందును భట్టపదము లేకయే కాన్పించుచున్నాఁడు కాన నైషధ గీతపాఠమందు యతికొఱకై భట్టశబ్దమును బ్రయోగించుకొనె నిట సామాన్యముగా పూజ్యుఁడని యర్థమును గ్రహింపవలెను. పూజ్యులొక వైదికులే యనఁగూడదు గదా? అటే యమాత్యులందఱును నియోగులే యనఁగూడదు. ఇతర విషయములఁ గూడఁ బరికించి చూడవలయును. మాధవాచార్యుఁడు వైదికుఁడైనను గారణాంతరముచే మంత్రిత్వమును వహించి దాని సూచించుచు నమాత్యబిరుదమును వాడుకొనెను యతిలౌకికము నపేక్షించి యమాత్యపదమును వాడుకొనె. ఈరెండును వారు వారెరువు తెచ్చిపెట్టుకొనినట్లు కాన్పించుచునేయున్నవి. ఇంతమాత్రముచే మొదటి యతనిని వైదికుఁడనిగాని రెండవ యతనిని నియోగియనిగాని యెంచఁజనదు.

ఇంకను బిల్లలమఱ్ఱి పినవీరన్న కాఁజేసిన కవిస్తుతిలో "మా నన్నయభట్టు" అనుటనుగూర్చి విచారింపవలసియున్నది. దీని నాధారముచేసికొని కొందఱు నన్నయను నియోగినిగా నెంచుచున్నారు. ఇదియును సరికాదు. నియోగియగు నన్నయయొకడును తదితరుఁడగు నన్నయయొకఁడును నుండినంగదా పినవీరన్న యితనిని మానన్నయ యనవలసియుండును. అట్టిద్దఱులేమికావున నట్లెంచఁదగదు.

మ॥ కవులన్ బంకజగర్భ సన్నిభుల వక్కాణింతు వల్మీక సం
భవునిన్ వ్యాసుని గాళిదాసు బిలవున్ బాణున్ మయూరున్ మురున్
భవభూతిన్ శివభద్రు మల్హణుని ఘంటామాఘునిన్ జోరు భా
రవి మా నన్నయభట్టుఁ దిక్కకవి నేఱ్ఱాప్రగ్గడన్ సోమునిన్॥

అని వీరన్న సంస్కృత కవుల ముందు వక్కాణించి తరువాత తెనుగు కవులనుగూర్చి చెప్పుచు "మానన్నయభట్టు అని ఆరంభించెనుగాన నిట 'మా' అనుదానికి "నావంటి తెలుఁగుకవులని తాత్పర్యము చెప్పఁగొనఁదగు. అదిగాక లోకమునని 'మా' అను దానిని దమకుఁగల ప్రీతిని దెలుపుటకుఁగూడ వాడుచుందురు.

ఉ॥ ఇద్దఱుజోడు నన్నకవి యెఱ్ఱన, తిక్కనసోమయాజి కా
నద్దగువారికిన్, మఱికొక్కఁడె దీటగునల్లసాని "మా"
పెద్దన, వారితోడుతను పేరువహించిన శ్రీకణాదమున్
బెద్దనసోమయాజి వినుపెద్దనఁబోల్పఁ గవిత్వసంపదన్॥

అని యార్వేలనియోగియగు వెన్నెలకంటి వెంకటపతి తిక్కనస్తోత్రంగా కాణాద పెద్దన సోమయాజి తనగ్రంథమందు వ్రాసికొనిరి. ఇట "మా" అనుదానియర్థమేమి?

ఇదియును వైదియును పేరునుదెల్పునదియైయున్నది.

కావున నన్నయభట్టు కవి చరిత్రములోఁ జెప్పఁబడినట్లుగా వైదికుఁడనియే చెప్పవలసియున్నది.

ఏశాఖవాఁడైనను నీ కవిశిఖామణి రాజాస్థానములందు మిక్కిలిసన్మానములను బొందుచు విశేషప్రఖ్యాతిని గాంచిన మహాపండితవంశ ముక్తామణియనియు రాజును మెప్పించి వానివలనఁ జారుతర మహాగ్రహారములు వడసిన మహాసంపన్నుఁడనియు భారతపీఠికవలనఁ దేలుచున్నది ఈతని తలిదండ్రులు మొదలగువానిగూర్చి తెలిసికొనుట కాధారమేదియును లేదు. నారాయణభట్టను పండితశిరోమణి యీతనికిష్టుఁడును సహాధ్యాయుఁడునైన ట్లీక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది

ఉ॥ పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నా
రాయణునట్లు, తానును ధరాసురవంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁడుం దనకిష్టుఁడున్సహా
ధ్యాయుఁడునైనవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపగన్॥

## * వాసస్థలము *

ఈతనిపూర్వులు రాజనరేంద్రుని పూర్వుల నాటినుండియు వారికిఁ గులగురువులు గావున రాజనరేంద్రుని జనస్థానమే యీతనికిని జన్మభూమియై యుండవచ్చునని యెంచుకొనుటకుమాత్రము సందర్భము కలుగుచున్నది కాని యది యేదియో తెలిసికొనుట కాధారమేదియునులేదు. రాజనరేంద్రుఁడు రాజమహేంద్రపురాధినాథుఁడైనట్లీ క్రిందిపద్యము వలనఁ దేటపడుచున్నది.

అంబురుహము

రాజకులోత్తమ రాజమనోహర రాజితసూరి సభాంతర వి
భ్రాజిత సద్గుణపార్థివశేఖర పార్థసుసన్నిభ బాహుజనాం
భోజ వనద్యుమణీమణి కాంచనపుంజ విభూషిత భూమిసుర
వ్రాజసమాజ పరాక్రమ రాఘవ రాజిత రాజమహేంద్రపతీ॥

సభాపర్వము

ఇంతియె కాక పీఠికలో "అఖిలజలధివేలావలయ వలయిత వసుమతీవనితా విభూషణంబయిన వేఁగిదేశమునకు నాయకరత్నంబుం బోని రాజమహేంద్రపురంబందు" నిండోలగంబుండి తన్ను సగౌరవముగా భారతము దెనిఁగింపఁ గోరినట్లు నన్నయార్యుఁడే వ్రాసియున్నాఁడు. దీనినిఁబట్టి రాజనరేంద్రుఁడు రాజమహేంద్ర పురవాసియైనట్టు స్పష్టమైనది. చళుక్యవంశప్రభువులలో రాజమహేంద్రపురము ముఖ్యపట్టణముగాఁ

జేసికొని పరిపాలించిన [illegible]డితఁడేయని తోఁచుచున్నది. రాజనరేంద్రుని తరువాత నచిర కాలములోనే రాజమహేంద్రవరమున నివసించిన విన్నకోట పెద్దన్న యను కవివరుఁడు తనకృతికర్త యగు విశ్వేశ్వరమహారాజు వంశము నీక్రింది రీతినివర్ణించుటలో :—

సీ. శ్రీకంఠచూడాగ్రశృంగారకరణమే రాజునకన్వయారంభగురుఁడు
చాళుక్యవంశభూషణము శ్రీవిష్ణువర్ధనుఁడే మహీశుతాతలకుఁదాత
భృతకుమారారామ భీముండు చాళుక్యభీముఁడే నృపకులాబ్ధికి విధుండు
రాజమహేంద్రవరస్థాతరాజనరేంద్రుఁడెక్కువతాత యేవిభునకు

*  *  *

రాజనరేంద్రునిగూర్చి ముచ్చటించుచునితఁడు "రాజమహేంద్రవరస్థాత" యని యొకగొప్పవిశేషముగాఁజెప్పె. ఈవాక్యము రాజనరేంద్రునకును, రాజమహేంద్రవరమునకును నెక్కుడుసంబంధము కలదని తెల్పుచున్నది. దీనిచే నితఁడే యీపురమున భూపరిపాలన మొనరించిన మొదటి * చళుక్యప్రభువని తలంపవచ్చును.

ఈతండె యిందలి కోటను గట్టించినవాఁడను ప్రతీతికలదు. ఈపురనిర్మాణమును గూర్చిమాత్రమభిప్రాయములు భిన్నములుగానున్నవి. తొల్లి యోఢ్రదేశాధీశుండగు గౌతమదేవుఁడు గోదావరి వఱకును గల భూమినంతను నాక్రమించెననియు [illegible] పుత్రుండగు మహేంద్రదేవుఁడు రాజమహేంద్రవరమును గట్టించెననియు నాదేశమున నొక ప్రతీతిగలదు. చెన్నపట్టణమందలి విచిత్రవస్తు భాండాగారమున మెకంజిదొరవారు సంపాదించియుంచిన వ్రాతప్రతులలో నొకదానియందు మొదట చళుక్యరాజులిప్పుడు "బిక్కవోలు" అని పిలువంబడుచున్న బిరుదాంకరాయపురమును రాజధానిగాభూమి నేలిరనియుఁ దరువాత గుణాంకవిజయాదిత్యుఁడు ధవళగిరి సమీపమునందున్న యోమగిరి (వేమగిరి) దుర్గమును రాజమహేంద్రపురమును గట్టించెననియు వ్రాయఁబడియున్నది. ఇందులో నేదినిజమో తెలియుటలేదు. ఆరసిచూడఁగా నీరెండిటికంటె రాజనరేంద్రుఁడే యీపురనిర్మాణకారకుఁడనిన లెస్సగానుండునని తోఁచుచున్నది. ఇతనికి రాజమహేంద్రుఁడను నామమున్నదని యీక్రిందిభారతపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

ఉ. రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁడన్యరాజతే

---

* కవులచరిత్ర రాజనరేంద్రుఁడే రాజమహేంద్రవరమునందలి కోటను [illegible] వాఁడని నుడివియును గూడ నీపురమున మొదటపాలించినవాఁడు [illegible] చున్నది. పరరాజుల దండయాత్రల పీడవిశేషముగానున్న [illegible] పున రాజులు నివసింతురని [illegible]జనదని తోఁచెడిని.

జోజయశాలి శౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందు చంద్రికా
రాజితసర్వలోకుఁడపరాజిత భూరి భుజాకృపాణ ధా
రాజలశాంత శాత్రవ పరాగుఁడు రాజమహేంద్రుఁడున్నతిన్.

చాళుక్యవంశజులలో రాజమహేంద్రుఁడను పేరు గలవాఁడితఁడేగాక నితనికిఁబూర్వుఁడగు అమ్మరాజుకూఁడనున్నను నితఁడే యీబిరుదుచే మిగులఁ బ్రసిద్ధిఁగాంచిన వాఁడైయున్నాఁడు. ఈతనిపేరనే యీపురము వెలసియుండును. అందుమూలముచేతనే నన్నయభట్టారకుఁడు తనకుఁగల దేశాభిమానముచే భారతమున నర్జున తీర్థయాత్రా ఘట్టములో సంస్కృతములో లేని వేఁగివిషయవర్ణనమును దెచ్చిపెట్టియును నందుభీమేశ్వరమును (దాక్షారామ) శ్రీపర్వతమును (శ్రీశైలము) గోదావరిని మాత్రముగ్గడించె. గోదావరీ తీరమున రాజమహేంద్రపురమువంటి మంచి పురాతన పట్టణమొకటి యుండిన దానివర్ణింపఁడా యనుసంశయము కలుగుచున్నది. ఈరాజమహేంద్రుఁడే యీపురకారకుఁడు కాకుండినను నైనను నితఁడే యిందుఁబరిపాలించిన మొదటి విష్ణువర్ధనుఁడు గావున నితనిజన్మభూమి బిరుదాంకరాయపురమో వేమగిరియో యైయుండును. అట్లయిన మనకవివరునిదియును వీనిలో నేదో యొకటియని చెప్పకొనవచ్చును. చాలనన్నయ యెచ్చటివాఁడైనను కవినన్నయ్య యునికిపట్టు నిశ్శంకముగా రాజమహేంద్రవరమై యున్నది. నన్నపార్యుఁడు తాను రాజమహేంద్రవరకవియైనట్లీ క్రిందిపద్యమున సూచించుచున్నాఁడు ;—

క. రాజమహేంద్రకవీంద్రన । మాజసురక్ష్మాజరాజమార్తాండధరి
త్రీజననుతచారిత్రవి । రాజితగుణరత్న రాజరాజనరేంద్రా.

ఆదిపర్వము.

ఈపద్యాంతమున "రాజరాజనరేంద్రా" అను నామముతో సంబంధించిన సంబోధనమున్నదిగాన మొదట 'మరల రాజమహేంద్ర' యను నామమాత్రోచ్చారణమున్నదనుటకంటె "రాజమహేంద్రకవీంద్రసమాజ సురక్ష్మాజ" యని యేకసమాసముగునన్నుటయే లెస్స—భీమేశ్వరపురము భీమేశ్వరమనినట్లై రాజమహేంద్రపురమును రాజమహేంద్రమని వాడినట్లు గ్రహించునది.

ఈరాజమహేంద్రపురమప్పటికాలమునఁ గవీంద్రకుంజరములకుఁ జిత్త వికాసము నుగలిగించు చిత్రవన చిత్రితములగు చిన్న చిన్న గుట్టలచేఁ జుట్టఁబడి కవికులాహ్లాదకరములగు గోదావరీ ప్రవాహములచేఁ బోషింపఁబడు రమ్యోద్యాన మండితమై ప్రకృతిచిత్రములకును రమ్యహర్మ్యాది కృత్రిమచిత్రములకును గూడ నాలవాలమై యుండెడిది. ఇట్టిదివ్యక్షేత్రమునఁ బుట్టినదగుటనే మన యాంధ్రకవితాలతిక యాదినుండియు

నవనవలాడుచు బయలువెడలి మనోహరాకృతిచే నల్లిబిల్లిగా వ్యాపించి మృదుమధుర ఫలంబులనిచ్చుచున్నది.

## కాలము.

మన యాదికవికాలమును దెలిసికొనుటకు నతనికాశ్రయుఁడగు రాజనరేంద్రుఁడాధారమైయున్నాఁడు. రాజేకదా మనలకుఁ గాలపరిమాణమొసంగువాఁడు. అంతకన్నవేఱొండుమార్గము లేదు. మనలో దేశచారిత్రములంతగాలేకపోవుటచే రాజుల కాలములైనను సులభముగా నెఱుఁగఁబడునవికావు. వానికి, నాయారాజులొసంగుచు వచ్చిన దానశాసనములాధారమైయున్నవి. ఈశాసనములందు వ్రాత యొక్క కాలమును దత్పూర్వులక్రమమును నిచ్చుచుండుట యాచారమైయున్నది. కాని శాసనములను వెతకుటకుఁ బూర్వము మనమే రాజుకాలమును దెలిసికొనఁబోవుచున్నామో యారాజుయొక్క వంశక్రమమును దదితరవిషయములను సాధ్యమగునంతవఱకుఁ గృతులవలన విస్పష్టముగాఁ దెలిసికొనవలెను. అట్లుగాకున్న నొక్క పేరుగలరాజులే పల్వురుండుచువచ్చుటచే బ్రమాదములపాలగుదుము. మనదేశమును బూర్వము పాలించినవారిలో రాజరాజులనేకులు కలరు. వీరిలోనీరాజరాజెవరో తిన్నఁగా నిర్ధారణముచేసికొనఁజాలక యిదివఱకు మనదేశచారిత్రముల వ్రాసినవారు కొందఱు పెడత్రోవలఁబడి యసంగతాంశములను వ్రాసియుంచిరి. మనదేశచారిత్రములను వ్రాసికొనుటకుఁదగిన త్రోవనుజూపిన 'బర్నెలు' 'బ్రవును' మొదలగు ఖండాంతరపండితులు బహునిపుణముగా మనదేశచారిత్రాంశములను గనిపెట్టి యీచరిత్రములను జక్కఁగావ్రాసినను నీరాజరాజుల విషయములో భ్రమాక్రాంతులై భారతమును కృతినందిన రాజరాజు వైష్ణవమతస్థుఁడనివ్రాసిరి. ఇది గొప్పప్రమాదము. ఈరాజరాజు "పార్వతీపతి పదాబ్జధ్యాన పూజారతుఁడు" అని భారతమందలి యీక్రిందిపద్యములవలనఁ దెలియవచ్చుచున్నది.

క. వీరశ్రీవనితాశ్రిత । భూరిస్థిరబాహుదండ బుధనుతసుగుణా
ధారకలియుగపవిత్రపు । రారాతి పదాబ్జ పూతనాసక్తమతీ.

క. శ్రీరాజరాజ వీర । శ్రీరమణీరమ్యగంధసింధుర హయశి
క్షారూఢదక్షదక్షమ । భూరిదయాలబ్ధ సుస్థిరైశ్వర్య పదా.

ఈరాజనరేంద్రుఁడు శివభక్తుఁడని దెల్పుపద్యములు భారతమున నింకనుజాలకలవు. ఇట్టివాని వైష్ణవమతస్థుఁడనుట యసంగతము. వైష్ణవమతస్థుఁడగు రాజరాజు నొకఁడు కలఁడు. ఆతఁడు కాకతీయవంశస్థుఁడైయుండునుగాని యీవంశములోనివాఁడు కాఁడు. వానినె వీనినిగాభ్రమించి ఖండాంతరపండితులీప్రమాదమునకు లోనైరి. కావున

శాసనములవలన నీరాజరాజుకాలమును నిరూపించుటకుఁ బూర్వమీతనిచారిత్రమెట్టిదో యీతనిపూర్వులెవరో మనభారతమువలనఁ దెలియునంతవఱకు గ్రహింతము.

## ——*కృతిపతివంశము.*——

దైవవశమున శ్రీనన్నయభట్టారకుఁడు రాజరాజనరేంద్రుని వంశమునుగూర్చిన విషయములు పెక్కిటిని దావ్రాసిన యాశ్వాసాద్యంతపద్యములలోనిమిడ్చి యున్నాఁడు. ఆపద్యములనుబట్టి యాతనిచారిత్రము చాలవఱకు గ్రహింపవచ్చును. అందు వాడంబడిన బిరుదులావంశమందలి వానివాని నంపాదించిన రాజులఁ జక్కఁగాబోధించుచున్నవి కాన భారతము నేయాధారముగాఁగొని రాజనరేంద్రుని వంశమును గనుఁగొందము.

మనదేశరాజులు సూర్యకులులు, చంద్రకులులు. అగ్నికులులు అని మూఁడు తెగలవారైయున్నారు. అందులో నీతఁడేకులమువాఁడో మొదట తెలిసికొనవలసియున్నది.

క. శ్రీజయ విభాసి వినమ । ద్రాజన్య కిరీట మణి విరాజిత పాదాం
భోజుఁభువనైక మందిర । రాజాన్వయ తిలక రాజరాజనరేంద్రా.

ఇత్యాది పద్యములచే నీతఁడుచంద్రవంశ్యుఁడని తెలియవచ్చుచున్నది. అందులో

[illegible] వివర్జితమాన । వ్యసగోత్ర పవిత్ర విష్ణువర్ధన నృప స
త్తమ సముద్రముద్రితాఖిల । వసుధాజన గీతకీర్తి వాసవమూర్తీ.

దీనిచే నీతఁడు మానవ్యగోత్రజుఁడని విశదమగుచున్నది. అందులో

క. శ్రీలలనా స్తనఘటిత వి । శాలోరస్థల వివేక చతురానన వా
ణీ లీలాస్పద విలస । చ్చాళుక్యా న్వయపయోధి సంపూర్ణశశీ.

దీనిచేనీతఁడు చాళుక్యవంశమువాఁడని బోధపడుచున్నది. చంద్రకులులును మానవ్య గోత్రులును నగు చాళుక్యుల శాసనము లీదేశమునందుఁ బెక్కులు కలవు. వానిలో నీచాళుక్యులపూర్వుఁడైన విజయాదిత్యుఁ డయోధ్యానగరమునుండి విజిగీషచే దక్షిణాపథముపై దండెత్తివచ్చి యాదేశపాలకుఁడగు త్రిలోచన పల్లవునితో యుద్ధము చేసి దైవవశమున స్వర్గప్రాప్తుఁడుకాఁగాగర్భవతియైయుండియుఁ బతివెంటవచ్చినయాతని మహాదేవి పురోహితునితోడను వృద్ధామాత్యాదులతోడను" ముట్టీము నామాగ్రహారము"నకుఁ బాఱిపోఁగా నాగ్రామవాస్తవ్యుఁడగు విష్ణుభట్టసోమయాజియను బ్రాహ్మణోత్తముఁడు దయార్ద్రహృదయుఁడై యాసాధ్వినాదరించి తనయింటనుంచుకొని యామెను గన్నకూతుంగాఁజూచెవనియుఁ దరువాత నామెకు మొగశిశువు కలుగఁగా నామె వానికి రాజోచితములగు జాతకర్మాది సంస్కారములఁ జేయించి విష్ణువర్ధనుఁడను పేరిడి వానిని వంశోననియు నాతిండును బ్రాజ్ఞుఁడై తల్లివలన యావద్వృత్తాంతమును నెఱింగి చాళు

క్యపర్వతమునకుఁబోయి యచట గౌరినిఁగూర్చి తపంబొనరించి యామహాదేవి యనుగ్రహమువలన సర్వశక్తిసంపన్నుండై వచ్చి గాంగులను గదంబులను జయించి నర్మద మొదలు సేతువువఱకును గల దక్షిణాపథమును బరిపాలించెననియుఁ జెప్పఁబడియున్నది. అంతటినుండియు నీవంశజులకుఁ జాళుక్యులను పేరువచ్చినది. ఈవంశములోనివాఁడే రాజనరేంద్రుఁడునై నట్లు మనకుఁబై పద్యమువలన విస్పష్టమైనది. అయినను నంతమాత్రముచే మనకుఁజిక్కులింకను విడియుండలేదు. ఈచాళుక్యులు రెండు శాఖలవారై కళ్యాణపురమున నొకశాఖవారును వేఁగిని (బిక్కవోలునో) రాజధానిఁగాఁ జేసికొని యొకశాఖవారును రాజ్యము చేసిరి. వీరిలో మొదటివారిని బశ్చిమచాళుక్యులనియు, రెండవ వారిని బూర్వచాళుక్యులనియు వ్యవహరింతురుగాన నీతఁడీ శాఖలలో దేనికి సంబంధించినవాఁడో తెలిసికొనవలసియున్నది.

క. శ్రీవనితావల్లభ «వేఁ। గీవిషయాధీశ» కావ్యగీతిప్రియ నా
నావనినాథకిరీటత। టీవిలసద్రత్నసంఘటితపదకమలా.

ఇత్యాదులచే నీతఁడు వేఁగీవిషయాధీశుఁడనఁగాఁ బూర్వచాళుక్యశాఖవాఁడని బోధపడుచున్నది. ఈపూర్వచాళుక్యులలోఁగూడ రెండుశాఖలు కలవు గావున నీతనిపూర్వులనుగూర్చికూడ కొంతచర్చింపవలసియున్నది.

క. «సత్యాశ్రయకులశేఖర» । నిత్యోదయ రాజరాజనృప సుకవిజన
స్తుత్య మహాగుణవిమలా । దిత్యాగ్రతనూజ విమలధీరమణీయా.

దీనిచే నీతఁడు సత్యాశ్రయుని కులమువాఁడని వెల్లడియగుచున్నది. చళుక్య పర్వతమునకుంబోయి తపస్సుచేసిన విష్ణువర్ధనుఁడు కాంచీపురము రాజధానిగాఁ గల పల్లవరాజుకూఁతును దేవినిగాఁగొనెను. వారిరువురకును విజయాదిత్యుఁడు కలిగె. ఈతని పుత్త్రుఁడు పులకేశివల్లభుఁడు. అతని సుతుఁడు కీర్తివర్మ. ఈతని తనయుఁడు సత్యాశ్రయుఁడు. ఈతఁడే చాళుక్యులు మనదేశమునకు రాజులగుటకు ముఖ్యుఁడు. ఈతఁడు మిక్కిలి బలపరాక్రమములు కలవాఁడై బహుదేశములు జయించి యీవేఁగిదేశమునుగూడ నాక్రమించుకొని యిట తనతమ్ముఁడగు కుబ్జవిష్ణువర్ధనుని యీదేశ పాలనమునకు క్రీస్తుశకము 615 వ సంవత్సరమున నియమించె. ఈసత్యాశ్రయుని వంశములోనివాఁడు మనకృతిపతి.

మత్తకోకిల. రాజభూషణనిత్యసత్య సరస్వతీ విలసన్ముఖాం
భోజరాజమనోజ భూజనపూజ్యమాన మహాయశో
రాజహంసపయోజినీవనరమ్యదిఙ్ముఖవిక్రమా

ద్విజితాహిత విష్ణుసన్నిభ "విష్ణువర్ధనభూపతీ."

ఇత్యాదులచే రాజనరేంద్రుఁడు విష్ణువర్ధనబిరుదు గలవాఁడని కాన్పించుచున్నది. ఈపేరీరాజరాజులలో మొదటవహించినవాఁడు పైసత్యాశ్రయుని తమ్ముఁడగు కుబ్జవిష్ణువర్ధనుఁడు. ఈతఁడన్నచే నీదేశమునఁదనకుఁ బ్రతినిధిగానుంచఁబడినను దరువాత దేశమునకు స్వతంత్రరాజై 616 మొదలు 633 వఱకును బదునెనిమిది వత్సరములు రాజ్యముచేసెను. పైబిరుదీతని సంతతివాఁడు రాజరాజని స్పష్టముచేయుచున్నది. ఈబిరుదీవంశస్థులకుఁ బల్వురకుఁగలదు. రెండవ విష్ణువర్ధనుఁడు 663-672 వఱకును, మూఁడవయాతఁడు 709-746 వఱకును, నాలవ యాతఁడు 764-799 వఱకును, . నైదవ వాఁడు 843-844 వఱకును, నాఱవవాఁడు 918 మొదలు 925 వఱకును, నేడవ వాఁడు 934-945 వఱకును నీనేలనేలిరి. ఎనిమిదవ యతఁడు రాజరాజనరేంద్రుఁడే. మఱియును.

క. శ్రీకీర్తి శ్రీవల్లభ। లోకజనస్తుత్య "సర్వలోకాశ్రయ" ర
త్నాకరపరికృత సకల ధ। రాకాన్త జితారి రాజరాజనరేంద్రా.

ఇందలి సర్వలోకాశ్రయబిరుదును మొదటఁగాంచినవాఁడు రెండవ విష్ణువర్ధనుఁడు. విష్ణువర్ధనుని తరువాత నాతని జ్యేష్ఠపుత్త్రుఁడగు జయసింహుఁడు 633-663 వఱకును రాజ్యముచేసెను. అటుపిమ్మట యతని తమ్ముఁడగు నింద్రభట్టారకుఁడు రాజై యేడు దినములు రాజ్యముచేసెను. అనంతరమున నతనిపుత్త్రుఁడగు నీవిష్ణువర్ధనుఁడు సర్వలోకాశ్రయాది బిరుదావళులను బూని 663 మొదలు 672 వఱకును వేంగీదేశమును శాశించెను.

అటుపైన నీరెండవ విష్ణువర్ధనుని పుత్త్రుఁడగు మంగియువరాజును నీసర్వలోకాశ్రయబిరుదునూని 672-696 వఱకును భూపరిపాలనము నొనరించెను. పిమ్మట నైదవవిష్ణువర్ధనుఁడును నీబిరుదును దాల్చెను. ఇంకను.

క. శ్రీమచ్చళుక్యవంశ శి। ఖామణిమనుమార్గ "రాజకంఠీరవ" ధై
ర్యామరధరణీధరధర। భీమండన ధర్మనిరత నిత్యాభ్యుదయా.

ఇందలి రాజకంఠీరవ (నరేంద్రమృగరాజ) బిరుదమును మొదటఁ జేకొనినవాఁడు నాలవవిష్ణువర్ధనుని సుతుఁడగు విజయాదిత్యుఁడు. మంగియువరాజు తరువాత నతని ప్రథమపుత్త్రుఁడగు జయసింహుఁడు రాజ్యమునకువచ్చి 696 మొదలు 709 వఱకును రాజ్యముచేసెను. పిమ్మట నతని సవతితమ్ముఁడగు కొక్కిలి (కకిలి) రాజు తొమ్మిది నెలలు పరిపాలించె నటుపైన నీకొక్కిలిరాజును సింహాసనవిహీనునింజేసి యతని జ్యేష్ఠభ్రాతయగు (మూఁడవ) విష్ణువర్ధనుఁడు 709-746 వఱకు రాజ్యము నొనరించె. పైన నతని

పుత్త్రుఁడగు విజయాదిత్యుఁడు 746-764 వఱకును నాపైనతని కొడుకగు నాలవవిష్ణువర్ధనుఁడు 764-799 వఱకును బరిపాలనమొనరించెను. పిమ్మటనాతని పుత్త్రుఁడగు నీనరేంద్రమృగరాజు రాజ్యమునకువచ్చి 799-843 వఱకును భూభారమును వహించె. ఇతనికే "సమస్తభువనాశ్రయుఁ" డను బిరుదును గలదు. అది భారతమున నీక్రిందిపద్యమునఁజూపఁబడియున్నది.

ద్రుతవిలంబితము. త్రిభువనాంకుశదీప్తినిధీ "సమ । స్తభువనాశ్రయ" ధర్మధురంధరా
శుభయశఃపరిశోభితపూర్వది । క్ప్రభువిలాస కృపారసబంధురా.

ఇందలి త్రిభువనాంకుశ బిరుదమును మొదటదాల్చినవాఁడమ్మరాజవిజయాదిత్యుఁడు. మఱియును.

క. "బిరుదాంకభీమ" భీమే । శ్వరకృతకృత్యప్రసాదసౌజన్యగుణా
భరణపరగండభైరవ । పరనృపమణిమకుటఘటితపదవిబుధనుతా.

ఈచాళుక్యులలో భీమాంకము మొదటకలవాఁడు చాళుక్యభీముఁడు. నరేంద్రమృగరాజు తరువాత నతనియాత్మజుఁడగు (అయిదవ) విష్ణువర్ధనుఁడు 843-844 వఱకును నతనితనూజుఁడగు గుణాంకవిజయాదిత్యుఁడు 844-888 వఱకును రాజ్యముజేసిరి. ఈ గుణాంకవిజయాదిత్యుఁడే రాజమహేంద్రపురమును గట్టించినట్లు మెకంజీదొరవారు సంపాదించియుంచిన వ్రాతప్రతులలో నున్నది. ఇతఁడే వేమగిరి దుర్గమునుగూడ కట్టించెను. ఇతనికి యుద్ధమల్లుఁడని, యువరాజవిక్రమాదిత్యుఁడని యిద్దఱుతమ్ములు. ఇతనితరువాత నతనితమ్ముని నందనుఁడగు చాళుక్యభీముఁడు రాజ్యమునకువచ్చి 888 మొదలు 918 వఱకు నీదేశమును శాసించెను. ఇంకను.

క. విద్యావిలాసపార్థివ । విద్యాధరనిఖిలరాజవిద్యానిధిశ్రీ
తద్యుతి విశదయశఃప్రక । రద్యోదితసర్వలోక "రాజమహేంద్రా."

ఇందలి రాజమహేంద్ర బిరుదమును మొదటఁ గైకొనినవాఁడమ్మరాజవిష్ణువర్ధనుఁడు. చాళుక్యభీముని తరువాత నతని జ్యేష్ఠపుత్త్రుఁడగు విజయాదిత్యుఁడు 918 సంవత్సరములో నాఱుమాసములు రాజ్యముఁజేసి మృతుఁడుగాఁగా నతనికొడుకగు నీయమ్మరాజు రాజ్యమునకు వచ్చి 918-925 భూమినేలెను. రాజమహేంద్ర బిరుదముచే మిగులఁ బ్రసిద్ధినిఁగన్నవాఁడు రాజనరేంద్రుఁడుగాని యీతఁడు కాఁడు. మఱియును:-

క. ఆదిక్షత్త్రచరిత్ర ధ । రాదేవాశీఃపరంపరావర్ధితని
త్యోదయసద్యోతితవిమ । లాదిత్యతనూజ "విక్రమాదిత్యనిభా.

ఇందు జెప్పఁబడిన విక్రమాదిత్యుఁడు నీచాళుక్యవంశములో పందొమ్మిదవవాఁడై

యున్నాఁడు. అమ్మరాజుతరువాత నతని జ్యేష్ఠపుత్త్రుఁడగు విజయాదిత్యుఁడు 925 సంవత్సరములో పదునేనుదినములు రాజ్యముచేసిన తరువాత నీతనిని యుద్ధమల్లుని కుమారుఁడగు తాళరాజు రాజ్యపదభ్రష్టునిఁజేసి తాను నెలదినములు రాజ్యముచేసినతరువాత జాళుక్యభీముని రెండవకొడుకగు నీవిక్రమాదిత్యుఁడీతని జంపి 925-926 వఱకు వేంగీత్రికలింగదేశములనుఁ బాలించె. ఇంకను :—

క. రాజమహేంద్రికవీంద్రస । మాజసురక్షాత్మజ "రాజమార్తాండ" ధరి
త్రీజననుతచారిత్రవి । రాజిత గుణరత్న రాజరాజనరేంద్రా.

ఇందలి రాజమార్తాండబిరుదమును మొదటఁ జెందినవాఁడు చాళుక్యభీమవిష్ణువర్ధనుఁడు. విక్రమాదిత్యుని జయిఁచి యమ్మరాజు కొడుకైన భీముఁడు 926-927 వఱకును బాలించినపిమ్మటఁ దాళరాజు కొడుకగు యుద్ధమల్లుఁడు వానిజంపి 927-34 వఱకును రాజ్యముచేసెను. తరువాత నమ్మరాజవిష్ణువర్ధనుని సవతితమ్ముఁడగు నీరాజమార్తాండుఁడు యుద్ధమల్లునిఁ దోసిరాజని తాను 934-945 వఱకు భూభారముఁదాల్చెను. మఱియును :—

క. శ్రీరమ్య ధర్మనిత్య । ప్రారంభవిభాసి "రాజపరమేశ్వర" ఘోరారిమదకుంభికుంభవి । దారణ దారుణకృపాణదక్షిణహస్తా.

ఇందలి రాజపరమేశ్వరబిరుదము మొదటఁ బొందినాతఁడు పైరాజమార్తాండుని సుతుఁడగు నమ్మరాజవిజయాదిత్యుఁడు. ఇతనికే త్రిభువనాంకుశుఁడను బిరుదుసుగలదు. ఇతఁడు 945-970 వఱకు భూపాలన మొనరించెను. ఇంకను :—

క. శ్రీదయితోరస్థల "విమ । లాదిత్యాత్మజ" నిరంతరానందమతీ
కోదండపార్థనిఖిలధ । రాదేవస్తుత్యరాజరాజనరేంద్రా.

దీనివలన నీరాజరాజనరేంద్రుఁడు విమలాదిత్యుఁడనియు విశేషించి పైపద్యములో నొకదానివలన నగ్రతనూజుఁడనియుఁ దెలియవచ్చుచున్నది. రాజపరమేశ్వరుని తరువాత నతని సవతితమ్ముఁడగు దానన్నపాలుఁడు రాజ్యమునకువచ్చెను. ఇతఁడు 970-973 వఱకును మూడేండ్లు రాజ్యముచేసిన తరువాత 1003 వఱకును దేశమరాజకమై యుండెను. పిమ్మట దానన్నృపుని పెద్దకొడుకగు శక్తివర్మ 1003-1015 రాజ్యమొనరించె నటుపైన నతనితమ్ముఁడగు నీవిమలాదిత్యుఁడు రాజై 1015-1022 వఱకును రాజ్యమొనరించెను. ఈతఁడు చోడదేశాధీశుఁడగు రాజరాజ రాజకేసరివర్మకూఁతురగు కుందవాంబాదేవినిఁ బరిణయమై యామెవలన మనకృతిపతియగు రాజరాజనరేంద్రునిఁగనియె.

ఇట్టి వంశక్రమముగల రాజరాజనరేంద్రుని కాలము తెలిసి కొనుటకెంత నెంతమాత్ర

మును గష్టములేదు. ఈతనివంశమును గాలమును దెలుపుశాసములెన్నియో ఘనదేశమున నున్నవి. ఇంచుమించుగా వానియందన్నిటియందును శైవంశానుక్రమణిక యీఁబడుచునె వచ్చినది. ఈశాసనములలో నాయారాజుల కాలవిషయమున మాత్రమించుక వ్యత్యాసములుకలవు. అయినను బలుశాసనముల సందర్భము నాలోచించి పైపట్టికలోని రాజులకాలము లాప్రకారముగా నీయఁబడినవి. ఈవంశక్రమమునుగూర్చి చదువరుల హృదయములు నిశ్శంకములుగా నుండుట్కై యీరాజనరేంద్రుని మనుమఁడగు వీరచోళుఁడు తాను బ్రాహ్మణుల కొసంగిన చేబ్రోలు సమీపమందలి వీరచోళచతుర్వేది మంగళాగ్రహారముంగూర్చిన శాసనము నీక్రింద నుదాహరింతము.

ఈశాసనము శాలివాహనశకము 1023 సంవత్సరమునకు సరియైన వృషసంవత్సరమునఁ బుట్టినది.

"శ్రీమాన్ * * * * * సోమోమహేశ్వర శిఖండకృతాదృతిర్యః తస్మాత్ * * * ఉదయనః తత్ప్రభృ త్యవిచ్ఛిన్నసంతానే ష్వయోధ్యాసింహాసనాసీనే ష్వేకోనషష్టి చక్రవర్తిషు గతేషు తద్వంశ్యో విజయాదిత్యనామారాజా విజిగీషయా దక్షిణాపథంగత్వా త్రిలోచనపల్లవమధిక్షిప్య దైవాద్ధరిహాయాల్లోకాంతరమగమత్ తస్యనంకులే పురోహితేన వృద్ధామాత్యైశ్చ సార్ధమంతర్వత్నీ తస్యమహాదేవీ "ముడ్డివేమునామాగ్రహార" ముపగమ్య తద్వాస్తవ్యేన విష్ణుభట్టసోమయాజినా దుహితృనిర్విశేషమభిరక్షితాసతీ విష్ణువర్ధనం నందనమసూత ; సాచతస్యకుమారస్య కులక్రమోచితాని కర్మాణి కారయిత్వాతమవర్ధయత్. సచమాత్రావిదితవృత్తాంతో నిర్గత్య చాళుక్యగిరౌ నందాభగవతీంగౌరీ మారాధ్య కుమారనారాయణ మాతృగణాంశ్చసంతర్ప్య శ్వేతాతపత్రైకశంఖ పంచమహాశబ్దాదీని కులక్రమాగతాని నిక్షిప్తా నీవసామ్రాజ్య చిహ్నాని సమాదాయ కదంబ గంగాదిభూమిపాన్నిర్జిత్య సేతునర్మదామధ్యం దక్షిణాపథం సాలయామాస * * * * తత్సుతః పులకేశివల్లభః తత్పుత్రఃకీర్తి వర్మాతస్యతనయః శ్రీమతాంసకలభువనసంస్తూయమాన మానవ్యసగోత్రాణాం * * * చాళుక్యానాం కులమలంకరిష్ణో స్సత్యాశ్రయవల్లభేంద్రస్య భ్రాతాకుబ్జవిష్ణువర్ధనో ద్వాదశవర్షాణి వేంగీదేశ మపాలయత్. తత్సుతో జయసింహవల్లభ స్త్రయస్త్రింశతం, తదనుజ ఇంద్రభట్టారక స్సప్తదినాని తత్సుతో విష్ణువర్ధనో నవవర్షాణి తత్సూనుర్మా(*)యువరాజః పంచవింశతిం తత్పుత్రో జయసింహస్త్రయోదశ, తదనుజః కొకలిష్షణ్మాసాన్ తస్యభ్రాతా విష్ణువర్ధనస్తముచ్చాట్య సప్తత్రింశతం (వర్షాణి) తత్పుత్రో విజయాదిత్యష్షోడశ, తత్తనయో విష్ణువ

---

(*) ఇటమూలము ఛిద్రమైయున్నది.

ర్ధనషట్త్రింశతం, తత్సుతో నరేంద్రమృగరాజోఽష్టాచత్వారింశతం, తత్సుతః కలివిష్ణువ ర్ధనోఽప్యర్ధవర్షం, తత్సుతో గుణగవిజయాదిత్యశ్చత్వారింశతం (వర్షాణి) తద్భ్రాతుర్వి క్రమాదిత్యస్య తనయశ్చాళుక్య భీమస్త్రింశతం, తత్సుతః కొల్లభిగండవిజయాదిత్య షణ్మా సాః తత్సుతోఽమ్మరాజః సప్తవర్షాణి తత్తనయంబాలముచ్చాట్య తోడపోమాసమే కం తంజిత్వా విక్రమాదిత్య ఏకాదశమాసాః తత్తోడపరాజసుతో యుద్ధమల్లస్సప్త తముత్పాట్య దేశాదమ్మరాజానుజో రాజభీమో ద్వాదశ, తత్సూనురమ్మరాజః పం చవింశతిం తస్యద్వైమాతురో దాననృపస్త్రీణి తతస్సప్తవింశతివర్షాణి దైవహరిహయాత్ వేంగీమహిరనాయకాభవత్ తతోదాననృపసుతశ్శక్తివర్మనృపో ద్వాదశాహాని భూమిమ పాలయత్.

శ్లో. తతస్తదనుజస్సప్త । వత్సరాన్ఖ్యాతవత్సలః
విమలాదిత్య భూపాలః । పాలయామాసమేదినీం.

శ్లో. తత్తనయోనయశాలిజయలక్ష్మీధామరాజరాజనరేంద్రః
చత్వారింశత (మ) బ్దానేకంచపునర్మహీమపాలయదఖిలామ్."

* * * * * * *

యీశాసనమువలన విమలాదిత్య తనూజుఁడగు నీరాజరాజు నలువదియొక్కసంవ త్సరములు వేఁగీదేశమును బాలించినట్లు తెలియవచ్చుచున్నది.

ఇఁక నీతఁడు పాలించిన కాలమేదో యది తెలిసికొనవలసియున్నది. దానినీతని శాసనమే రూఢిపరచుచున్నది. ఈమనకృతిపతి యొకానొక చంద్రగ్రహణకాలమందు చీదమార్యుఁడను బ్రాహ్మణునకుఁ గోరుమిల్లియగ్రహారమునిచ్చె. ఆశాసనమునం దితని కాలమునుగూర్చి యిట్లునుడువఁబడి యున్నది.

శ్లో. తస్మాచ్చాళుక్యచూడామణిరథవిమాలదిత్యదేవాన్మహీశా
చ్చోడక్ష్మాపాలలక్ష్మ్యా ఇవరచితతనోఃకుండవాయాశ్చదేవ్యా
జాతశ్శ్రీరాజరాజోరజనికరకుల శ్రీమదంబోధిరాజో
రాజద్రాజన్యసేవ్యామ భృతభుజబలాద్రాజ్య లక్ష్మీంపృథివ్యాః

శ్లో. యోరక్షితుం వసుమతీమ్ శకవత్సరేషు
వేదాంబురాశినిధి వర్తిషు సింహగేర్కే
కృష్ణద్వితీయ దివసోత్తర భాద్రికాయాం
వారే గురోర్వణిజలగ్నవరేభిషిక్తః."

వీనిచేనీతండు శాలివాహనశకము 944 వసంవత్సరమున శ్రావణబహుళ ద్వితీయా గురువారమునాఁడుత్తరాభాద్ర నక్షత్రమున సింహాసనమునకు వచ్చినట్లు స్పష్టమగుచున్న

ది. కావునసీతఁడు క్రీస్తుశకము 1020-1063 వఱకును రాజ్యముచేసెను.

కాన నన్నయభట్టారకుఁడు పదునొకండవ శతాబ్దమునాటివాఁడని తెలియవచ్చుచున్నది. ఈకాలమీదేశమునకు మిక్కిలిమంచికాలము. ఈవఱకును రాజోపద్రవములచేఁ బీడింపఁబడిన యీదేశమీపరగండభైరవుండగు రాజమహేంద్రుని కాలములో స్వస్థతనంది దివ్యసుఖము ననుభవించెను. ఇట్టిచల్లనికాలమున మనయాంధ్రకవితాసతి యుద్భవించినది. కావుననే చక్కఁగాఁ బెరిగి పెద్దయగుట కలిగినదనిచెప్పవచ్చును.

అప్పకవి తనవ్యాకరణములో—

ఉ. ఎన్నఁగ నన్నయాఖ్యకవి యీకలికాదినిఁ జెప్పదానిభీ
మన్నహరించెఁ గ్రమ్మఱమహాత్ముఁడు రాజనరేంద్రుపట్టితా
మొన్ననొసంగెవిప్రునకు మూలమతండొనరించెఁ డీకనా
కన్నదిమున్నువిన్నదియుఁగాదు మహాద్భుత మబ్బెనాకిటన్.

అని నన్నపార్యుఁడు కలియుగమునకాదిని నున్నవాఁడని చెప్పెనుగానియది నిర్మూలము.

ఈతఁడు 12 వ శతాబ్దమునాటివాఁడ * ని బర్నెలుమొదలగు ఖండాంతరులు వ్రాసినదియు నిరాధారపుమాటయే.

—* నన్నపార్యుని విద్యాభ్యాసము *—

ఈమహనీయుఁడు విద్యనభ్యసించునాటికిప్పుడు మనవారిచేఁ బంచకావ్యములని చదువుకొనఁబడు రఘువంశాదులు చేయఁబడియున్నవి. పాణిని వ్యాకరణాది సమస్తశాస్త్రములును పరిపూర్ణములై యున్నవి. శూద్రక కాళిదాస దండిభవభూతి మయూరాదులచే విరచితములై యతిరసవంతములైన కావ్యములును నాటకములును దేశమునఁ బ్రబలియున్నవి. ఛందశ్శాస్త్రము పరిపూర్ణమైయున్నది. ద్రావిడభాషయుఁ బ్రాకృతవాణియు మంచియౌవనదశయందున్నవి. కనుక నీమహాకవి "నానాపురాణ జ్ఞాననిరతుఁడై" "అనేకార్థ ధర్మశాస్త్రముల తెఱంగెఱిఁగి" "ఉదాత్తరసాన్విత కావ్యనాటకక్రమములు పెక్కుచూచి" "జగత్పరిపూజ్యములైనయీశ్వరాగమములయందు బుద్ధినిల్పి" నిరుపమానమగు పాండిత్యమును సంపాదించె. లోకశాస్త్రాద్యవేక్షణము కలిగి న

---

* And Nannaya Bhatta (a native of the east coast) composed under his patronage (about 1180 A. D.) a Telugu Grammar in Sanscrit. *(Burnell's Palæography.)*

త్ప్రతిభాంచితమై గోదావరీతీరమునఁ బ్రకాశించిన యీకవికోహినూరువల్లఁ బుట్టిన యాంధ్రకవితాసతి మొదటినుండియు వన్నెఁగాంచుట యొకయబ్బురమా ?

—* నన్నయభట్టారకుని గుణము: *—

ఈతనిగుణములనుగూర్చి తెలిసికొనుటకు నితనిచేవిరచింపఁబడిన భారతము తక్క మఱియొండేదియు మంచియాధారము లేదు. కృతినిబట్టి కృతికర్తయొక్క గుణాగుణములను గనిపెట్టుటకష్టము. కావ్యములు కవియొక్క యూహలకుఁ బ్రతిబింబము లేకాని నీతివిషయమునఁజెప్పుటకన్నఁజేయుట ముఖ్యము. చేఁతలో నెట్లున్నను వ్రాఁతలో నీతులఁ గుమ్మరింపని వారుండరు. కావున గ్రంథములు తత్కర్తలవృత్తులఁదెల్పఁజాలవు గాని వారిహృదయములందుఁగల గుణాధికత యెంతవఱకున్నదో తెల్పఁగలవు. ఈతఁడు తనగ్రంథమునందు దొరకినచోట్లనెల్ల మూలగ్రంథములో లేకున్నను విస్పష్టముగాఁగొన్నిచోట్లను నర్థాంతరన్యాసములమూలముగఁ గొన్నితావులను జక్కనినీతులఁదెల్పుచువచ్చె, నిత్యసత్యతను సాధుసంగతిని దయాశౌచాదులను విశేషించి వర్ణించుచువచ్చె. తాను గ్రంథపీఠికలోఁ దనవిషయమును జెప్పుకొనుచోట నహంకారమును దెల్పునట్లుగా నుత్తమపురుషమందుఁగాని మధ్యమపురుషమందుఁగాని యుంచి చెప్పుకొనక ప్రథమపురుషయందుఁదెల్పుట గ్రంథారంభమునఁ బండితసభల నెంచుట మొదలగునవి యీతఁడు వినయవిధేయతలు కలవాఁడని సూచించుచున్నవి. తానువాగనుశాసనాది బిరుదావళులచేనొప్పుచు మహారాజుచే మిక్కిలి గౌరవింపఁబడుచు మహాకవియైయుండియుఁ దనమిత్రుఁడగు నారాయణభట్టు తనకుసహాయముఁజేసెనని గ్రంథమందు దానువ్రాయుటచే నీతఁడు కృతజ్ఞుఁడు నీతిమంతుఁడునై యుండునని యూహింపఁదగియున్నది.

జగద్ధితమునకై దుర్గమార్గజలగౌరవభారతవాహినీ సముద్రమునీఁది కవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తితో నారసి మేలునా నితరులక్షరరమ్యత నాదరింపఁ బంచమవేదమును దెలుఁగున నానారుచిరార్థసూక్తులతోఁ దేటతెల్లమొనరించి స్వస్థానవేషభాషామతంబులనుజ్జీవింపఁజేయుటకై తన జీవితమును ధారపోసి విశ్వశ్రేయంబొడఁగూర్చిన యీకవివరుని, భారతము సుజనుఁడని తెల్పుచున్నను, లోకముమాత్ర మీతని యందు వసహానదోషమును నిరూపించుటలో వెనుదీయుటలేదు. ఈతనియందట్టి దోషారోపణముఁజేయుకథలు రెండుగలవు. పరికించిచూడ నీరెండుకథలునుగూడ మనపూర్వులుతమ బుద్ధివిశేషముచేఁ దాముగల్పించియుంచినవే కాని నిజమైనగాథలు కావని తోఁచుచున్నది, మనవారు సచ్చరిత్రములవ్రాయుటలో నెంతవెనుక నుండిరో యిట్టియసత్కథలు పన్నుటలో నంతముందుకువచ్చియున్నారు, నిర్వ్యాపారిత్వప్రీతులగు నీబుద్ధిమంతులిట్టి

కథలుకల్పించుటలోఁ దమబుద్ధివిశేషమును జూపుచున్నామని సంతోషించుచు వచ్చి రేకాని వానివలన నొకమహనీయుని నిర్మలయశస్సునకు భంగము కలుగుచున్నదని గ్రహింపలేకపోయిరి. అసత్యములేయైనను లోకమునవ్యాపించియున్న యాకథలిందుసుదాహరింపఁబడవలసినవాయెను. అంతియకాక యీకథలును గొంత సత్యవిషయలేశమును జూపునవియైయున్నవి. అందులకై వానిగ్రహింపఁదగినదియే.

(1) నన్నయభట్టారకుఁడు తానుభారతమును రచించుచున్నకాలమునందు వేములవాడభీమకవి రాఘవపాండవీయమను ద్వ్యర్థికావ్యమును గవిజనాశ్రయమను నొకలక్షణగ్రంథమును (ఛందస్సును వ్యాకరణమును) రచించితెచ్చి వానిమూలముగా రాజసన్మానము నందఁగోరి తదాస్థానకవియగు నన్నయను ముందు చూడ నాతఁడాగ్రంథద్వయమును దిలకించి యీయుద్గ్రంథరత్నములు రసికులహృద్వీథులకెక్కినకొలఁదిఁ దనగ్రంథముల కాకులపాటేకలుగునను నాకులపాటుతో వానిమాయోపాయంబునఁ దగులఁబెట్టించెననియు నటుమీఁద భీమనయు దానికిఁదగు ప్రతిక్రియ చేయఁదలఁచి సమయంబువేచి యొకనాఁడు నన్నయభట్టారకుఁడు రహస్యస్థలంబునఁ గూర్చుండియుండి గ్రంథరచన మొనరించుచుండ నాతనిని భీమన యాప్తునివలె నటించుచువచ్చి యాతనిభార్యతోఁ దనకేదో సందియమును దీర్చికొనుటకై యాంధ్రశబ్దచింతామణి కావలసియున్నదనిచెప్పి దానినిఁబుచ్చుకొని "నన్నయభట్టారకమహాకవియొక్క వ్రాతయిప్పుడేపర్వమున నున్న"దని యాసాధ్వినడిగి యామె యారణ్యముననని సమాధానముచెప్పఁ దలయూఁచి "యీవతనివ్రాత (విధి) యారణ్యముననే యుండుఁగాక" యని శపించిపోయి తాఁదీసికొనివచ్చిన నన్నయభట్టీయమును జింపి గోదావరిలోఁ గలపెననియు నప్పుడాశాపము తగిలిన నన్నయభట్టు మఱిచెడి హఠాన్మరణము నందెననియు నొక లోకప్రవాదముకలదు. ఈ కింవదంతి యప్పకవినాఁటికే కలదు గావుననే యాతఁడు తనగ్రంథమున—

తే. గీ. ఆంధ్రశబ్దచింతామణివ్యాకరణము । ముందురచియించి తత్సూత్రములఁదెనుంగు
బాసచేఁజెప్పె నన్నయభట్టులొల్లి । పర్వములు మూఁడు శ్రీమహాభారతమున.

తే. గీ. భారతము తెనిఁగించుచుఁ దారచించి । నట్టిరాఘవపాండవీయమునడంచె
ఛందమునడంపనీఘక్కి సంగ్రహించె । ననుచు భీమనయెంతయు నడఁచెదాని.

అని వ్రాసియున్నాఁడు. ఈకథయెంతపురాతనపుదైనను నమ్మఁదగినదిమాత్రము కాదు. నన్నయయును భీమకవియును సమకాలికులుకారు. మొదటియాతఁడు పదునొకండవ శతాబ్దములోనివాఁడును రెండవయాతఁడు పదునాలుగవ శతాబ్దములోనివాఁడునైయున్నారు. (చూ॥ భాస్కరోదంతము) వీరియిద్దఱినడుమ మూఁడునాలుగు వం

దలయేండ్ల యెడముగలదు. కావున నీకథ కేవలకల్పితము. పింగళి సూరన్న నాఁటికిది కల్పింపఁబడియున్నట్లు కాన్పింపదు. అతఁడు భీమకవిరచించిన రాఘవపాండవీయము నుగూర్చి—

ఉ. భీమనతొల్లి చెప్పెనను పెద్దలమాటయెకాని యందునొం
డేమియు నేయెడన్నిలుచు టెవ్వరుఁ గానరటుండనిమ్ము నా
నామహితప్రబంధరచనాఘనవిశ్రుతినీకుఁగల్గుట
న్నామదిఁ దద్వయార్థకృతినైపుణియుం గలదంచు నెంచెదన్.

అని భీమన తొల్లిచేసెనను మాటయేకాని యదియెక్కడను గనఁబడుట లేదని చెప్పె. దీనిచేనది యెట్లుపోయినదో తెలియుట లేదనికూడ సూచింపఁబడుచున్నది. నన్నయ దానినడంచినట్లే ప్రతీతియున్నయెడఁ దొల్లి భీమనరచించెంగాని దానిని నన్నయ యడఁచివేయుటచే పోయినదనియే చెప్పియుండును.

ఇంక నీకథవలనఁ దేలువిషయమేమనఁగా నన్నయభారతమును రచించుచు నడుమ హటాన్మరణము నొందెననునదియే. ఈవిషయమే లోకమునఁ బలువిధములగు భీతులను విచిత్రములగు కథలను బుట్టించినది. ఇప్పటికిని నారణ్యపర్వముఁ జదువువారు తమ కేదో భంగము కలుగునని భయపడుచుందురు. తిక్కన తన కేమి చిక్కు కలుగునో యను భయంబునఁ దచ్ఛేషంబును బూరింపఁడాయె; ఎఱ్ఱనయుఁ దన పేరితోఁ జెప్ప జంకి నన్నయపేరనే దానిముగించె. ఛందశ్శాస్త్రరహస్యవేత్తలు నన్నయభట్టు కృత్యాదిని గలపద్యములో నేడింటఁ జకారముంచుటచే నీగతికిలోనైనాఁడని చెప్పుచుందురు. ఇవియన్నియు నన్నయహటాన్మరణము నందెనని తెల్పుచున్నవి. ఈతండిట్లు హటాత్తుగఁ బరలోకగతుండగుటయు భీమన శాపదష్టుండగుటయు నతని రాఘవపాండవీయమెచ్చటను గానరాకుండుటయును జూచి యిటీవలివారెవరో వీనికన్నిటికిని గతికల్పించుటకై యీకథను గల్పించియుందురు. విమర్శజ్ఞానము క్రమక్రమముగా నశించుటచే మనవారు తరువాత నీపుక్కిటిపురాణముల గ్రంథములయందెక్కించుటయు వానినిఁ బామరులు మొదలు పండితులవఱకు నెట్టియసందర్భములతోఁ గూడియున్నను నమ్మాటయుఁ గలుగఁ జొచ్చినది.

(2) నన్నయభారతమును రచించుచున్నకాలముననే యథర్వణుఁడు తానుభారతమునంతయుఁ దెనింగించి తెచ్చి దానిమూలముగా రాజరాజనరేంద్రునిచే సన్మానింపఁబడఁ గోరి తదాస్థానకవియగు శబ్దానుశాసను నాశ్రయించి యతనికిఁ దనగ్రంథమును జూపెననియు నది నన్నప్ప చూచి తనకవిత్వమునకంటె బాగుగా నుండుటచే నోర్వఁజాలక దానినెట్లయిన నడఁపఁ జూచుచుండెననియు నింతలో నొకనాఁడు నన్నయభార్యయు నథర్వ

ణుని భార్యయునుగూడ నొక్కసమయమున నీళ్ళరేవునకు వచ్చుటతటస్థముకాఁగా వారిరువురకు నప్పుడు జరగిన సంభాషణములోఁ దమతమభర్తలు భారతకర్తలయినట్లు తేలఁగా రెండవయామె మొదటియామెను "నీభర్తచేసిన పద్యమును దేనినైనను జదువు" మనఁగా నామె యాదిపర్వాదియందలి "పదిదినంబులు భీష్ముఁడాహవభారకుండ" ను తరలను జదువఁగా నథర్వణునిభార్య యదివిని నగి యీచిన్నవిషయమునకు మీవారింత పెద్దపద్దెమును రచించిరా మావారీవిషయమునంతను నొక చిన్నకందపద్యమునఁ జెప్పిరిచూడుమని "పదిదినములైదుప్రొద్దుల" నుపద్యమును జదివెననియు నందుపై నన్నయభట్టారకుని కొమ్మ సిగ్గువడి యింటికిఁజని యావృత్తాంతమునంతయుఁ దనమగనితోఁ జెప్పెనన్నియు నందుచే నాతండు మఱింతయీసుఁగలవాఁడై యథర్వణుఁడింటలేని సమయమున నాయింటివారికి విశేషధనమునిచ్చి యాయిల్లు తగులఁబెట్టించెననియు నాదుర్వార్తవిని యథర్వణుఁడు వచ్చునప్పటికి గృహమంతయుఁ జాలవఱకు బరశురామప్రీతికాఁగాఁ దాను చిరకాలము శ్రమపడి వ్రాసినగ్రంథము కాలిపోయినందులకుఁ జాలదుఃఖించి యామహాదుఃఖావేశమున నింక బ్రదుకనొల్లక తానును నాయగ్నియందుఁబడి మడసెననియు నాతఁడెవరికో చూపుటకై తీసికొనిపోయిన విరాట్పర్వము మాత్రము మిగిలెననియు నన్నయ తనకు బ్రహ్మహత్యాపాతకము జుట్టుకొనినందులకుఁ దరువాత. చింతాక్రాంతుఁడై మతిచెడి గతించెననియు నొకప్రతీతికలదు.

ఇదియును నమ్మఁదగినదికాదు. అథర్వణుఁడును భీమనవలెనే నన్నయకుఁ దరువాతివాఁడుగాని సమకాలికుఁడుగాఁడు. అథర్వణుఁడు తనత్రిలింగశబ్దానుశాసనమునందు హేమచంద్రుని నామ ముచ్చరించె. హేమచంద్రుఁడు పండ్రెండవ శతాబ్దాది (1088-1172) నుండినవాఁడు కావున నథర్వణుఁడతనికిఁ దరువాతివాఁడు. ఇంకను నితనికి ద్వితీయాచార్యుఁడను పేరుకలదుకావునను విరాటపర్వము మొదలుకొని యీతఁడు తెనుఁగించుటచేతను నన్నయకునితఁడు తరువాతి వాఁడైనట్లు తోఁచుచున్నదని కవులచరిత్ర చెప్పినది సమంజసముగానున్నది. దక్షిణహిందూస్థానప్రాచీనలిపిశాస్త్రమును విరచించిన బర్నెలుదొరవారథర్వణుండిచ్చిన వర్ణరూపావళిలో—

"శ్లో॥ పంచవర్గాదయోవర్ణాశ్శంఖశార్ఙ్గాదిసన్నిభాః"

అనుశ్లోకముల నాధారముచేసికొని తెలుఁగువర్ణములలోఁ బైఁజెప్పఁబడినపోలిక పండ్రెండవశతాబ్దాంతము నాఁటిదియై యుండునుగాన నథర్వణుఁడును బదుమూఁడవశతాబ్దమువాఁడై యుండునని వ్రాసిరికాని వర్ణరూపముల గ్రహించుటలో వారు కొంతవఱకుఁద

ప్పిరని తోఁచుచున్నది. ఈవిషయమున తామునుగొంత సందేహమును బడుచునేయున్నారు. వీరు తమగ్రంథమున—

" Atharvanacharya (who cannot be earlier than the end of the twelfth or beginning of the thirteenth century) describes transitinal alphabet just as it was changing into the earliest modern form "Karikah" 29-32.)

" శ్లో॥ పంచవర్గాదయో " &c.

"There is much here very unintelligible but the description of some of the letters clearly points to about 1200 A. D."

వీరు నిస్సందేహముగాఁ జెప్పినపోలిక లేవియనఁగా :—

" శ్లో॥ పంచవర్గాదయోవర్ణా శ్శంఖశార్ఙ్గాది సన్నిభాః "

అనుదానిలో "అ "కార "గ" కారముల పోలికలనిచ్చుటమైయున్నది. పైమూలశ్లోకపఙ్క్తిలో కచటతపలప్రశంసయేకాని అకార గకారములమాటయేలేదు. ఏవిధమైన మఱికొన్ని పోలికలు దొరవారికి గోచరమైనవేమో. అక్షరముల పోలికలనిచ్చుటలోఁగూడ నీతఁడు పదుమూడవ శతాబ్దములోనివాఁడని తేలినను దేలవచ్చును.

ఈకథపుట్టుటకుఁగల కారణమేమనఁగా నథర్వణుని భారతములో మొదటిభాగమును దుదిభాగమును గాన్పింపకుండుటయు నొక్క విరాటపర్వముమాత్రమే కాన్పించుచుండుటయు నన్నయభారతమున నొకయర్థమునేయిచ్చు రెండుపద్యము లీక్రిందివి యొక్కచోటనే యుండుటయును హేతువులై యున్నవి. దీనికి సందర్భమును గల్పింపనెంచి యెవ్వరో యిట్టివిపరీతగాథను గల్పించిరి. ఆపద్యములెవ్వియనిన :—

తరల. పదిదినంబులుభీష్ముఁడాహవభారకుండు, గురుండుపం
చదివసంబులు, గర్ణుఁడున్దివసద్వయంబు, దినార్ధమం
దుదితతేజుఁడు శల్యుఁడత్యధికోగ్రవీరగదారణం
బదిదినార్ధముగాఁగనిట్లుమహాభయంకరవృత్తితోన్.

క. పదిదినములయిదుప్రొద్దులు । పదపడిరెణ్ణాళ్ళునొక్కపగలున్ రేయున్
* గదనంబుచేసి మడిసిరి । నదిసుత, గురు, కర్ణ, శల్య నాగపురీశుల్.

ఈరెండుపద్యములును నొక్కచోటనే యుండుటఁజూడఁగా నివి వేఱు వేఱుగ్రంథములలోనివై యుండుననుతలంపు మునుపటివారికే కాక యిప్పటివారికినిఁ గలుగు

---

* "మదమున రణమొనరించిరి" అనుపాఠాంతరము కలదు.

చున్నది. ఈయూహయెంతవఱకు సత్యముకాఁగలదో తెలియదు.

(1) కాని యిట్టి యేకభావముగల పద్యద్వయమొక్కచో నుండుట యనేకగ్రంథములందు కలదు.

మృచ్ఛకటికయను నాటకరాజములో—

శ్లో. మేఘోజలార్ద్రమహిషోదరభృంగనీలో । విద్యుత్ప్రభారచితపీతపటోత్తరీయః
ఆభాతిసంహత బలాకగృహీతశంఖః । ఖం కేశవోఽపర ఇవాక్రమితుం ప్రవృత్తః॥

ఉక్తార్థమే భంగ్యంతరముచే మరల నాక్రిందనే యీరీతిగాఁ దెల్పఁబడినది.

శ్లో. కేశవగాత్రశ్యామః కుటిలబలాకావళీరచితశంఖః -
విద్యుద్గుణకౌశేయ శ్చక్రధర ఇవోన్నతో మేఘః.

శిశుపాలవధ (మాఘము) అను మహాకావ్యములో- మాఘుఁడు.

శ్లో. ప్రసాధితస్యాస్యమధుద్విషోభూ । దన్యైవలక్ష్మీరితియుక్తమేతత్
వపుష్యశేషేఽఖిలలోకకాంతా । సానన్యకాంతాహ్యురసీతరాతు.

ఆయర్థమునే మరల రీత్యంతరమున నాక్రిందనే యిట్లు చెప్పుచున్నాఁడు.

శ్లో. కవాటవిస్తీర్ణమనోరమోర । స్థలస్థితశ్రీలలనస్యతస్య
ఆనందితాశేషజనాబభూవ । సర్వాంగసంగిన్యపరైవలక్ష్మీః.

భర్తృహరికృత సుభాషితములో—

శ్లో. తావదేవామృతమయీయావల్లోచనగోచరా
చక్షుష్పథాదతీతాతు విషాదప్యతిరిచ్యతే.

ఈయర్థమె యిఁకనొకరీతిగ నాక్రింపనె యిట్లు చెప్పఁబడినది—

శ్లో. నామృతంనవిషంకించి దేకాంముక్త్వానితంబినీం
సైవామృతలతారక్తా విరక్తావిషవల్లరీ.

నైషధమహాకావ్యములో ప్రారంభముననె- శ్రీహర్షుఁడు.

శ్లో. నిపీయయస్యక్షితి రక్షిణఃకథా । స్తథాద్రియంతే నబుధాస్సుధామపి
నలస్సితచ్ఛత్రితకీర్తిమండల । స్సరాశిరాసీన్మహసామహోజ్జ్వలః.

ఉక్తార్థమునే వాక్యాంతరములచేత మరలఁ జెప్పుచున్నాఁడు.

శ్లో. రసైఃకథాయన్య సుధావధీరిణీ । నలస్సభూజాని రభూద్గుణాద్భుతః
సువర్ణదండైక సితాత పత్రిత । జ్వలత్ప్రతాపావళి కీర్తిమండలః.

మఱియు నాగ్రంథరాజమునందే—

శ్లో. స్వకేళి లేశస్మిత ర్నిర్జితేందునో । నిజాంశదృక్తర్జిత పద్మసంపదః

అతద్వయీజిత్వర సుందరాంతరే । నతన్మ్రఖస్యప్రతిమాచరాచరే.

మరల నీభావమునే వేఱుమాటలతోఁ గవియిట్లు చెప్పుచున్నాఁడు.

శ్లో. సరోరుహంతస్యదృశైవనిర్జితం । జితాస్మితేనైవ విధోరపిశ్రియః
కుతఃపరంభవ్యమహోమహీయసీ । తదాననస్యోపమితౌదరిద్రతా.

శంకరకవికృత హరిశ్చంద్రోపాఖ్యానములో —

క. ఖ్యాలుండై వారజలధి । వేలావలయితధరిత్రి విమలయశుండై
యేలున్నృపసూతియడుగెడు। నేలకుఁబాత్రుండుగాఁడె నీకిటులగునే.

మ. అకటా చేరెఁడు నేలకుందగఁడె సప్తాంబోధివేష్టిభవ
త్సకలద్వీపకలాపభూప మకుటాంచత్పద్మరాగోజ్జ్వల
ప్రకటానర్గళనిర్గళత్కిరణ శుంభత్పాదుఁడైనట్టి రా
జుకుమారుండనియేడ్చెఁ గన్నుఁగవనశ్రుల్గ్రిక్కిఱి పాఱఁగన్."

అని వ్రాయఁబడియున్నది.

హూణభాషలో "షేక్సుపియరు మహాకవి" యుఁ "దన మిడ్సుమ్మరునైట్సు డ్రీమ్" అనునాటకములో :—

"*My ear should catch your voice*, my eye your eye
* *My tongue should catch your tongue's sweet melody.*"

అనిలిఖియించె "స్పెన్సరుమహాకవియును దన "ఫెయిరీక్వీను" లో

"*Whose need had end, but no end covetise*
Whose wealth was want, whose plenty made him pore;
*Who had enough, yett wished ever more.*

అని విరచించె.

ఈరీతిగా ననేకగ్రంథములందుఁగలవు. మాఘవ్యాఖ్యానములో వ్యాఖ్యాతృశిరోమణి యగు మహామహోపాధ్యాయ శ్రీమల్లినాథసూరి ఉక్తిలోభముచేఁ గవులుక్తార్థమునే మరల జెప్పుచుందురని వ్రాసె. అది సత్యమేయైయున్నది.

ఈవిషయమును శంకించు వారిలో నొక్కరగు కవులచరిత్రకారులును నీక్రింది శ్లోకమునకిట్లు రెండుపద్యములను విరచించియున్నారు.

---

* "It may possibly be only a repetition of the former statement."

*Winckler's notes.*

" శ్లో. పురాణమిత్యేవనసాధుసర్వం । నచాపికావ్యంనవమిత్యవద్యం-
సన్తఃపరీక్ష్యాన్యతరద్భజన్తే। మూఢఃపరప్రత్యయనేయబుద్ధిః. "

మాళవికాగ్నిమిత్రము.

" గీ. సర్వమునుబ్రాఁతదనిరెండుసాదుగాదు।క్రొత్తదనియొకావ్యమునకుఁగొఱంతరాదు
యోగ్యులుగ్రహింతురారసియుత్తమంబు । మూఢుఁడన్యులనేనమ్ముబుద్ధిలేక. "

ఆంధ్రమాళవికాగ్నిమిత్రము.

" ఉ. ప్రాఁతదియన్నకారణముఁబట్టియెసర్వముమేల్మిఁజెందునే
నూతనమన్నహేతువున న్యూనతఁజెందునె క్రొత్తవన్నియున్
ఖ్యాతిగసత్తముల్గుణమునారసి మంచిగ్రహింతురెప్పుడున్
బ్రాఁతవెమంచివందురవిమర్శతఁగేవలమూఢమానవుల్ "

ఈపద్యములొకయర్థమునే భంగ్యంతరమునఁదెల్పుటకుఁ గవులకుఁ జాపల్యముం డునని తెల్పుటకుమాత్రము దాహరణముగా నీయంబడినవిగాని యొక్కతావుననే యుండుటనుగూర్చి యీఁబడినవికావు. తమ సత్యహరిశ్చంద్రనాటకమునఁ గాళిదాసుని మాళవికాగ్నిమిత్రములోని పై శ్లోకమునకుఁ బ్రత్యాంధ్రపద్యము నుదాహరింపఁదలఁచు కొనిన యీకవిగారదివఱకు దాము విరచించియుంచిన మొదటిపద్యమును లిఖింపక మ రల మఱియొకపద్యమును వ్రాయుట యుక్తిలోభముననేకదా ! ఈయిచ్ఛ యేకకాలము ననే కలిగినయెడల నీరెండుపద్యము లొకతావుననే పడియుండును. ఎట్లన:—

మొదటవీరు తమశుద్ధాంధ్ర నిర్వచననిరోష్ఠ్యనైషధములో :—

క. ఓయనవాడయండొక్కఁడు । నేయెడలనుదనకులాతి యేలికలేరున్
రోయఁగనరిరాకుండఁగ । నాయూరేలుబుతుపర్ణుఁడనఁగనుచటన్.

అను పద్యమును విరచించి యది యందఱకును సహ్యము కాదనుతలంపు మనస్సు నఁబాఱ మరల :—

" క. తగునైదైతులరెండయి । సొగసగు తెనుగచ్ఛరాన నూటియెనంగన్
దగియెడుతుర్ణులసందుగ । లిగిన బుతుర్ణుఁడను ఱేడులెన్సగనచటన్.

అనుపద్యమునురచించిరి. ఈరెంటిలోనొకటి యాగ్రంథమందుండినఁ జాలు. అయి నను వీరు తమ ప్రౌఢత్వమును జూపుటకై యిట్లు రెండుపద్యములను రచించిరి న్యా యముచే నీరెండుపద్యములును గూడ నీగ్రంథమున నుండఁదగినవికావు. ఏమన :— మొదటిదానియందలి " ప " కారము నిరోష్ఠ్యనియమమునకు హానికరమైనచో రెండవ దానియందలి " బు " కారమనాంధ్రవర్ణమగుటచేనది శుద్ధాంధ్రనియమమునకు భం

గదముగా నున్నది. పేరులందిదియుండఁ జనునందురేని మొదటిదియునునట్టిద. అందులకై రెండుపద్యములేల ? కవిహృదయమప్పడారీతిని బోయినది. ఇదియే కారణము. అట్లనె నన్నయభట్టారకుండును, మొదట విరచించిన పద్యము పెద్దదైనదని తనకుఁ దోఁచుటచేతనో తనమిత్రులు సూచించుటచేతనో మరల జిన్నపద్యమును విరచించి యుండ వచ్చును.

(౨) ఆలోచింప భారతములోని రెండవ పద్యమంతగాఁ బునరుక్తిదోషమునకు లోనుగానేరదని తోఁచుచున్నది. మొదటిపద్యములో భారతయుద్ధములో నెవరెవరు ప్రధానులుగానుండి యుద్ధము నెంతకాలము చేసిరో * వారినిఁదెల్పి రెండవదానియందు వారెంతలోఁ జనిపోయిరో తెల్పినాఁడు. పదిదినములు భీష్ముడు యుద్ధభారమును వహించె ; అయిదుదినములు ద్రోణుఁడువహించె ; రెండుదినములు కర్ణుఁడు వహించె, దినార్ధముశల్యుఁడువహించె. దినార్ధముగదారణముజరగె. ఇట్లుపది, యైదు, రెండు, నొకటిలో భీష్మద్రోణకర్ణశల్యా నాగపురీశులుగతించిరి అని తెల్పుట భావము సువ్యక్తమగుటకొఱకును నెట్టి మహావీరులెంతలో గతించిరో తెల్పుటకును నై యున్నది. భావగౌరవమునకునై యీరీతిగాఁదెల్పుట పలుచోట్లకలదు. గ్రంథవిస్తరభీతిచే రెండుదాహరణములను మాత్రమిచ్చెదను. వసుచరిత్రములో :—

" సీ. ధరయేయపాంసుల తలచూపరాకుండఁ దనకూర్మిఁ తేని నప్పననెముంచెఁ
కమలయేనిశ్చల రమణుపేరెదకు మోపైనిల్చి యతని పేరడుగుపఱచె
సతియేయచండిక పతిఁజట్టుకూతుఁరై జగడాలుపచరించి సగముచేసె
వాణియేమితసూక్తి వదలదుతలవాకిలి నిజేశు మాట మోచెననఁజేసె
ననుచుభూకాంత,శ్రీకాంత,హరునికాంత, నజునికాంతనునిరసించియాసిరంగ
పార్థివునికాంత తిమ్మాంబపతికిఁగుశల । కీర్తిబలవృద్ధినిర్మలస్ఫూర్తులొసఁగు."

అని వినిర్మింపఁబడియున్నది. ఇందు సీసపాదములలో ధర, కమల, సతి, వాణి యని కవిచెప్పియేయున్నాఁడు గాన గీతములో "అనుచువారినిరసించి" యనిచెప్పినహాని లేదు. పునరుక్తియుండదు. అయినను భావగౌరవముకొఱకై మరల గీతములో భూకాంత, శ్రీకాంత, హరునికాంత, యజునికాంత యనితెల్పినాఁడు. అట్లనె నన్నయభట్టారకుండును దెల్పె. ఇదిదోషమునుగాదు. క్రొత్తమార్గమునుగాదు.

---

* వీరు భీష్మద్రోణకర్ణశల్యులు వీరిపేరనేకదా భీష్మద్రోణకర్ణ శల్యపర్వములు పర్వుచున్నవి.

మఱియును షేక్స్పియరు మహాకవి తన " జూలియస్ సీజరు " నాటకములో :-

" As Cæsar loved me, I weep for him as he was fortunate, I rejoice at it; as he was valiant, I honour him; but as he was ambitious, I slew him. *There is tears for his love; joy for his fortune; honour for his valour; and death for his ambition.*"

అని వ్రాసియున్నాఁడు. ఈపునరుక్తి భావగౌరవమును దెచ్చునదిగ్గా సరసముగ నున్నదిగాని దోషముగఁ గాన్పించుటలేదుగదా. అట్లనే నన్నయభట్టారకుని పద్యద్వయమును సరసముగనే యున్నదిగాని యనవసరముగాఁ గాన్పించుటలేదు. పైన విరివిగానున్నదానికిఁ గ్రింద మంచిగమనికతో సంగ్రహమున్నయెడల నాయాతావులనుబట్టి యది యర్థగౌరవము నొసంగును. తిరుగఁ జెప్పుదాని గమనికననుసరించి సారస్యాసారస్యము లొప్పుచుండును. " పదిదినంబులు భీష్ముఁడాహవభారకుండు " అను తరలక్రింద మరల :-

క. పదిదినములు భీష్ముండై । దుదినములు గురుఁడిరునాళ్ళుతోడనఁగర్ణుం
డు దినార్థము శల్యుండ । ర్థదినము కురుపతియునని౯బో దలియాల్గిరొగిన్.

అని వ్రాసినచోఁ బునరుక్తిదోషము కొంతవఱకుఁ బట్టునుగాని "పదిదినములైదు ప్రొద్దులు" అను గమనిక యాదోషమునకు లోనుగాక పైఁజెప్పఁబడినట్లుగా నర్థగౌరవము నిచ్చుచున్నదనఁ దగియున్నది.

(3) ఇంకను నెరవు తెచ్చిపెట్టుకొనిననగ పట్టిచ్చినట్లేరవుపద్యమును బట్టిచ్చెను. ఇందిదట్లులేదు. సరికదా పదిదినములను గందపద్యము నీఘట్టమునుండి తొలఁగించిన నన్వయము చెడుచున్నది.

" తరల. పదిదినములు భీష్ముఁడాహవభారకుండు.........

... ... ...ఇట్లు మహాభయంకరవృత్తితోన్

శా. ఏడక్షౌహిణులెన్నఁబాండవబలంబు "

అనుచో " ఇట్లు భయంకరవృత్తితోన్ " అనుదానికన్వయముండఁజాలదు. అనదుమ వివాదములోని కందపద్యమున్నయెడల " ఇట్లుమహాభయంకరవృత్తితో పదిదినములు నైదుప్రొద్దులు రెణ్ణాళ్లుపగలు రేయుఁ గడనముచేసి మడిసిరి " అని వాక్యము పూర్తియగును. కాన నీకందము పైతరలయొక్క కందమే కాని యన్యంబుగాదు. దీనింద్రెంచిన నదియుం జెడును.

(4) మఱియు నీకందమిందులోనిది కాకున్న నిఁక నథర్వణభారతములోనిదనిగదా తెల్పవలయును. ప్రస్తుతస్థితినిఁ బట్టిచూచిన నందలిదని చెప్పుట కెంతమాత్రమును వలనుగాదు. నన్నయభారతము సుప్రసిద్ధము. అథర్వణుఁడతని తరువాతివాఁడు. కాన నీతఁడు నన్నయ చెప్పఁగామిగిలిన భాగమును దెనిఁగించుటకు మొదలుపెట్టెననుటయే లెస్స. లోకప్రతీతియును దీనినే సూచించుచున్నది. కవులచరిత్రమును దీనినే నొక్కివక్కాణించుచున్నది. అట్టిచో నీపద్యమందెట్లుండఁగలదు. ఏలయన నిది యాదిపర్వమందలి పీఠికలో నుండఁదగిన పద్యముకాని తరువాతిపర్వములలో నుండఁదగినది కాదు. కవులచరిత్రములో రావుబహద్దర్ వీరేశలింగముపంతులు ఎఫ్, ఎమ్, యు వారిది భీష్మపర్వాదిదగుట స్పష్టమని వ్రాసిరికాని వారివ్రాత తప్పగుట స్పష్టమని భారతగమనిక తెల్పుచున్నది. కురుక్షేత్రమున జరగిన యుద్ధవిశేషములు సంజయుఁడు ధృతరాష్ట్రునకు యుద్ధాంతమున నొక్కమారుగాఁ దెల్పినయెడలఁ బంతులవారు చెప్పినది సరిగానుండునుగాని యదియట్లు జరగియుండలేదు. వ్యాసాజ్ఞచే సంజయుఁడురణరంగమునకుఁబోయి భీష్ముఁడు పడువఱకు నచటనుండి యుద్ధమును దిలకించి యాతని పతనానంతరమున హస్తిపురమునకువచ్చి భీష్ముఁడాహవభారకుఁడై యుండఁగా జరిగిన విశేషములన్నిటినిం దెల్పి మరల యుద్ధభూమికిఁ జని ద్రోణుఁడు పడువఱకునుండి మరల పురమునకువచ్చి యాకాలవిశేషములు తెల్పి మరలిచనుచు నిట్లొక్కొక్క సేనానాయకుఁడు జరపు విశేషములొక్కొక్కతఱిఁ దెల్పుచువచ్చె. కావున భీష్మపర్వముననే ద్రోణాదులు హతులైరని నుడుపుటకైతిగాదు. అథర్వణుఁడు భారతము నాదినుండియుఁ దెనిఁగించెనని యొకరు వ్రాసిరిగాని యది యాకాశహర్మ్యము.

(5) ఈకందమథర్వణ భారతములోనిదని పూర్వులెవ్వరును దెల్పియుండలేదు. కూచిమంచి తిమ్మన్న తన "సర్వలక్షణసారసంగ్రహము" లో వ్రాసెఁగాని యితఁడంతఁగాఁ బూర్వుఁడుకాఁడు. ఈకారణములచే సరసులు పైతరలను గందంబును విడఁదీయఁ బ్రయత్నింపరనియు నన్నయ యథర్వణుని భారతమును దగులఁబెట్టించెనను కథను నమ్మరనియును దలఁచెదను.

—* నన్నయభట్టారకుని మతము. *—

మొదటనే యాతం "విడరళజపహోమతత్పరుండైన" స్మార్తుఁడని తెలిసికొనియుంటిమి. స్మార్తులందఱును జాలవఱకు శ్రీశంకరాచార్య బోధితాద్వైత మతమును నవలంబింతురుగాన నీతండద్వైతి. అర్జునుఁడు మాయాకిరాతుండైన శంకరుని స్తుతించు ఘట్టములో నీతండొనర్చిన దండకాదులందలి "సర్వాత్మకా" ది ప్రయోగము

లు మనయూహను బలపఱచుచున్నవి. ఈతఁడు హరిహర తారతమ్యములేనివాఁడు. కావుననే కృత్యాదిని ;

శ్లో. శ్రీవాణీగిరిజాశ్చిరాయదధతోవక్షోముఖాంగేషుయే
లోకానాంస్థితిమావహంత్యవిహతాంస్త్రీపుంసయోగోద్భవామ్
తేవేదత్రయమూర్తయస్త్రిపురుషాస్సంపూజితావస్సురై
ర్భూయాసుఃపురుషోత్తమాంబుజభవశ్రీకంధరాశ్శ్రేయసే.

అని త్రిమూర్తులను సమముగా స్తుతించినాఁడు. అయినను "తథాపిభక్తిస్తరుణేందుశేఖరే" అని భర్తృహరి చెప్పినట్లుగాఁ "పార్వతీపతిపదాబ్జధ్యానపూజారతి" హెచ్చుగాఁగలవాఁడని భారతము చాటుచున్నది. హేఁతులేని వట్టివిశేషణములతో మూర్తిత్రయమును స్తుతింపక స్త్రీపుంసయోగోద్భవమైన లోకస్థితిని బహ్మోమావాణీసనాథులగు హరిహరహిరణ్యగర్భులు వహించుచున్నారని చక్కఁగా బోధించియుండుటచేత ప్రకృతిపురుషజ్ఞానము కలవాఁడని తోఁచుచున్నదికాని మొత్తముమీఁద జ్ఞానకాండమునందుకంటె కర్మకాండము నందెక్కుడభినివేశము కలవాఁడనుటలో సందర్భమెక్కుడుకలదు. మఱియు నీతఁడు గ్రంథాదిని "హరిహరాజగజాననార్కషడాస్యమాతృ సరస్వతీగిరిసుతాదిక దేవతాతతికిన్నమస్కృతిచేసి" యున్నాఁడు. ఇదంతయు విశేషవేదాంతచర్యారతుఁడు చేయుపనికాదు. ఈతని కాలమునాటికి శంకరమతము నవీనము. మధ్వరామానుజమతములు లేనేలేవు. ఇప్పటి శైవమును గానరాదు.

శ్రీరస్తు.

శు భ మ స్తు.

# నన్నయభట్టారకచారిత్రము.

## ద్వితీయప్రకరణము.

" మ. మహిమన్ వాగనుశాసనుండు సృజియింపంగుండలీంద్రుండుద
న్మహనీయస్థితిమూలమైనిలువ శ్రీనాథుండుప్రోవన్మహా
మహులైసోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపువాటిల్లునీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్. "

రామరాజభూషణుఁడు,

### —* నన్నయభట్టారకుని సంతానము. *—

పూర్వప్రకరణమునందు నీమహామహుని పూర్వులనుగూర్చియును తన్నుఁగూర్చియును దెలిసినంతవఱకు వ్రాయఁబ్రయత్నించి యుంటిమిగాన నిందు నీతని సంతానమునుగూర్చి ముచ్చటింతము. ఈతని పూర్వులసంగతివలెనే సంతానప్రశంసయు మనకేదియును దెలియరానిదగుటచేఁ బ్రథమప్రకరణమునందువలెనే యిందును బెద్దపెద్ద శీర్షికలనుమాత్రము వేసి విషయలోపముచేఁ జదువరుల నిరుత్సాహులఁ జేయవలసి వచ్చునుగాని వాగనుశాసనయోగముచే, నీతని తనూభవులను గూర్చి యేమియుఁ దెలియరాకున్నను నొక్కయాత్మభవను గూర్చి విశేషముగాఁ బ్రసంగించుకొనుట కవకాశముండుటచే నీశీర్షికపాఠకులకు నిరుత్సాహకరము కాదని తలంచెదను. ఏకాంతనుగూర్చి మనమిప్పుడు ముచ్చటించుకొనఁబోవుచున్నామో యాసుభాషిణిదౌ సువృత్త విశేషమునసే కన్ననన్నయోపాధ్యాయుని వంగసమును జేపట్టిన వాని వంగడమే కాక యాంధ్రదేశమంతయును గూడ వన్నెయును వాసియును గాంచుచున్నవి. ఈమృదుపదయొక్క చారిత్ర మతిపావనమును నత్యద్భుతమును నై యున్నది. ఇట్టి విచిత్రచారిత్రముగల యీమత్తేభగమనపావననామముగననోచిన సువర్ణపాళి " ఆంధ్రకవితాసతి " యనునదియై యాచంద్రార్కము విరాజిల్లుచున్నది. ఈయాంధ్రకవితావనితామణి నన్నయభట్టారకుని ముద్దులకూఁతురైనట్లుగా గ్రంథములు లోకప్రతీతియును నాదినుండియు నుద్ఘోషింపుచు నున్నను బాగు

గాఁబరికించి చూచినచో నందులకుఁ దగినబుజువు లనేకములుండినను నిప్పటి బుద్ధిమంతులు కొందఱు స్థూలదృష్టిచేఁజూచి "ఇంతటి వటవృక్షమాచిన్నవటబీజమువలనఁ బొడమినదా!" యని సంశయించినట్టు లింతటి యాంధ్రకవితాసతి యొక్క నన్నయభట్టారకుని మూలముగాఁ గలిగినదాయని సందేహించుటయే కాకయతనియాత్మజ * కాదని నిశ్శంకముగాఁ ద్రోసివేయుటకుఁ గూడ సాహసించుచున్నారు. కాన నీమాననీయ జన్మముంగూర్చి తొలుదొల్త జర్చింపనవసరము కలిగినది. అందుచే నీకావ్యకాంతం గని వాసిగాంచిన త్రిలింగభాషాయోషయొక్క స్థితియెట్టిదో యెవరిచే శాసింపఁబడినదో నన్నయభట్టారకుని నాటికెట్టి స్థితియందున్నదో తెలిసికొనవలసి వచ్చినది. భాషాభివృద్ధి దేశనాగరికతనుబట్టి యుండునుగాన నందుచే ముందుగా నాంధ్రదేశస్థితి నారయుట పేక్షణీయమయినది.

## —* ఆంధ్రదేశ ప్రశంస. *—

ఈదక్షిణాపథమునందలివగు పాండ్య, చోళ, కర్ణాటక, కేరళ, ఆంధ్రాది దేశములలో నీయాంధ్రదేశము బహు నవీనముగాఁ గాన్పించుచున్నది. ఇది పాండ్యాదులంత పురాతనమైనదికాదు. అయినను దేశాభిమానులు కొందఱు తమకుఁగల గాఢాభిమానముచేఁ దమదేశము మిక్కిలి పురాతనమైనదనియు నందుమూలముచే ఘనమయినదనియు లోకమునకు వ్యక్తీకరింపనెంచి దేశముయొక్క నిజస్థితిని దెలిసికొనుటకు నైతికాకుండఁ బ్రాతగ్రంథములలో నూతనముగాఁ గ్రొత్తవిషయములను జేర్చియును నవీనగ్రంథములను గథలను గల్పించియును జిక్కులను గలిగించియున్నారు. పురాతనమైనదానియందు లోకమునకు గౌరవబుద్ధి యధికమగుట తటస్థించుచుండుటచే నీకీడన్నితావులందును మూడునదియేకాని యొక్కమనదేశమునందుమాత్రమే కలిగినదికాదు. అందుచేతనే మనవారును దమదేశభాషలును మిక్కిలి గౌరవనీయములని తెల్పుటకయి పలువిధములగు గ్రంథప్రమాణములను బుట్టించియున్నారు. పురాణములందచ్చటచ్చట నీదేశప్రశంసను జొప్పించిరి. స్థలపురాణములను బుట్టించిరి. కథలనల్లిరి. పెక్కుల యుపనిషదాదులనే వినిర్మించిరి. సత్యములగు చారిత్రములేవియును లేకపోవుటచే వీనిలోఁ గల్పితములేవో సత్యములేవో తెలిసికొనుటలోఁ గష్టమెక్కుడుగానున్నది. ప్రక్షిప్తభాగములుండుటచేతనే గ్రంథములొకదానికొకటి యేకవిషయముననే సందర్భింపకుండుటయు నేకగ్రంథమునందే పరస్పరవిరోధము లుండుటయుఁ దటస్థించుచున్నది. కాలమును దెల్పు

* ఆత్మాయత్తోర్ధృతి "ర్బుద్ధి" స్స్వభావో బ్రహ్మవర్ష్మచ (అమరము)

టలో మన గ్రంథాదులందుఁగలుగు వ్యత్యాసములిన్నియన్నియని తెల్పుట కలవికాకున్నది. మఱియును గొంతకాలమునుండి మనవారికిఁ గాలకర్మవశమున విమర్శజ్ఞానము నశించుటచే నన్నివిషయములను జక్కఁగా బరిశీలించుటమాని తమచెవిసోకిన దానినెల్ల మనవారు నమ్మఁజొచ్చిరి. కాలవిషయమునఁ జర్చయే మనవారు చేయరు. * నిన్నఁగతించినవాఁడు నేటికి శతాబ్దముల నాటివాఁడగుచున్నాఁడని కూడ చెప్పవచ్చును. ఇట్లుండ మనదేశమునకు స్వేతద్వీపప్రభు పరిపాలన మిటీవల దైవానుగ్రహముచేఁ గలుగుటచే మనదేశమునందలి యవిద్యాతమమంతయును గ్రమక్రమముగాఁ బోవుచున్నది. చరిత్రలను వ్రాయుటయందు మిక్కిలి నిపుణులగు నైరోపీయపండితులు మనగ్రంథములెంత అమోఘములైయున్నను నోరిమితోఁ దమబుద్ధివిశేషముచేఁ జాలవఱకుఁ నిజమును బైకిఁదీసి నొకవిధముగా మనదేశచారిత్రముల వ్రాసిరి. వీరు చారిత్రములను వ్రాయుటలో మనగ్రంథములందుఁగల లోపములను గ్రమక్రమముగాఁ గనిపెట్టి వానిని ‘అబద్ధపుమాతలు’ (“lying gabble”) అని నిరసించివైచి (1) శాసనములను (2) పురాతనపు కట్టడములను (3) అన్యదేశస్థులు మనదేశమునుగూర్చి వ్రాసియుంచిన వ్రాతలను (4) ప్రసంగాంతరముగల మనగ్రంథవిషయములను (5) వీనికి సంబంధించియున్న కథలను నాధారముగాఁగొని చారిత్రముల వ్రాసిరి. ఇది మిక్కిలి మంచిమార్గము. మూఢాభిమానముకలవారు కొందఱు కాలాదులనుగూర్చి క్రొత్తసృష్టిని జేయుచువచ్చినను మనవారందఱు సత్యవిషయముల దాచిపెట్టుటకై పాటుపడక సత్యమును స్థాపించుటకైయే పాటుపడిరి. కావుననే రాజులు మొదలగువారు తమతమ కాలములు శాశ్వతముగా నుండుటకై శిలాతామ్రాది శాసనములందుఁ బ్రకటించుచువచ్చిరి. పురాణాదులందును బ్రక్షిప్తములమూలముగా సందియములు పెక్కులుత్పన్నము లగుచున్నను బాగుగాఁ బరికించి చూచిన నిజము తేలుచునేయున్నది. ఈమార్గములనన్నిటిని గనిపెట్టుటలో ఖండాంతరపండితులు మిగుల నేర్పుతోడను నోర్పుతోడను గూడఁ బనిచేసిరికాని వీరెంతనిపుణులైనను గొన్నివిషయములు మనకుఁ దెలిసినంతబాగుగా వారికిఁ దెలియరావుగావునఁ గొన్నిచోట్ల వారును బ్రమాదముల పాలగుచువచ్చిరి. (†) కావున నీరు వ్రా

---

* ఈవిషయమున నిజమును గనుగొనఁ బ్రయత్నమించుకయైనఁ జేయకపోవుటచేతనేకదా అప్పకవి మొదలగువారు నన్నయభట్టారకుఁడు భారతమును గలియుగాది నొనర్చినాఁడని నిశ్శంకముగా వ్రాసిరి.

(†) మనదేశమందలి శాసనములఁ బెక్కింటిని బాగుగాఁ బరికించిచూచి దేశమునంతనుగూడఁ బరిశీలించి బహునిపుణముగా మనదేశపురాతన లిపిశాస్త్రమును వ్రా

సినదియును నన్నివిషయముల సత్యమైన చారిత్రము కాఁజాలదు. వారుచూపినత్రోవ నవలంబించి వారు నిందించినంత "అసత్యపుమాఁటలు" గా మనగ్రంథములఁ ద్రోసివేయక యవి యేవిషయమును ముచ్చటించుచున్నవో యావిషయమునఁగాక యావిషయమువలనఁదేలు నితరవిషయములఁ గ్రహింపుచు మనము శ్రమపడి మన దేశచారిత్రముల వ్రాసికొనినఁ గొంతవఱకు సద్గ్రంథములు పుట్టఁగలవు.

కానఁ బ్రస్తుతవిషయమున మనము మనదేశస్థితినిగూర్చి తెలిసికొనుటకై మొదట నాధారముగాఁ దీసికొనవలసినవి శిలాదిశాసనములు. వీనియందుఁగల కాలాదులు యదార్థములు. వీనివలనఁ దేలినదానికి వ్యతిరేకముగా మనగ్రంథములెన్నియున్నను వానికిఁ దగుసద్యుక్తులు లేకుండ వానినంగీకరింపఁ జనదు. ఈశాసనములను బట్టిచూడఁగా మన దేశము పాండ్య చోళాదులంత పురాతనము కాదని తోఁచుచున్నది. ఈశాసనముల బాగుగాఁ బరిశీలించి చూచిన బర్నెలుదొరవారు తమపురాతన లిపిశాస్త్రములో :—

"There is not the least mention of any Telugu Kingdoms in the Asoka Inscriptions. *Probably that part of India was not then civilized at all, but inhabited by wild hill-tribes.*"

(అశోకుని శాసనములలో నెచ్చటను ఆంధ్రరాష్ట్రముల ప్రస్తావము లేశమును లేదు. 'బహుశః' అప్పటికాహిందూభూభాగము బొత్తుగా నాగరికతలేక కొండకోయలకు నివాసస్థానమైయుండనోపు.)

అని వ్రాసిరి. అశోకుని శాసనములలోఁ బలుతావుల పాండ్యచోళాదుల ప్రశంస కలదు. అప్పటికాంధ్రదేశమేయున్నయెడల దీనిప్రశంస లేకయుండదు. అశోకుని కాలము క్రీస్తుశకమునకుఁ బూర్వము సం॥ 260 అయియున్నది. అప్పటికీభూభాగమువట్టి యరణ్యప్రదేశమేకాని జననివాసయోగ్యంబగు దేశముకాదు. ఈసంగతినే మన గ్రంథములును దెల్పుచున్నవి.

(1) రామాయణము మనకు మిగుల పురాతనగ్రంథముగాను బూర్వుల చారిత్ర

---

సిన బర్నెల్‌దొరవారు, అనేకవిషయములలో సత్యమును నేర్పుమీఱఁ గనిపెట్టినను దుదకు నన్నయభట్టు రామాయణమును దెనిఁగింప మొదలుపెట్టినట్లును దానిని దిక్కన పూర్తిచేసినట్లును వ్రాసిరి. ("Nannaya-Bhatta * * * began a translation of the Ramayana which was finished by another Brahman (Tikkana) also a native of the East Coast, a little later.)

ఘును దెల్పునదిగాను నున్నది. శ్రీరాముఁడు కైక కోరినవరములఁదీర్చి తండ్రియాడినమాట నిలుపుటకై దేశములందును గ్రామములందును బ్రవేశింపక వట్టియరణ్యములందే పదునాలుగు సంవత్సరములు నివసింప శపథముపట్టివచ్చి యీప్రాంతమునందు సంచరించినట్లును, ఈభూమి ఘోరారణ్యప్రదేశమైనట్లును శ్రీమద్రామాయణమునందుఁ దెల్పఁబడియున్నది. అంతియకాక యీప్రదేశమునకు దక్షిణమున కిష్కింధారాజ్యమున్నట్లుగూడఁ దెల్పఁబడియున్నది. మఱియును సీతను రావణుఁడెత్తికొని పోవుచున్నప్పుడామె మొఱ్ఱనాలించి రక్షింపవచ్చుటకుగాని యామెయొక్క ఆనవాలును భద్రముచేయుటకుఁగాని గోదావరిమొదలు పంపానదివఱకును నామహాసాధ్వి కెవరును గాన్పించియుండలేదు. ఆపైనమాత్రము సుగ్రీవాదులు కాన్పించిరి. దీనిచేతఁ దెలియవచ్చునది యేమనఁగా రామాయణమునాటికి మనహిందూదేశముయొక్క యుత్తరపుకొనయును దక్షిణపుకొనయును జనాకీర్ణములైన దేశములుగా నుండెడివనియును మధ్యభాగమంతయు వట్టిఘోరారణ్యమనియుఁ దేలుటయే. ఈరామాయణమునందే కిష్కింధాకాండములో నాంధ్రాదిదేశముల ప్రశంస, దేశములఁ దెల్పుచోటఁగలదు. గాని యది ప్రక్షిప్తముగాఁ గ్రహింపవలసియున్నది. ఏమన మన మీభూభాగమును నాంధ్రదేశముగా గ్రహించుచున్నామో యాప్రదేశము జనరహితమగు మహాదండకారణ్యమని హేతుసహితముగాఁ గూడ నుత్తరకాండమున విస్పష్టముగాఁ దెల్పఁబడియున్నది. ప్రక్షిప్తభాగములను గ్రంథములందుఁ జేర్చువారు తాము నూతనముగాఁ జేర్చుదానికిఁదగు తావేదియని చూచుకొని సందర్భముగలచోట నతుకుదురే కాని కథాభాగమునంతను దిద్దజాలరు. దేశములపేర్లున్నచోట నీయాంధ్రదేశము మొదలగు నవీనదేశములనుగూడ మనవారు చేర్చిరి కాని కథాభాగమువలనఁ దేలుచున్నభావమేమో తెలిసికొనలేకపోయిరి. దొంగతనములు బయలఁబడు మార్గమిదియే కదా.

(2) ఇఁక భారతమునుబట్టి చూచినను నీప్రదేశమరణ్యమధ్యమనియే తోఁచుచున్నది. ఇందును దేశములను దెల్పుచోట నాంధ్రాదులమాట కలదుగాని యది ప్రక్షిప్తమని యాగ్రంథమే ఈక్రిందివిషయమునఁ దెలియఁజేయుచున్నది. అర్జునవనవాసపర్వములో నాతఁడు సంచరించిన తావులఁ దెల్పుటలో :—

శ్లో॥ అంగవంగకళింగేషుయానితీర్థానికానిచిత్ । జగామతానిసర్వాణితీర్థాన్యాయతనానిచ॥ దృష్ట్వాచవిధివత్తానిధనంచాపిదదౌతతః । కళింగరాష్ట్రద్వారేషు బ్రాహ్మణాః పాండవానుగాః॥ అభ్యనుజ్ఞాయకౌంతేయ ముపావర్తంతభారత । సతుతైరభ్యనుజ్ఞాతః కుంతీపుత్రోధనంజయః॥ సహాయైరల్పకైశ్శూరః ప్రయయౌ

యత్రసాగరః । సకళింగానతిక్రమ్య దేశానాయతనానిచ॥ హర్మ్యాణిరమణీయాని, ప్రేక్షమాణోయయౌ ప్రభుః । మహేంద్రపర్వతం దృష్ట్వాతాపసైరుపశోభితమ్॥

+

సముద్రతీరేణశనైర్మణిపూరంజగామహ । తత్రసర్వాణితీర్థాని పుణ్యాన్యాయతనానిచ॥ అభిగమ్యమహాబాహు రభ్యగచ్ఛన్మహీపతిమ్॥"

దీనివలనఁదేలు విషయమేటియన మహేంద్రపర్వతమునకును పాండ్యదేశమునకును నడుమ దేశము లేదనునదియైయున్నది. పైభారతవచనములో మహేంద్రపర్వతమువఱకును నర్జునుఁడు తీర్థములను, దేశములను, ఆయతనములను జూచుచువచ్చి దాని దాటిన తరువాత మణిపూరము (పాండ్యదేశమునకు ముఖ్యపట్టణము) వఱకును సముద్రతీరమునఁ బడిపోయి మరల మణిపూరము మొదలు పట్టణములను మేడలను మిద్దెలను తీర్థములను జూచినట్లు చెప్పఁబడియున్నది. ఈనడుమ నిప్పుడాంధ్రనామముచే సుప్రసిద్ధమైన దేశమున్నయెడల నదిచెప్పఁబడదా? ఇందు మహేంద్రపర్వతము కళింగదేశమునకు దక్షిణపుహద్దుగా సూచింపఁబడి యుండుటచేఁ వేఁగిదేశముకూడ కళింగదేశములోనిదేయని తెల్పవలనుకాదు. మఱియును నీభారతముననే సభాపర్వములో దిగ్విజయఘట్టములోను, రామాయణములో కిష్కింధాకాండములోను గూడ ఆంధ్రదేశమును కళింగదేశమును వేఱువేఱుగా నభివర్ణింపఁబడియున్నవి. అట్టిస్థితిలో నీఘట్టమునందు కళింగదేశమనిన నాంధ్రదేశముకూడ దానివలన గ్రహింపఁబడనేరదు. ఇంకను గళింగాంధ్రములలో

---

+ ఇటవేఁగీ (ఆంధ్ర-త్రిలింగ) విషయప్రశంస యుండవలసినది. కాని లేదు. మూలమునలేకున్నను నన్నయభట్టారకుఁడు తన భాషాంతరీకరణములో :—

" * * * *

* మహేంద్రపర్వతంబు సూచుచు

సీ. దక్షిణగంగనాఁదద్దయునొప్పిన గోదావరియుజగదాదియైన
భీమేశ్వరంబును బెడఁగగుచున్నట్టి పర్వతంబునుజూచియుర్విలోన
ననఘుమైశిష్టాగ్రహారభూయిష్టమై ధరణీసురోత్తమాధ్వరవిధాన
పుణ్యసమృద్ధమైపొలుచువేఁగీదేశ విభవంబుఁజూచుచు విభుఁడుదక్షి
ణాంబురాసితీరంబునఁ గరిగిదురిత । హారియైనఁ గావేరిమహాసముద్ర
సంగమంబుననభూసురేశ్వరులకభిమ । తార్థదానంబుచేసికృతార్థుఁడగుచు."

అని వ్రాసినాఁడు. దీనిఁజూచి చేమకూర వేంకటకవియును దన విజయవిలాసములో నీఘట్టమున వేఁగీదేశమును విరివిగా వర్ణించినాఁడు.

నాంధ్రమె సుప్రసిద్ధమని బుద్ధిమంతులు తలఁచుచున్నారు. అట్టిచో సుప్రసిద్ధమగు నాంధ్రమును విడిచిపెట్టి యప్రసిద్ధమగు కళింగమును వర్ణించుటకుఁ గారణము కానరాదు. కానఁ బూర్వకాలమునందు కళింగదేశమునకును శుద్ధద్రావిడదేశమునకును నడుమ "ఆంధ్రా" ది నామప్రసిద్ధమగు దేశము లేదనియు నీమధ్య భూభాగము వట్టియరణ్యప్రదేశమనియునందుమూలముచేతనే "మహేంద్రపర్వతందృష్ట్వా * * * సముద్రతీరేణశనైర్మణిపూరంజగామహ" (మహేంద్రపర్వతమునుజూచి సముద్రతీరమునఁబడి మెల్లఁగా మణిపూరముచేరెను) అని గ్రహింపవలసియున్నది. కొంతకాలమువఱకును మహేంద్రపర్వతమునకు పాండ్యదేశమునకును నడుమ వాసయోగ్యమగు దేశములేదను విషయమును కాళిదాసకృతరఘువంశముకూడ స్థిరపరచుచున్నది. అందు నాలవసర్గలో:—

"శ్లో. ఉత్కలైర్దర్శితపథః కళింగాభిముఖోయయౌ॥ సప్రతాపంమహేంద్రస్యమూర్ధ్ని తీక్ష్ణంన్యవేశయత్ । అంకుశంద్విరదస్యేవయంతాగంభీరవేదినః॥ ప్రతిజగ్రాహకాళింగస్తమస్త్రైర్గజసాధనః॥ పక్షచ్ఛేదోద్యతంశక్రంశిలావర్షీవపర్వతః * *

* * * *

శ్రియంమహేంద్రనాథస్యజహారనతుమేదినీమ్ * * *

†

తతోవేలాతటేనైవఫలవత్పూగమాలినా । అగస్త్యచరితామాశామనాశాస్యజయోయయౌ। ససైన్యపరిభోగేనగజదానసుగంధినా । కావేరీంసరితాంపత్యుశ్శంకనీయామివాకరోత్ * * * * *

దిశిమందాయతేతేజోదక్షిణస్యాంరవేరపి । తస్యామేవరఘోఃపాండ్యాః ప్రతాపంనవిషేహిరే॥"

అని చెప్పఁబడియున్నది. ఇందు కళింగాధిపతి "మహేంద్రనాథుఁడు" అనియు "గజసాధనుఁడు" అనియు వర్ణింపఁబడియుండుటచేత కటకము ముఖ్యపట్టణముగాఁగల్గి మహేంద్రపర్వతమువఱకును వ్యాపించియున్నదేశమని తెలియవచ్చుచున్నది. ఈ దేశము గజములకు సుప్రసిద్ధమయినట్లుగా "కటకపురిఁగాల్చె గజరాజు కలఁగిపఱవ" "కటకేంద్రుఁడంపిన గంధసింధురము లాత్మస్వామి మాఱుహస్తములు మొగువ" మొదలగు మనువసుచరిత్రాది వాక్యములు బోధించుచున్నవి యీకళింగరాజ్యమును గాళిదాసు పూర్వహిందూస్థానములోఁ జేర్చి వర్ణించికూడనున్నాఁడు. ఇట్టికళింగదేశములో వేఁగీదేశమంతర్భాగమనుట కెంతమాత్రమును వలనుకాదు. ఇఁక కాళిదాసు కళిం

---

† ఇట నాంధ్రదేశముమాట యుండవలసినది. కాని లేదు.

గదేశమును పాండ్యదేశమును వర్ణించి నడుమనున్న యాంధ్రదేశమును వర్ణింపకుండుటకు గారణములేదు. కాబట్టి యీమధ్యభాగము వట్టియరణ్యప్రదేశమనితలంచుటయేలెస్స.

పైవిషయమునకు దండకారణ్య చారిత్రమొకటి సహాయమగుచున్నది. ఇది కళింగదేశమునకును (మహేంద్రపర్వతమునకును) పాండ్యదేశమునకును నడిమిభాగము చిరకాలము నిర్మానుష్యమగు నరణ్యప్రదేశమని సహేతుకముగా స్థాపించుచున్నది. వింధ్యపర్వతము మొదలుకొని యంతటను శతయోజనములు ప్రమాణముగాఁగల దేశమునంతను గిరాణావృతమైనదాని దండుఁడను రాజు తొల్లి పరిపాలించుచుండె. అతఁడొకనాఁడు వనవిహారముచేయుచుఁ దన కులగురుండగు శుక్రుని పెద్దకూఁతు "నరజ" యను మోహనాంగినిజూచి యనంగదహన దగ్ధవివేకుఁడై యామెను గామించి యామెయిచ్ఛకు వ్యతిరేకముగా బలాత్కరించి యామెతో భోగించె. శుక్రుఁడు పుత్రికవలన సర్వవృత్తాంతమును దెలిసికొనినవాఁడై కోపించి యాదండుని దేశమున నేఁడుదినములు మట్టివాన కురియునని శపించె. ఆహేతువుచే నీప్రదేశము నిర్మానుష్యమగు దండకారణ్యమైనది. ఉత్తరకాండములో :—

"తతస్సదండః కాకుత్స్థ! బహువర్షగణాయుతం । అకరోత్తత్రమందాత్మా రాజ్యం నిహతకంటకం । అథకాలేతుకస్మింశ్చిద్రాజా భార్గవమాశ్రమం । రమణీయముపాక్రామచ్చైత్రేమాసిమనోరమే । తత్రభార్గవకన్యాం సరూపేణాప్రతిమాంభువి । * * * సదృష్ట్వాతాం సుదుర్మేధా అనంగశరపీడితః । * * * ఏవముక్త్వాతుతాంకన్యాందోర్భ్యాంగృహ్యాబలాద్బలీ । * * * తమనర్థంమహాఘోరందండఃకృత్వాసుదారుణమ్। నగరంప్రయయౌ * * * సముహూర్తాదుపాశ్రుత్య దేవర్షిరమితప్రభః । స్వమాశ్రమం శిష్యవృతఃక్షుధార్తస్సన్న్యవర్తత । సోపశ్యదరజాందీనాంరజసాసమభిప్లుతాం * * * తస్యరోషస్సమభవత్ క్షుధార్తస్యవిశేషతః । * * * దండస్యవిషయోయావత్తావత్సర్వం సముచ్ఛ్రయం । పాంశుభూతమివాలక్ష్యంసప్తరాత్రాద్భవిష్యతి। * * * అరజామిదమబ్రవీత్ । ఇహైవవసదుర్మేధే ఆశ్రమేసుసమాహితా । ఇదంయోజనపర్యంతం సరస్సురుచిప్రభమ్ । అరజేవిజ్వరాభుంక్ష్వకాలశ్చాత్రప్రతీక్ష్యతామ్ । త్వత్సమీపంచయేసత్వావాసమేష్యంతితాంనిశామ్ । అవధ్యాఃపాంశువర్షేణతే భవిష్యంతినిత్యధా । * * * శప్తోబ్రహ్మర్షిణాతేనపురావైధర్మకేతృతే । తతఃప్రభృతికాకుత్స్థ! దండకారణ్యముచ్యతే॥"
అని తెల్పఁబడినది.

కావున నీప్రాంతమునఁ బూర్వము దేశము లేకపోవుటకుఁ గారణముకూడఁ దెల్పఁబడినది. మొదటినుండియును గూడ నాగరికులగు నార్యులచేతఁగాని, ద్రావిడులచే

తఁగాని యీదండదేశము నివసింపఁబడక కిరాతులచేతనే నివసింపఁబడుచు వచ్చినది.

అట్టి యీకిరాతదేశముకూడఁ బూర్వకాలమునందే భార్గవనామక బాడబగోత్రజాత (అగ్నిపర్వతముల) ముఖంబుననుండి వెడలఁగ్రక్కఁబడిన పాంసువర్షముచేఁ బాడుచేయఁబడినది. అంతటినుండియు నీదండకారణ్యము నిర్మానుష్యమేయైపోయినది. ఇది వింధ్యము మొదలు కావేరివఱకును వ్యాపించియుండెడిది. ఇప్పుడాంధ్రనామముచే వ్యవహరింపఁబడు నీదేశము పూర్వమీదండకారణ్య మధ్యగతమైన చీమలేనిచిట్టడవిగను గాకిలేని కాఱడవిగను నుండెను. ఈప్రదేశము ఘోరారణ్యమైనట్లుగా నుత్తరరామాయణము బోధించుచున్నది. ఎట్లన.

దండకారణ్యమధ్యమున యోజనాయతమైన (100 చతురపు "మైళ్ళ" వైశాల్యముగల) పెద్దకొలనొకటికలదనియు నదిజలవిహంగమములతో నత్యంతరమణీయమై యున్నదనియు దానియొద్దున నొకయాశ్రమముకలదుగాని యందెవరును లేరనియు సమీపమునఁబడియున్న శవమును దినుటకేజంతువును లేదనియు నాప్రదేశమంత నిర్జంతుకముగా నున్నదనియు నగస్త్యుఁడు శ్రీరామునితోఁ జెప్పె. ఎట్లనిన:—

"వనం త్రేతాయుగే రామబభూవబహువిస్తరం । సమంతాద్యోజనశతం మృగపక్షివివర్జితం । తస్మిన్నిర్మానుషేరణ్యే । కుర్వాణస్తపఉత్తమం । అహమాక్రమితుంసౌమ్యమథారణ్యముపాగమం॥ తస్యరూపమరణ్యస్యనిర్దేష్టుంనైవశక్నుమః॥ * * * తస్యారణ్యస్యమధ్యేతు సరోయోజనమాయతం । హంసకారండవాకీర్ణం చక్రవాకోపశోభితం * * *సమీపేతస్యసరసోమహదద్భుతమాశ్రమ్ పురాణంపుణ్యమత్యర్థం తపస్విజనవర్జితమ్॥"

అనియున్నది. తొల్లిటి యీనిర్జనారణ్య ప్రదేశమిప్పటి మన యీయాంధ్రదేశమేయని యందభివర్ణింపఁబడిన కొలనుచాటుచున్నది. ఏమన, ఘనమై దండకారణ్యమధ్యగతమై కొంగలకాఁరమై యుండు తియ్యనీటికొలను మన యాంధ్రదేశముననే కాని మఱియెచ్చటను లేదు. దండియను మహాకవి తన దశకుమారచరిత్రములో నీయాంధ్రదేశమును వర్ణింపుచు నిందుఁ బెద్దకొలను గలదనియు నది సారసనిలయమనియు నది యాంధ్రదేశముయొక్క ముఖ్యపట్టణమునకు ననతిదూరముగా నున్నదనియు:—

"ఆయాసిషంచదినైఃకైశ్చిదంధ్రనగరం । తస్యనాత్యాసన్నెసలిలరాశి సధృశస్యకలహంసగణదళితనళినదళసంహాతిగళిత కింజల్కశకలశారస్య సారసశ్రేణిశేఖరస్యసరసస్తీరకాననేకృతనికేతనస్థితః॥"

ఈరీతివాక్యములచేఁదెల్పఁబడియున్నది. యీయుభయులచేతను నభివర్ణింపఁబడి యీకొలను "కొల్లేరు (a)" కాక మఱియొకటి కానేరదు. కొల్లేరు కొంగలకుఁ బ్రను విషయమును "కొల్లేటికొంగలు" అను లోకోక్తియే చాటుచున్నది. దక్షిణహిందూమున నెన్నఁదగిన పెద్ద తియ్యనీటికొలను "కొల్లేరు" [illegible] దండిచెప్పినట్లుగా సలిలరాశి సదృశమై యాంధ్రనగరియగు వేఁగికి నాత్యాసన్నమైయున్నది. ఇది యిప్పుడు 21 మైళ్ళ పొడవును 10 మైళ్ళ వెడల్పును గలిగియున్నది. కాఁబట్టి యుత్తరరామాయణమునందుఁ దెల్పఁబడిన కొలను కొల్లేరేకాని మఱియొకటికాదు. అందుమూలముచే నుత్తరరామాయణమునాటికి వింధ్యపర్వతము మొదలు పాండ్య దేశమువఱకును గల భూమి నిర్జనారణ్యప్రదేశమే కానిజనాకీర్ణదేశముకాదు. అందులోఁ గృష్ణాగోదావరీమధ్యప్రదేశము రూఢిగా ఘోరారణ్యమై యుండెడిది.

(2) పైపురాణగాథలవలన సీతాపునఁ బూర్వము దేశములేనట్లు స్పష్టమగుటయే కాక యిందుఁ బ్రవహించుచున్న కృష్ణాగోదావరీనదులు కూడ నప్పుడప్రసిద్ధములై యుండెడివి! నన్నపార్యునాటికి "దక్షిణగంగ నాఁదద్దయు నొప్పిన గోదావరి" యర్జునుని తీర్థయాత్రనాటికొక సుతీర్థముగానైన నెంచఁబడియుండలేదు. ఇందులకుఁ గారణమీనదులు నిర్మానుష్యమైన మహారణ్యమందుఁ బడియుండుటయై యుండును. స్త్రీలలామలకు వలెనేసరిల్లలామలకును బుట్టిన తావుకంటె మెట్టినతావు ముఖ్యముకదా.

(3) స్మృతులందుఁగూడ నాంధ్రదేశ ప్రచార మెచటను గానరాదు. మనుస్మృతిలో :—

"శ్లో. పౌండ్రకాశ్చోఢ్ర "ద్రవిడాః" కాంభోజా యవనాశ్శకాః
పారదాపహ్లవాశ్చీనాః కిరాతా దరదాఃఖశాః.

అని ద్రావిడులు (పాండ్యదేశస్థులు) మాత్రముగ్గడింపఁబడిరే కాని యాంధ్రుల ప్రశంస యెందును గానరాదు. ఇదియును నాంధ్రదేశము నవీనమని తెల్పుచున్నది.

(4) పాణిని కాత్యాయన పతంజలులు విరచించిన వ్యాకరణశాస్త్రమునందెచటను "ఆంధ్ర", "త్రిలింగ" (త్రికళింగ) వేంగి" శబ్దములు కానరావు. పాండ్యచోళ,

---

(a) దీనినిగూర్చి కూడ మనదేశమున నొకకథ వాడుకలోనున్నది. అధర్మయుతమైన యొకపట్టణము పాపభూయిష్ఠమై చెడిపోఁగా నీకొలనైనదని యొక లోకప్రతీతికలదు. ఈప్రతీతి యుత్తరరామాయణమందలి కథవలన [illegible] వికారమైయుండవచ్చును.

కళింగాదులు * గ్రహింపఁబడియుండఁగా నీదేశప్రశంస లేకుండుటకుఁ గారణముం జాలదు. ఇదియును నీదేశము తొల్లిటి ప్రసిద్ధికలది కాదని తెల్పుచున్నది.

(5) వీనినన్నిటిని సమర్థించుకొననెంచి యిప్పటిబుద్ధిమంతులు కొందఱీ దే నొకప్పుడు ద్రావిడులలోను మఱియొకప్పుడు కాళింగులలోను జేర్చుచున్నారు. మఱియును నీయాంధ్రులు కర్ణాటకనామమునఁగూడ నొప్పుచున్నారు. అనఁగా నాంధ్రదేశమునుఁ జుట్టియున్న దేశముల నామములన్నియును దీనికిఁగూడఁ గలవు. ఈవిషయమొక్కటియే యీయాంధ్రదేశము మొదటినుండియుఁ బ్రసిద్ధిగల యొక పూర్వదేశము కాదనియుఁ జుట్టుపట్లఁగల ద్రావిడులు, కర్ణాటకులు, నాంధ్రులు కళింగులు, తమతమదేశముల జనసంఖ్య వృద్ధియైనఁగొలఁది నడుమనున్న యీయరణ్యప్రదేశమును నాక్రమించి దీనినొక సంకరదేశము చేసిరనియు రూఢిగాఁ దెల్పుటకుఁ జాలియున్నది. ఈదేశమునకు ద్రావిడమను పేరున్నమాట సత్యమే కాని నిజమగు ద్రావిడదేశము వేఱుగనున్నట్లు మనము నమ్ముచున్నాముగదా. అట్లనే యీదేశమునకుఁ "కళింగ" దేశమను నామమున్నను నిజమగు కళింగదేశము భిన్నముగనున్నదికదా. అరీతినే దీనికిఁ "కర్ణాటకము" అను వాఖ్యయున్నను నిజమగు కర్ణాటకమన్యముగనున్నదికదా. ఆపద్ధతినే యీతావునకు "నాంధ్రము" అను సంజ్ఞయున్నను నిజమగు నాంధ్రము మఱియొకటికలదు. ఇఁక నితరదేశములలో సంబంధములేక యీదేశమునకుమాత్రమే రూఢమయిన నామమేది? ఈదేశముయొక్క పేళ్ళేయిది తరువాతనైన దేశమని రూఢిపఱచుచున్నవి. ఆయానామములనుగూర్చి చర్చింతము. దానివలన నిగ్గు తేలఁగలదు.

(౧) ద్రావిడము :—ఈదేశమునకుఁగలపేరులలో నిదియే మొదటిది కావచ్చును ఈనామము మొదటనొక్క పాండ్యదేశమునకే కలదు. మహాభారతమును విష్ణుపురాణమును ద్రావిడులను చోళులుకళింగులు మొదలగువారికంటె నన్యులనుగాఁ జెప్పుచున్నవి. తావున నీవ్యవహారము మొదటనొక్కపాండ్యదేశమునకుమాత్రమే కలదు. కాఁబట్టిపూర్వపురాణములు మన్వాదిస్మృతులు మొదలగువానియందుఁగల ద్రావిడపదమును నాంధ్రులందు నన్వయింపఁజనదు. పూర్వకాలమున హిందూస్థానముయొక్క యుత్తరాలి యుత్తరమును ఆర్యులును, దక్షిణాలిదక్షిణమును ద్రావిడులును నాక్రమించియుండిరి. మధ్యభాగము కాననమయమును గిరాతావృతమునునై యుండెను. ఇట్లుండ తమతమదేశములం

* పాండోర్డ్యణ్ (4-1-168*) ద్వ్యఞ్ మగధకళింగసూరమసాదణ్ (4-1-170) కంభోజాదిభ్య ఇతివక్తవ్యం [కంభోజ, చోళ, కేరళ, శక, యవన, కంభోజాదిః] (4-1-175*)

నమధికమైనకొలఁది నార్యులు దక్షిణమునకును, ద్రావిడులుత్తరమునకును వ్యాపిం
చ్చిరి. మనపూర్వగ్రంథములలో "కళింగదేశము" గంగానది ప్రవహించెడుదేశము
డపటిదిగా వర్ణింపఁబడినది. అట్టిది క్రమక్రమముగా గోదావరివఱకును వ్యా
ు. ద్రావిడమును దక్షిణహిందూస్థానముయొక్క కొట్టకొన నున్నట్లు మనవారు
వర్ణించిరి. అయ్యది క్రమక్రమముగా గోదావరివఱకువ్యాపించినది. కళింగముద్రావిడ
మును గోదావరికడఁ గలసినవి. దక్షిణపుకొననున్న ద్రావిడులు క్రమక్రమముగాఁ బైకి
వ్యాపించిరను విషయమును హరివంశాదులు రూఢిపఱచుచున్నవి. మన దక్షిణాపథము
యొక్క కొట్టకొనయందుఁ దొల్లి "అక్రీడుఁడు" అనురాజు పాలించుచుండెను. అత
నికి పాండ్య, కేరళ కోల, చోళులను నల్వురు పుత్రులుకలరు. వీరిలోఁ బెద్దవాఁడగు
పాండ్యుఁడు స్వస్థానముననే రాజయ్యెను మిగిలిన ముప్వురును స్వదేశమును దాటి పైకి
వచ్చి, చోళ, కేరళ, కోలరాజ్యముల స్థాపించుకొనిరి. అని పురాణములు చెప్పుచున్న
వి ద్రావిడదేశమున నీప్రతీతియునుగలదు. ఆదివంశ్యులైన పాండ్యులుత్తరమునకు రాను
రానాయాదేశములు క్రమక్రమముగా ద్రావిడములయినవి. కావున పురాణములనాటి
కొక విధముగా పాండ్యచోళ, కేరళములు ద్రావిడములయినవి. ఈపేరితో నాయాప్ర
దేశములందుఁ జిరకాలము నివసించి యందును జనాధికముగుటచేఁ గ్రమక్రమముగాఁ గృ
ష్ణాగోదావరీ తీరములకు వ్యాపించిరి. అశోకుని శాసనములనాటికిది యొకదేశముగా లే
దుగాన నప్పటికీభూభాగమింకను ద్రావిడులచే నాక్రమింపఁబడలేదు. కావున నించుమిం
చుగా క్రీస్తుశకమునకుఁబూర్వము 200 (వందల) ఏండ్లక్రింద ద్రావిడులీదేశము నాక్రమిం
చి ద్రావిడమునుజేరిరి. కాన ద్రావిడనామమన్యులమూలమున నైనదే కాని వేఱుకాదు. ఇ
ది యాంధ్రభాషాపదముకాదు. దక్షిణదేశమునుండి మొదట నీయరణ్యములందుఁ బ్రవే
శించి యిందు నివసించినవారు జైనద్రావిడులు. వీరియానవాళ్లు క్రీస్తుశకమునకు 200
ఏండ్లనుండి కాన్పించుచున్నవనవచ్చు. అప్పుడైనను గొందఱు జనులక్కడక్కడనున్నను
మంచిదేశమైయుండదు. కావుననే కాళిదాసు తనకాలమునాఁటికిఁగూడ నీప్రదేశమర
ణ్యమయమైనట్లె వర్ణించియున్నాఁడు.

(b) అంధ్రము, ఆంధ్రము:—ఇది యుత్తరమునుండి వచ్చినవారిచే నీయంబ
డినపేరు. ద్రావిడులీదేశమునంగల యరణ్యముల భేదించి యిందునివాసము లేర్పఱచుకొని
సుఖజీవనము చేయుచుండఁగా మగధదేశమును బరిపాలించు "ఆంధ్ర" నామకప్రభుపు
దేశమును జయించి తమవశముచేసికొనిరి. ఇది యించుమించుగాఁ గ్రీస్తుశకము మొద
టిశతాబ్దమున జరిగియుండవచ్చును. ఈకాలమునాటి మగధదేశరాజుల నాణెములు థ

రణికోటయందు దొరకినవి. * అప్పటినుండియు నీదేశమునకు "ఆంధ్రదేశము" సంజ్ఞకలిగినది. ఇది యుత్తరముననుండి వచ్చినవారిచే నీయంబడిన సన్నయగుటచే రదేశస్థులందఱిచేతను (పూర్వపుసంస్కృత గ్రంథములన్నిటియందును) నీనామమే బడినది.

మఱియును ఆంధ్రనామముత్తరమున నుండివచ్చినదగునా కాదా. ఇది యీదేశమున కెప్పటినుండివ్యవహరింపఁబడుచున్నది. ఈదేశమునకుఁ గాకయిఁక నేప్రదేశమునకైన నీనామమున్నదా లేదాయను విషయము బాగుగా తరచవలసియున్నది. ఈదేశస్థులాంధ్రులైనను గాకున్నను జిరకాలమునుండి యాంధ్రులను వారు మన హిందుస్థానమున నున్నట్లు కాన్పించుచున్నదఁట. ఐతరేయబ్రాహ్మణములో నాంధ్రులనాగరికులుగాఁ జెప్పఁబడిరి కాని యందు వీరెచ్చటనుండెడివారో తెల్పఁబడి యుండలేదు. రామాయణమునఁ గిష్కింధాకాండములోను భారతమున సభాపర్వములోను వీరు దక్షిణాపథమునందలివారని తెల్పఁబడినది. వానిలో భారతమునందు :—

"శ్లో. పౌండ్రాంశ్చద్రవిడాంశ్చైవసహితాంశ్చోఢ్రకేరళైః॥ ఆంధ్రాంస్తాలవనాంశ్చైవకళింగానుష్ట్రికర్ణికాన్"

అని దక్షిణాపథమున వీరుండినట్లు తెల్పఁబడియున్నది. కాని కొన్నినాగరప్రతులలో "ఆంధ్రాంస్తాలవనాంశ్చైవ" అని యుండుటకు మాఱుగా "అంధాంస్తాలవనాంశ్చైవ" అని "అంధ" శబ్దము కాన్పించుచున్నది. తెలుఁగులిపితో వ్రాయఁబడిన గ్రంథములందునుగూడ భీష్మపర్వములో :—

"అంధాశ్చబహవో రాజన్నంతగిర్యస్తథైవచ" అని "అంధులు" చెప్పఁబడియున్నారు. ఇది "అంధ్ర" శబ్దమునకు మాఱుగా లేఖకప్రమాదవశమునఁ బడినదనుకొందమన్నను మార్కండేయపురాణములో :—

"శ్లో. ఏతే దేశాహ్యుదీచ్యాశ్చప్రాచ్యాన్ దేశాన్ నిబోధమే॥
అన్ధ్రావాకాముదకరా అన్తర్గిర్యాః బహిర్గిరాః॥"

అని ఆంధ్రదేశము పూర్వహిందూస్థానమునఁ దెలుపఁబడినది మఱియును.

"శ్లో. అథాపరే జనపదాదక్షిణాపథవాసినః। పాండ్యాశ్చ కేరళాశ్చైవచోళాః కుల్యాస్తథైవచ। * * * తైలకాః కుంతలా అన్ధ్రాః ఉద్భికాస్తాలరావికాః॥

---

* There are coins to be found there (Dharanikota) of the Andhra Kings of Magadha of the first Century A. D. Kistna District Manual.

అని "అంధులు" దక్షిణాపథవాసులైనట్లు చెప్పఁబడియున్నది. దీనినిఁబట్టిచూడఁగా "ఆంధ్రులు" ను "అన్ధులు" ను గూడఁగలరని తోఁచుచున్నది. వారిలో నాంధ్రులు దక్షిణమున నున్న కళింగులకంటె పైననుండిరి. కాఁబట్టి దక్షిణదేశమున అన్ధ్రలనువారొకజాతివారు కలరని తెలియవచ్చుచున్నది. కానివీరెక్కడనివసించెడివారో కానరాదు. మనదేశమునకు నాంధ్రనామమే కలదుగాని అన్ధనామము కానరాదు. దాక్షిణాత్యులైన యీయంధులనుగూర్చి వాల్మీకిమొదలగువారు ముచ్చటించియుండఁగా లేఖకులు క్రమక్రమముగా వారి నాంధ్రులను జేసిరో లేక ఆంధ్రులే అంధులు చేయఁబడిరో. ఏది యెట్లున్నను దక్షిణముననున్న కళింగులకంటె పైనమాగధాదులతోడి పాటుగా నాంధ్రులున్నట్లుగాఁ బైగ్రంథములవలనఁ దెలియవచ్చుచున్నది. కాఁబట్టి యీయాంధ్రులిప్పటిమనదేశమున నివసించువారు కారు. వీరు మొదలు మగధదేశసమీపముననుండి యటుపై నాదేశమునకుఁ బ్రభువులై పిమ్మటఁబైనఁజెప్పినట్లుగా క్రీస్తుశకము మొదటి శతాబ్దమున మనదేశమునకు వచ్చియుందురు. అప్పకవి:—

"ధీవరలుబ్ధకా- దివినీచజాతుల మానవులకునెల్ల మగధభాష" అని చెప్పియుండుటచే మగధదేశస్థులార్యులచే ననాగరికులుగాఁ గొంతకాలము పరిగణింపఁబడినట్లు తోఁచుచున్నది కాఁబట్టి యైతరేయబ్రాహ్మణములో నాంధ్రుల (మగధదేశస్థుల) ననాగరికులనుగా నెంచుట న్యాయముగానేయున్నది. ఆంధ్రులు మనదేశమునకువచ్చిన తరువాతనన్నను మిక్కిలి నాగరికులుగానుండిరి కాని నాగరికతాహీనులై యుండలేదు. కాఁబట్టి పూర్వగ్రంథములందు ఆంధ్రులు అనిచెప్పఁబడినచో వారు మనవేంగీదేశమందలివారని యెంచరాదు. ద్రావిడులవలెనే యాంధ్రులును నొకప్పుడు మనదేశమునకు వచ్చిరేకాని మొదటినుండియునిచటివారుకారు. ఆంధ్రశబ్దమును ద్రావిడభాషాపదముకాదు. ఇందలి "థ" కారమనాంధ్రవర్ణమగుటచేత, నుత్తరముననుండి యీపేరుమనకు వచ్చినదని తలఁచుటయే లెస్స. ఈయాంధ్రులు మనదేశమునకువచ్చిన తరువాతనే యీదియొకదేశమై ప్రసిద్ధికివచ్చియుండును. అంతకుఁబూర్వమే యీప్రదేశమునకు ద్రావిడులువచ్చినను వారక్కడక్కడ నివసించుటయేకాని తగుదేశమును జేసి యుండలేదు కావుననే కాళిదాసిచట దేశమును వర్ణించినాఁడు కాఁడు.

మొదటనుత్తరమునఁ గళింగదేశముండియు నది క్రమక్రమముగా దక్షిణాపథములోనికి వ్యాపించిన తరువాతఁగొంతకాలమునకుత్తరపుదేశమన్యముగామాఱిపోయి దక్షిణపుటిమాత్రమే నిల్చినట్లుగా, పూర్వాంధ్రదేశముపోయి తుదకు మన యీదేశమునకు నాంధ్రనామము నేటికిని నిలిచినది.

(C) కళింగము, త్రికళింగము, త్రిలింగము :— న్యాయముచే వేంగినామ శోభితంబగు మన యీశుద్ధాంధ్రదేశమునకు కళింగమను నామము లేదు. క్రీస్తుశకము 404 నాటివాఁడైన వరాహమిహిరుఁడు తన బృహత్సంహితలో పాండ్య, చోళ, కేరళ, కర్ణాటక, కళింగ, ఆంధ్రదేశములను వేఱువేఱుగాఁ జెప్పియున్నాఁడు కాఁబట్టి యాకాలము నాఁటికాంధ్రదేశమును గళింగదేశమునుగలిసిపోలేదు. జావాద్వీపమునందుఁగల 841 ఏ.డి. నాఁటిలేఖనములలో క్లింగు (కళింగము)... ...గోల (చోళము) చ్వలిక (చళుక్యము) మల్యాలా (మళయాళము) కర్ణాకే (కర్ణాటకము) అని యీప్రాంతములందలి దేశములు వివరింపఁబడినవి. ఇందు కళింగదేశము వేఱుగను చాళుక్యదేశము (ఆంధ్రము) వేఱుగను దెల్పఁబడియున్నది. నన్నయభట్టారకుఁడును 11 శతాబ్దమున కళింగదేశమును వేఱుగను వేఁగీదేశమును వేఱుగను వర్ణించినాఁడు కళింగనామము కలిగినను ఇటీవల కలిగినదైయుండును. మనగ్రంథములనుబట్టి చూడఁగా కళింగములు మూఁడు కాన్పించుచున్నవి.

మార్కండేయపురాణములో :—

1 "శ్లో॥ మత్స్యాశ్శ్వకూటాః కుల్యాశ్చ కున్తలాః కాశికోసలాః
అథర్వాశ్చ కళింగాశ్చ మశకాశ్చవృకైస్సహ
మధ్యదేశ్యాజనపదాః ప్రాయశోమీ ప్రకీర్తితాః."

* * * * *

2 "శ్లో॥ గాన్ధారాయవనాశ్చైవ సిన్ధుసౌవీరమద్రకాః
శతద్రుజాః కళింగాశ్చ పరదాహారభూషికాః.

* * * * *

చలికాహుహుకాశ్చైవ ఉర్ణాదార్వాస్తథైవచ
ఏతేదేశాహ్యుదీచ్యాశ్చ
ప్రాచ్యాన్దేశాన్నిబోధమే."

* * * * *

3 అథాపరేజనపదాదక్షిణాపథవాసినః । * * *
మహారాష్ట్రామాహిషకాః కళింగాశ్చైవసర్వశః."

అనియుత్తరదేశమునందును, మధ్యదేశమునందును, దక్షిణదేశమునందును మూఁడుతావులకళింగదేశమున్నట్లు వర్ణింపఁబడియున్నది. వీనిహద్దులుమాత్రము తెలియరావు.

మహాభారతమునందునుమూఁడుతావుల కళింగదేశము వర్ణింపఁబడినది. గంగమొదలుకటకమువఱకును వ్యాపించియున్న భూభాగములో కొంతభాగముత్తరకళింగమై యుండునని తోఁచుచున్నది. ఈయుత్తరకళింగమే "ఉత్కల" మైయుండవచ్చును. కటకము మొదలు మహేంద్రపర్వతమువఱకును గలది మధ్యకళింగము. మహేంద్రపర్వతము మొదలు పిఠాపురమువఱకును గల ప్రదేశము మూఁడవకళింగమైయుండునేమో. ద్రావిడము పైకి వ్యాపించినట్లే కళింగము క్రిందకు వ్యాపించినది. ఇదియే "త్రికళింగము" ను సంజ్ఞను గూడనందియుండును. ఆంధ్రులప్రభతగ్గిపోయిన తరువాత నీత్రికళింగము వేంగికి కూడ వ్యాపించియుండును. యుద్ధమల్లుని శాసనములందొక దానిలో "వేంగీభువః పతిరభూత్త్రికళింగకోట్యేః" అని "త్రికళింగము" వాడఁబడియున్నది. త్రికళింగమనగా మూఁడు కళింగములని యూరోపీయపండితులు తలఁచుచున్నారు కాని యది సరికాదు "త్రిదివము" నినట్లుగా "త్రికళింగము" అనిన తృతీయకళింగము అనియర్థము. ఈకళింగశబ్దము నుండి "త్రిలింగ" శబ్దమును దానినుండి "తెలుఁగు" ను బుట్టియుండును. మన పండితులు "త్రిలింగ" శబ్దము త్రి + లింగ శబ్దములనుండి పుట్టినదనియు నీదేశమున మూఁడు ప్రసిద్ధలింగములు కలవనియు నందుమూలమున నీదేశమునకు త్రిలింగసంజ్ఞ కలిగినదనియుఁజెప్పుదురు.

అప్పకవి తనవ్యాకరణములో :—

"క॥ శ్రీక్షితిధరకాళేశ్వర । దాక్షారామంబులనంగ దనరారెడు నీ
త్రిక్షేత్రంబులలింగము । లీక్షితిని ద్రిలింగసంజ్ఞ నెన్నికకెక్కెన్.
తే.గీ॥ తత్త్రిలింగనివాసమైతనరుకతన । నాంధ్రదేశంబుదాఁ ద్రిలింగాఖ్యమయ్యె
దెలుఁగగుచుఁదద్భవముదానివలనఁబొడమె । వెనుకకొందఱుదానినె తెనుఁగునంద్రు."

అని శ్రీశైలము, దాక్షారామము, కాళహస్తి యీమూఁడు క్షేత్రముల లింగములును త్రిలింగములనియు, వానిచేనొప్పునీదేశము త్రిలింగదేశమనియు వ్రాసియున్నాఁడు. మనపండితులందఱు నిట్లేతలఁచుచున్నారుకాని ఖండాంతరపండితులు చెప్పినట్లుగా నిది యిటీవలమనపండితులుకల్పించుకొనిన వ్యుత్పత్తియేకాని నిజమగునుత్పత్తిగాఁ దోఁచదు మనవారిటీవలతలఁచినట్లుగా మనదేశము పైత్రిక్షేత్రములచేతను బూర్వమునుండియు నంతప్రసిద్ధమైయుండినయెడల నన్నయభట్టారకుఁడు భారతములో వేఁగీదేశమును వర్ణించుచోట "దక్షిణగంగనాఁదద్దయునొప్పిన గోదావరియును, జగదాదియైన భీమేశ్వరంబును బెడఁగగుచున్న శ్రీపర్వతంబు" ను మాత్రమభివర్ణించి యూరకుండునా? ఇంతవర్ణించినవాఁడు కాళహస్తినిమాత్రమేలవర్ణింపకుండును. కావున కాళహస్తి పురాతనప్రసిద్ధికల

దని చెప్పుటకు నాధారమేదియును గాన్పింపదు. అంతియకాక శాసనములలో " త్రికళింగము" అని కాన్పించుచున్నటికఁడా దీనిగతియేమికావలసియుండును. మఱియును మనదేశమునకీ త్రిలింగసంజ్ఞ క్రీస్తుశకము 3, 4 శతాబ్దములనుండియును గూడవాఁడబడుచున్నది. అప్పటికీ దాక్షారామ, శ్రీశైలక్షేత్రములైన నున్నవో లేవో యనవలసి యున్నది. కాఁబట్టి ఖండాంతరులు తలఁచినట్లుగా "త్రికళింగము" చెడి త్రిలింగమైనదనియుందానినుండి "తెలుఁగు" పుట్టినదనియు నెంచుటయే లెస్సగానున్నది. కావున త్రిలింగ, తెలుఁగు (తెనుఁగు) సంజ్ఞలు మనదేశమునకు కళింగుల మూలముగా వచ్చినవే కాని మనవారివలన వచ్చినవి కావు. ఈశబ్దములు తెలుఁగులును గావు.

కర్ణాటకదేశము :—ఈసన్నయును మనదేశమునకుఁ గలదు, ఇది విశేషముగా వాడుకలో లేకపోయినను లిపులసంబంధమును బట్టియు భాషాసంబంధమును బట్టియును జూడఁగా బహుకాలమునుండి కర్ణాటకులకును మనపూర్వులకును సంబంధమున్నట్లు స్పష్టమగుచున్నది. ద్రావిడులు ముందు కర్ణాటకమును, దానినుండి దీనిని ఆక్రమించి యుండురు కాన నీనామమును మిక్కిలి పురాతనమే యైయున్నది. ఇది కర్ణాటకుల ముఖముగా వచ్చిన పేరు. ఇది అనాంధ్రపదము.

వేఁగి :—ఇఁక నితరదేశములతో సంబంధములేక యీదేశమునకు మాత్రమే వర్తించు నామమేది? "వేఁగి" యనునదియొకటి మనదేశమునకుమాత్రమే వర్తించు సంజ్ఞగాఁగాన్పించుచున్నది. ఈపేరు దేశమింకనొకటి కానరాదు కాని దీనివ్యుత్పత్తి నాలోచించిచూడఁగా నిదియును నీదేశపుమాట కాదనియుఁ బరులచేత నీయఁబడినసంజ్ఞయేయనియుఁ దెలియవచ్చుచున్నది. ఈపదమధ్యగతమగు నరసున్న తొల్లి యిది "వేంగి"* యనురూపము కలదియని చాటుచున్నది. శాసనములందు "వేంగి" యనియుఁ వాడఁబడియేయున్నది. ఈ వేంగియనుపదము మనభాషలో లేనేలేదు. ఇది దీర్ఘముమీఁది యరసున్న యగుటచే మనభాషలో "వేంగి" యను రూపము రాఁజాలదు కావున దీని యుత్పత్తికై యితరదేశభాషల నారయవలయును. అరవములో నీదేశమును "వేఙ్గై" అందురు. తంజావూరు గుడియందుఁగల శాసనములలో "వేఙ్గై" అనియే వ్రాయఁబడియున్నది. ఆ భాషలో "వేఙ్గై" అనిన పులి యర్థము. మనభాషయందును "వేఁగి" యనినఁ బులి

* అరవమునను, కన్నడమునను, సంస్కృతమునను గూడ నీదేశము వరుసగా వేఙ్గై, వేంగి, వేంగీ యనిపిలువఁబడుటను చీనాదేశమునుండి యీదేశమునకు యాత్రార్థియైతొల్లివచ్చిన హౌనుత్సాంగు అను నాతఁడు దాని "పింకిలో" అని వాడియుండుటను మొదటినామము వేంగి యగుట సత్యమని తెలియవచ్చుచున్నది.

యర్థమగుచున్నది. కాఁబట్టి "వేఙ్గి" నుండి "వేఁగి" పుట్టినదనుటకు సందేహింపవలసినయవసరమింతయును లేదు. ఆలోచించిచూడఁగా ద్రావిడులీతావునకు ముందువచ్చినప్పుడిది యరణ్యప్రదేశమగుటచే దీనికి వేఙ్గినాడు అనఁగా వ్యాఘ్రదేశము అను నామమునిచ్చియుందురని తోఁచుచున్నది. ఇటీవలమనపండితులు వేఁగి యనునది వేఙ్గినుండి పుట్టినదెఱుఁగక వేగుటయను ధాతువునుబట్టి వేగిపురమును "ఉదయపురము" అనియు వేఁగుటకు దగ్ధమగుటయని యర్థముచేసి "వేఁగినాడు" అనఁగా దగ్ధరాష్ట్రము అని కొందఱు నవీనులును వాడిరి కాని యివియన్నియును దప్పుటూహలు. "వేఁగినాడు" అనిన పులినాడనియు, వేగిపురమనిన వ్యాఘ్రపురమనియు గ్రహించుటొప్పు. కావున నిదియును మనదేశస్థులచే నీయఁబడిన సంజ్ఞ కాదు మనభాషాపదమును గాదు. ఇది ద్రావిడులమూలముగా వచ్చిన పేరు.

కాఁబట్టి మనదేశము పూర్వపు ప్రసిద్ధికలది కాదు ఇది పల్వురు దేశస్థులు కూడి చేయఁగా నైనసంకరదేశము. న్యాయ్యముచే దీనిని "ద్రావిడాంధ్రకళింగ కర్ణాటకము" అని పిలువవలెను. దీనిలో నేకదేశమగు ద్రావిడమనియుండె, ఆంధ్రమనియుండె, కళింగమనియుండె, కర్ణాటకమనియుండె పిలువవచ్చును గాన నీ పేరులన్నియును దీనికిఁ గలిగినవి. దీనిస్థితి యించుమించుగా క్రీస్తుశక ప్రారంభమున ననిచెప్పవచ్చును. ఇందొక పురమైనను తొల్లిటిప్రసిద్ధికలది కాకుండుటయు నాచెప్పినది సత్యమని రూఢియగుచున్నది. దక్షిణాపథమునందుఁ గల ద్రావిడదేశములలో పాండ్య, చోళ, కర్ణాటకాదులు క్రమానుసారముగాఁ బురాతనములు, ఆంధ్రము నవీనము అని పలువిషయములవలన విస్పష్టముగాఁ దేలుచున్నది. కాన నిఁక మనభాషనుగూర్చి ముచ్చటించుకొందము.

## ఆంధ్రభాషాప్రశంస.

మనదేశమునకు వలెనే మనభాషకును స్వతంత్రనామమేదియును లేదు. విశేషించి మనదేశము తనకే చెందునట్టి "వేఁగి" యను నాఖ్యనైన నందినది, మనభాషకదియును లేదు. ద్రావిడమునకు సంబంధముగల ద్రావిడనామమును, ఆంధ్రమునకు సంబంధముగల ఆంధ్రనామమును, కర్ణాటకమునకు సంబంధముగల కర్ణాటకనామమును, కళింగమునకు సంబంధముగల త్రిలింగ (తెలుఁగు) నామమును గలిగియున్నదెగాని తనకుమాత్రమే సంబంధించునామమును గలిగియుండలేదు. మనదేశమున కెన్నిపేర్లు కలవో యన్నినామములును భాషకును గలవు గాని యొక్క "వేఁగి" సంజ్ఞమాత్రము కలుగలేదు. మనభాషకు "వేఁగిభాష" యను ప్రసిద్ధిలేదు. ఇతరదేశములకుఁగూడ వర్తించు నామ

ము లెన్ని కలవో యన్ని నామములును భాషకునుగలిగి యీ దేశమునకుమాత్రమే చెల్లు నామ మాత్రమీభాషకు లేకుండుటచూడఁగా వింతగానున్నది. వింతయేల దీనివలన నీభాష యొక దేశమునకుమాత్రమే సంబంధించియుండు నొక స్వతంత్రభాషకాదనియు నెన్ని సంజ్ఞలుదీనికిఁగలవో యాయా సంజ్ఞలకు సంబంధించిన భాషలన్నిటివలనను గలిగిన నవీన సంకరభాషయనియుఁ దేలుచున్నది. న్యాయ్యముచే నీభాష ద్రావిడాంధ్ర కళింగ కర్ణాటభాషయైయున్నది గాని, యొక్క ద్రావిడము, ఆంధ్రము, కళింగము, కర్ణాటకమును గాదు. కాన నీపేళ్ళనుగూర్చి కొంచెమువిచారింతము.

ద్రావిడము:—ఇది ద్రావిడభాష యనుటకు సందేహించువారు లేరుగదా. ద్రావిడభాషలనిన మనతెలుఁగుకూడ నందులోనిదేయగుచున్నది. నిజమగు ద్రావిడభాష "అరవము." కాఁబట్టి మనభాష యరవముతో సంబంధించి యున్నది. ఈవఱకును మనపండితులీవిషయము నెఱుఁగనివారగుటచే నిది విస్పష్టముగా వ్రాయవలసివచ్చినది. మనపండితులీభాషను శుద్ధదేశ్యమనియు, అన్యదేశ్యమనియు రెండువిధములుగా గ్రహించి యందులో :—

"క॥ జలశయన యాంధ్రదేశ్యం । బులు రెండు తెఱంగులయ్యె భువి శుద్ధాంధ్రం
బులు నన్యదేశజాంధ్రం । బులు నాఁగామఫలినామపురవరధామా.
తే॥ ఆంధ్రదేశపురస్థాయులైనసకల । జనములకును మఱుఁగుదేశంబులేక
తేటతెల్లమిగాఁబల్కుమాటలెల్ల । నవనిశుద్ధాంధ్రదేశ్యంబులనఁగఁబడును.
క॥ పాలును పెరుగును నేయియు । వాలాయంబుట్టిపట్టివంచుకత్రాగె
ఱోలెక్కకనీబిడ్డఁడు । జోలెడిదేమమ్మ యనఁగశుద్ధాంధ్రంబుల్."

అప్పకవీయము.

అని పాలు, పెరుగు, నేయి, రోలు, ఉట్టి మొదలగుపదములు శుద్ధత్రిలింగదేశజాంధ్రపదములని మనవారు తలంచిరి కాని యీపదములు ద్రావిడభాషలయందన్నిటియందును గలవనియు నంతియేకాక యాపూర్వపుభాషాపదములలోనుండిపుట్టిన వికారములే యీ తెలుఁగుపదములనియు నెఱుంగరైరి. ఈక్రిందిరీతినీపదములితర ద్రావిడభాషలందునుగలవు.

| తెలుఁగు. | కన్నడము. | అరవము. | విశేషములు. |
|---|---|---|---|
| పాలు | హాలు | పాల్ | "పాల్" అను మొదటిరూపము అరవమునందుఁగలదు గాన మన "పాలు" అరవమునుండి పుట్టినదనఁదగు. కన్నడములో "ప" కారము "హ" కారముగామాఱును. ఉ॥ పూవు = హూవు. |

| తెలుఁగు. | కన్నడము. | అరవము. | విశేషములు. |
| --- | --- | --- | --- |
| పెరుగు | ... | పెరుగు | |
| నేయి | ఇందు సమాసమున నెయ్ మాత్రముకలదఁట. | | "నెయ్" అనునది మొదటిరూపము. మన భాషలో వ్యుత్పత్తిలేనిమాటగాఁ గాన్పించుచున్న "వెన్న" యనుపదమునకు నరవమునకుఁబోదుమేని అందు వ్యుత్పత్తి కాన్పించుచున్నది. అందులో నీపదము ను "వెణ్ణెయి" అందురు. ఇదివెణ్ (శ్వే) + నెయ్ (తెల్ల నెయి=అనియర్థము) అనుపదములనుండిపుట్టినది. ఈ వెణ్ణెయ్నుండి మన "వెన్న" పుట్టినది. కాన 'నెయ్' తొలిరూపము నెయి దాన నేయియగు. |
| రోలు | ఉరులు | ఉరుల్ | "ఉరుల్" అనునది మొదటిరూపము. ఏల యన ఇది సంస్కృతభవము "ఉలూఖల" శబ్దమునుండిపుట్టినది. "ఉ (లూ) ఖల" లోని "లూ"లోపించికొన్ని భాషలలో నీపదము "ఉఖ్ఖల్" అయినది. ఇది యుత్తరదేశభాషలలోఁగలిగిన మార్పు ఇఁక నీదక్షిణదేశపు భాషలందునను 'ఖ' లేదు గాన 'ఉలూ (ఖ) ల' లోని 'ఖ' లోపించి 'ఉరుల్' అయినది. 'ల' కు రకారాదేశము లోకములో సామాన్యమేకదా. ఈ 'ఉరుల్' అను రూపము మొదట నరవమునందుఁ గలిగినతరువాత దానినుండి వర్ణప్లుతిచే మన 'రోలు' కలిగినది. వర్ణప్లుతియనఁగా నొకవర్ణము తానుండు తావునుండి వేఱొకచోటికిదుమికి యచట సంధిని గలిగించుట. ఒకభాషనుండి పదమిక నొక భాషలోనికి మాఱుటలో నిట్టి వర్ణప్లుతులు కలుగుట సామాన్యమే. దీని నింగ్లీషు భాషలో "Metathesis" అందురు. అరవమునుండి మన తెలుఁగుపదములు పుట్టినప్పుడిట్టి ప్లుతులు చాల కలవు (అవన్ = వాన్, ఇవన్ = వీన్, ఇలన్ = లేన్. |

| తెలుఁగు. | కన్నడము. | అరవము. | విశేషములు. |
|---|---|---|---|
| | | | ఇక్రైయన్ ఓన్ అయి వీనివలన వరుసగా ఁవాఁడు, వీఁడు, లేఁడు, ఓఁడు పుట్టినవి. ఇలర్ = లేరు అయినది.) |
| ఉట్టి | ... | ఉఱి | ఇది అరవములో "ఉఱ్ఱి" యనగును. అరవములో "ఱ్ఱ" "ట్ట గాఁబలుకఁ బడును గాన" ఉట్టిమనలో నైనది మన 'ట'అకు సంబంధించిన యాకృతినందుటకుఁగారణము నిదియైయుండును అకు మన భాషలో 'ట్ట' వచ్చుట కలదు. చిఱు + ఎలుక 'చిట్టెలుక' యగు. |
| బిడ్డఁడు | హుడిశ | ... | ఇది 'పుత్త్ర' శబ్దవికారము కావచ్చును. |
| పట్టుట* | హిడియువద్ | *పఱ్ఱుతల్ | * సంయుక్తాక్షరములు మాఱునప్పుడిట్టి రూపములు కలుగుచునేయుండును. ఉ. పుత్ర=బొట్టె. వేత్ర=బెత్తము. ప్రగ్రహ=పగ్గము. మొదలైనవి |
| వంచుట | బగ్గిసు | వళైత్తల్ | వంచు, వంగు ధాతువుయొక్క ప్రేరణముకదా. |
| త్రాగుట | ... | ... | ఇది సంస్కృతమునందలి 'దాహ' శబ్దభవమని తోఁచెడిని 'తాగుట' యను రూపమును గలదు కదా. 'దాహ' 'తాగు' అగుట న్యాయమే. హకారమునకు గకారమువచ్చుట స్వాభావికమే. దాహమనఁగా దప్పిరే యర్థమయినను నదితీరు దానికిఁగూడ మనలో నర్థమగుచున్నది. అందుచేతనే 'దాహమునుబుచ్చుకొనుట' యను వాడుక కలిగినది. దానినుండి తాగుటపుట్టినది. |
| ఎక్కుట | హత్తువద్ | ఎరుత్తల్ | ఆకతాయి (ఆతతాయి) మొదలగువానియందుతకారమునకు కకారమువచ్చుటఁ గనుచున్నాము |
| సీ | సీ | సీ | |
| పాలాయము | ... | పలముఱైయ | |

పైపట్టికవలన మన అప్పకవి శుద్ధాంధ్రములని తలఁచినపదములన్నియుఁ జాలవఱ కు ద్రావిడభాషలన్నిటితో సంబంధించినవేయనియు విశేషించి వానివలనఁ బుట్టినవేయ నియుఁ దెలియవచ్చుచున్నదికదా. ఈవిశేషమును మనభాషకుఁ దొల్లిలక్షణము వ్రాసి నవా రెఱుంగరు.

**కర్ణాటకము:**—ఇదికన్నడము మూలముగావచ్చినపేరు మనదేశజులవలనరాక పరు లవలనవచ్చినపేరే యైనను "వేఁగి" యనుసంజ్ఞ నొకదానిని మనదేశముఁ దనకు మాత్ర మే చెందుదానినిగలిగి యున్నది. మనభాషకదియును లేదు. దీనికిస్వతంత్రనామము లేనే లేదు సరికదా పైఁగా "కర్ణాటక" సంజ్ఞనే స్వసంజ్ఞగా గొనియున్నది. "కర్ణాటభా ష" అనినఁ ద్రిలింగదేశమున వ్యవహరింపఁబడు శుద్ధాంధ్రభాషయను నర్థమునుగలదు! శ్రీనాథుఁడు తనభీమఖండములో :—

"గీ. ప్రౌఢిపరికింప సంస్కృతభాషయందు
పలుకు నుడికారమున నాంధ్రభాషయందు
నెవ్వరేమన్న నందు నాకేలకొఱఁత
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష"

అని తెలుఁగును గర్ణాటభాషయని తెల్పినాఁడు. మనభాషను వేఁగిభాషయనుస్వ తంత్రనామము లేకపోవుట, భాషావిషయమునను లిపి విషయమునను గర్ణాటభాష తోవిశేష సంబంధము కలిగియుండుటయును, మఱియును గర్ణాటభాషయను నామ మునుగూడ నందియుండుటయును విచారించి చూడఁగా మనభాషచాలవఱకు కన్నడ ముయొక్క వికారమని చెప్పవలసి వచ్చుచున్నది. దక్షిణదేశపు భాషలఁ జక్కఁగాఁ బరికించిన వారలందఱు నిట్లెచెప్పుచున్నారు. కాల్డువెల్, బ్రౌనులోనగు ఖండాంతర పండితులిట్లె వ్రాసిరి. మనలో శేషగిరిశాస్త్రిగారు మున్నగువారును నిట్లె చెప్పుచు న్నారు *

**తెలుఁగు తెనుఁగు :**—ఇది పైనఁజెప్పిన రీతిగాఁ గళింగమువలన వచ్చినసంజ్ఞ. ఈ

---

* "The first and second conjugations contain chiefly verbs that originate in Telugu-Many of these are likewise found in the Kannadi language which appears to be more ancient than Telugu" (Brown's grammar)

"దేశ్యము ఆంధ్రదేశవ్యవహార సిద్ధమైనది. ఇదిద్రావిడకర్ణాటక భాషలనుండి వికృత మయ్యె" (శేషగిరిశాస్త్రిగారి వ్యాకరణము)

పేరుమనభాషలోఁ గొంతభాగము కళింగభాషవలనఁ గలిగినదని బోధించుచున్నది. ఇఁక కళింగులకుఁ బ్రత్యేకభాషయున్నదా లేదా యుండిననాభాష యేదియనువిషయములఁ జర్చించుకొనవలసియున్నది. కాల్డువెల్ మొదలగు ఖండాంతరులు కళింగులకును దెలుఁగే స్వభాషయనియు వారికివేఱుగా మఱియొకభాష లేదనియు వ్రాసియున్నారు. ఈదినములలోఁ గళింగములోఁ జాలభాగ మాంధ్రులచే నాక్రమింపఁబడి యిప్పుడు తెలుఁగుభాషయే వాడఁబడుచున్నను మొదటినుండియుఁ గళింగులకు నాంధ్రమే దేశభాషయనుకొనుట తప్పుటూహగాఁ దోఁచుచున్నది. మనవారివ్రాతలను బట్టిచూడఁగాఁ గళింగులకు దేశభాష వేఱుగనున్నట్లు తోఁచుచున్నది. అలసానిపెద్దన * దగు నీక్రిందిచాటుపద్యమువలన నాంధ్రులభాష వేఱుగను గళింగులభాష వేఱుగను నప్పటికున్నట్లు తోఁచుచున్నది.

“శా. రాయగ్రామణి కృష్ణరాయ భవదుగ్రక్రూర ఖడ్గాహిచేఁ
గాయంబూడ్చి కళింగదేశనృపతుల్ “కానిర్ఘురీపోషణీ
మాయాభీకుము టూకులోటుకుహుటూ మాటూసటాజాహరే
మాయాగ్గేయమడే” యటంచ్రుదివరం భాజారునిర్ యత్నునిర్ ”

ఇందుఁ గళింగదేశప్రభువులు “కానిర్ఘురీపోషణీ” మున్నగు పదములఁ బలికినట్లు తెల్పఁబడియున్నది. వీరిభాషమన తెలుఁగేయైనచో వీరియనాంధ్రపదములఁ బలుకుటయెట్లు? కాఁబట్టి కళింగదేశస్థుల కేదోయొక దేశభాషావిశేషము కలదని దీనివలనఁ దెలియవచ్చుచున్నది. ఇఁకనీ “కానిర్ఘురీపోషణి” భాషావిశేషమేదో బాగుగాఁదెలియకున్నది. ఆరసిచూడఁగా కోదుభాషకును నీకళింగభాషకును సంబంధమున్నట్లు తోఁచుచున్నది. ఈకోదువాండ్రు తమభాషను “కొయింగ” యనియు “కుయింగ !’ యనియు వాడుచుందురఁట. ఈపదములు కులింగపదవికారములై యుండవచ్చునని కొందఱు బుద్ధిమంతులు తలఁచుచున్నారు. విశాఘపట్టణమండల చరిత్రమునందీ విషయమిట్లు వ్రాయఁబడియున్నది.

“The name “Khond” Macpherson derives from the Telugu word “Konda” a hill. The sole native appellation is “Koinga” or “Kuinga” which may be a corruption of “Kulinga” which by the interchange of convertible letters, may be “Pulinda” meaning in Sanscrit and thence in Tamil “a barbarian.”

* ఈపద్యమును ముక్కుతిమ్మనార్యుఁడు చెప్పినట్లుగాఁ గొందఱుతలఁచుచున్నారు. ఎవ్వరుచెప్పినదైనను కృష్ణదేవరాయని కాలమునఁ జేయఁబడినదై యున్నది.

పుళిందము, కుళింగమయినదనుట యంతగా సందర్భించి యుండలేదు. కళింగము నుండి యీకొయింగ, కుయింగలు, పుట్టినవనిన జాలసందర్భముకలదు కాఁబట్టి కోదు వాండ్రు తమభాషను నేటికిని కళింగభాషయని పిలుచుచున్నారని చెప్పవచ్చును. ఇప్పటి యీ కొయింగము (కళింగము) అనేక సాంకర్యములనంది తొల్లిటిదానివలె నుండకపో వచ్చును. గాని మొత్తముమీఁద కళింగదేశస్థులు వాఁడుకొనుభాషా విశేషమొకటి "కళింగ" నామకముకలదనియు నదియిప్పటి కోదుభాషకు సన్నిహితమనియు గ్రహింపవచ్చునని తోఁచుచున్నది. మఱియును మనవారు, అంగ, వంగ, కళింగాది చప్పన్నదేశములు కలవనియు భాషలును చప్పన్నములు కలవనియుఁ దలఁచుచున్నారు. ఇదియును కళింగమను భాషయొకటి యుండెడిదని చాటుచున్నది. కాఁబట్టి మనభాషలోఁ గొంతభాగమూ కళింగమువలనఁ గలిగినదని చెప్పవచ్చును.

**ఆంధ్రము** :—ఈ నామము మగధదేశ జాంధ్రులమూలముగాఁ గలిగినది. వీరిభాష ప్రాకృతము. అది మాగధిమున్నగునది యైయుండునుగాన మనభాష కొంతభాగము ప్రాకృతమువలనఁ గలిగినది. అందుమూలముచేతనే పెద్దలు మనభాషనుగూడ నొక ప్రాకృతభాషఁగాఁ బరిగణించియున్నారు దక్షిణదేశమునందు వ్యవహరింపఁబడు, ద్రావిడ, కర్ణాటక, మళయాళాంధ్రభాషలలో నొక్క యాంధ్రమే ప్రాకృతవిశేషముగా లాక్షణికులచేఁ బరిగణింపఁబడినది. ద్రావిడాదులకు లక్షణము వ్రాసిన వారలాభాషలఁ బ్రాకృతములనిగాని దానివలనఁ బుట్టినవనిగానిఁ చెప్పియుండలేదు.

"Thus two Telugu grammarians, not of the Aindra school, have treated the Telugu alphabet far more completely than was done by Aindra grammarians in respect of the Tamil, though the Telugu grammarians hold the strange theory that the Telugu language is a "Vikriti" of sanscrit, and treat the grammar as a mere appendix to Sancrit and Prakrit grammar"—A. C. Burnell.

అని బర్నెలుదొర వ్రాసియున్నాఁడు. మనవారందఱును నిట్లుతలఁచుటకుఁ గారణము మొదటియాంధ్రులు ప్రాకృతమును మాటలాడువారగుటచేతనే యైయుండును.

ఈవిధముగా మనభాష "ద్రావిడాంధ్ర కళింగ కర్ణాటకము" అయియున్నది గాని కేవలైకభాషగాలేదు. మనదేశము ద్రావిడాంధ్ర కళింగ కర్ణాటకమనియు నిందలి ప్రజలు ద్రావిడాంధ్ర కళింగ కర్ణాటకులనియు విదివఱకే వ్రాసియుంటినిగదా అట్టి దేశమునం దట్టిజనులభాషయును ద్రావిడాంధ్ర కళింగకర్ణాటక మగుటయొక యబ్బురమా?

ఈభాషకు స్వతంత్రనామమేదియును లేకపోవుటయు చుట్టుపట్టులంగల భాషలనామము లన్నియు దీనికుండుటయు విచారించిచూచిన నీభాష యొక్క సంకరభాషయనుట కంగీక రింపని వారుండరనితలంచెదను. ఈ మనభాష యుత్తరదేశభాషల సాంకర్యమును దక్షిణ దేశభాషల సాంకర్యమునుగూడఁ గలిగినమధ్యభాష యగుటచే నిదిసంస్కృతభవములగు నుత్తరభాషలవంటిదిగాక ద్రావిడభవములగు దక్షిణభాషల వంటిదియునుగాకనొకవై లక్షణ్యముగల నూతనభాషయైయున్నది. కుమారిలభట్టుదక్షిణ దేశభాషల ఆంధ్రద్రావిడభా ష యని వాడియున్నాఁడు దీనిచే మనభాష యుత్తరదేశపు ప్రాకృతములలోఁ జేర్పఁబడ లేదని తెలియవచ్చుటయ గాక ద్రావిడభాషలలోఁగూడఁ దీనిని జేర్చలేదనికూడ భావము తెలుచున్నది. అట్లుకానిచో ఆంధ్రద్రావిడ భాషయననేల? ఇప్పటిబుద్ధిమంతులు పిల చునట్లుగా ద్రావిడభాషయననఁ జాలదా? ఇంకను

"The Dravidian languages naturally separate into two classes the Telugu which stands by itself, and the Tamilic dialects which comprehend all the other languages of S. India."

అని బర్నెలుదొర దక్షిణదేశభాషలలో తెలుఁగునొక విధమైన దానినిగాను నితరము లన్నిటిని నొకవిధమగు ద్రావిడజములుగాను వ్రాసినాఁడు. కొందఱు ప్రాకృతముగా నెంచిరి. అదియునుదప్పే. మఱికొందఱు ద్రావిడముగా నెంచిరి. ఇదియునుదప్పే. ఏ మనిననిది ద్రావిడములలో ద్రావిడమును ప్రాకృతములలోఁ బ్రాకృతమును నైయున్నది కానికేవల ద్రావిడమునుగాదు, కేవలప్రాకృతమునుగాదు దీనియథాస్థితిని తెలిసికొ నఁదలఁచినవారు, అరవము, కన్నడము, మహారాష్ట్రాది ప్రాకృతములు, కోదుభాషలోన గునవియును సంస్కృతమును బాగుగాఁ జూడవలెను. ఇన్ని భాషలందుఁగల మృదుభా గములను మాత్రము స్వీకరించి పరుషభాగములను విడచిన నూతనభాషయగుట చేతనేయి ది యన్నిటినిమించిన మాధుర్యముకలిగి విరాజిల్లుచున్నది.

మనభాష యుభయమనుట కొకచిన్న యుదాహరణము నిచ్చెదను. సం ఖ్యావాచకములలో నేకత్వమును బోధించుశబ్దము ప్రాకృతములలో "ఏక" అనుశబ్ద మైయున్నది. ద్రావిడములలో "ఒందు" అయియున్నది ఇఁక తెలుగునందుననో ద్రావి డపదమగు ఒందునందలి "ఒ" ప్రాకృతపదమగు "ఏక" యందలి "క" యునుగలసి "ఒక" యనుపదము పుట్టినది ఈ (ఒక) ద్రావిడమును బ్రాకృతమును గూడనైయు న్నది. ఆదిద్రావిడమును నంతము ప్రాకృతమునునైయున్నది యీరీతిగాపట్టిక దీనియ థాస్థితిని బాగుగాఁ దెల్పగలదు.



ఈప్రక్క నున్న పట్టిక "ఒక" యను శబ్దముయొక్క వ్యుత్పత్తి "ఒందు" నందుండి పుట్టినది. "ఒండు" అనునదియును మనభాషలోఁ గలదు. ఆరసిచూడ నిట్టిచమత్కృతు లెన్నియేని గోచరములు కాఁగలవు.

మనభాష పైనఁజెప్పిన రీతిగాఁ బలుభాషలవలనఁ బుట్టిన దే యైనను దమపాలిచ్చి పెంచిన భాషావధూటు లెండ ఉన్నను కన్నతల్లి మాత్ర మరవ మని చెప్పవచ్చును.

అరవము దక్షిణదేశమందలి భాషలన్నిటిలోను మిక్కిలి పురాతనమును దక్కినవానికి మాతృత్వమును వహించినదియును నైయున్నది. మనభాషల నన్నిటినిఁ జవిచూచిన వారందఱును గూడ నిట్లే తలఁచుచున్నారు కాని కేవలమును అరవమే దక్షిణ దేశభాషల కన్నిటికినిఁ దల్లియని చెప్పుటకు వెలిచి మాతృత్వ సూచకములగు విశేషము లనేకము లరవమునందుఁ గలవనియు నిది చాలపురాతన మనియు నుడువుచును గూడ ద్రావిడ భాషల కన్నిటికినిఁ దల్లియైన తొల్లిటి భాషయొకటి నశించి యుండవచ్చునని తలంచుచున్నారు. ఈవిషయమై రివరెండు కాల్డువెల్ దొర వ్రాసినది చదువరుల విమర్శార్థమై యిందు క్రిందఁ బొందుపఱచుచున్నాఁడను.

High antiquity of the literary cultivation of Tamil.

The relatively high antiquity of the literary cultivation of Tamil being a matter of interest considered in itself, irrespective of its bearing on the question of Dravidian comparative grammar I shall here adduce a few of the evidence on which this conclusion rests.

(1) Classical Tamil which contains not only all the refinements which the Tamil has received, but also exhibits to some extent the primitive condition of the language, differs more from the colloquial Tamil than the classical dialect of any other Dravidian idiom differs from its ordinary dialect. It differs from colloquial Tamil so considerably that it might almost be considered as a distinct language: for not only is classical Tamil poetry as unintelligible to the unlearned Tamilian as the Æneid of Virgil to a modern Italian peasant, but even prose composition

written in the classical dialect might be read for hours in the hearing of a person acquainted only with the colloquial idiom, without his understanding a single sentence. Notwithstanding this classical Tamil contains less Sanskrit, not more than the colloquial dialect. It affects purism and national independence, and its refinements are all *ab intra*. As the words and forms of classical Tamil cannot have been invented all at once by the poets, but must have come into use slowly and gradually, the degree in which colloquial Tamil has diverged from the poetical dialect, notwithstanding the slowness with which language, like everything else, changes in the East, seems to me a proof of the high antiquity of the literary cultivation of Tamil.

(2) Another evidence consists in the extraordinary copiousness of the Tamil Vocabulary and the number and variety of the grammatical forms of Shen-Tamil. The Shen-Tamil grammar is a crowded museum of obsolete forms, cast off inflections, and curious anomalies. Many of these will be pointed out from time to time in a body of this work. I may here refer especially to the extreme and almost naked simplicity of some of the conjugational forms of the oldest Tamil, particularly to the existence of an uninflected form of the verb and of another form in which only the first rudimentary traces of inflection are seen. These particulars as will be shown in the Part "on the verb" seem to me to point to the arrest of the development of the Tamil verb at a very early period by the invention of writing, as in the still more remarkable instance of Chinese. The extraordinary copiousness of the Tamil vocabulary is shown by the fact that a school lexicon of the Tamil language published by the American Missionaries at Jaffna contains no less than 58500 words; notwithstanding which it would be necessary to add several thousands of technical terms besides provincialisms, and thousands upon thousands of authorized compounds in order to render the list complete. Nothing strikes a Tamil scholar more, on examining the dictionaries of the other Dravidian dialects, than the paucity of their lists of Synonyms in comparison with those of Tamil. The Tamil vocabulary contains not only those words which may be regarded as appropriate to the language, inasmuch as they are used by Tamil alone, but also those which may be considered as the property of Telugu, Canarese etc. Then, the word used for 'house' in ordinary Tamil is *vidu*; but the vocabulary contains also and occasionally uses, the word appropriate to Telugu, *il* (Tel. illu) and the distinctive Canarese word manei (Can. mana); besides other synonyms *kudi*, which it has in common with Sanskrit and the whole of the Finnish languages. The grammar and vocabulary of

Tamil are thus to a considerable extent the considerable repository of Dravidian forms and roots. We may conclude therefore that the literary cultivation of Tamil dates from a period prior to that of the other idioms and not long subsequent to the final breaking up of the language of the ancient Dravidians into dialects.

(3) Another evidence of the antiquity and purity of Tamil consists in the agreement of the ancient Canarese, the ancient Malayalam, the Tulu, and also the Tuda, Gond, and Ku, with Tamil, in many of the particulars in which modern Canarese and modern Telugu differ from it.

(4) The fact that in many instances the forms of Telugu roots and inflexions have evidently been softened down from the forms of Tamil, is a strong confirmation of the higher antiquity of the Tamilian forms.

కాల్డువెల్లు దొర చెప్పినట్లుగా "ఇల్లు" "కల్లు" మొదలగు సామాన్యవస్తువులఁ దెల్పు పదములుగూడ నరవమునందుండి పుట్టినవి. "ఈఁగ," "తేఁటి" మున్నగు సామాన్యజీవులను బోధించు పదములును నరవమునందుండి యుద్భవించినవి. సర్వనామము లరవమునందుండి కలిగినవి. విభక్తిప్రత్యయము లరవమునందుండి పొడమినవి. మిక్కిలి వాడుకలోనున్న క్రియలు కూడ నరవమునందుండి యేతెంచినవి. అరవభాషయును నరవదేశమును మిగుల పురాతనప్రసిద్ధి కలవి. ఆంధ్రభాషయును నాంధ్రదేశమును జాల నవీనప్రసిద్ధికలవి. ఇఁక నరవమునందుండి తెలుఁగు పుట్టిన దని చెప్పుకొనుటకు సందియ మేమున్నది, మఱి కొన్ని పదములు అరవముతో సంబంధించి యుండలేదనియా? ఈభాష పలుభాషలవలన నుండి పుట్టినదని యిదివఱకె తెలిసికొని యుంటిమికదా. కన్నడమున్నగు వానియందుఁ గూడ నరవమునందు లేని పదములు కాన్పించుచుండుటచే ననఁగా నరవమునకు నితరద్రావిడభాషలకును గొంచెము భేదము కొన్ని విషయములలోఁ గాన్పించుచుండుటచే నరవ మితరద్రావిడముల కన్నిటికినిఁ దల్లి కాఁజాలదని కొందఱు తలఁచుచున్నారు. ఇది యంతగా న్యాయముకాదు. కాల్డువెల్లు అరవమునందే పురాతనభాషకును నవీనభాషకును జాలవ్యత్యాసముకలదని నుడివి యున్నాఁడు.

"It (classical Tamil) differs from colloquial Tamil so considerably *that it might almost be considered as a distinct language.*"

అని వ్రాసియున్నాఁడు. ఒకభాషలోనే గ్రాంథికమును లౌకికమును నింతటి భేదము కలిగి రెండును వేఱువేఱు భాషలని తోఁపఁజేయునంతటి భేద

మును గలిగి యుండ నితరభాషలుగా విడిపోయినవి భేదమును గలిగియుండుట యబ్బురమా? ఏభాష తల్లియైయుండు నని విచారించుటలో దేశముయొక్కయు భాషయొక్కయుఁ బురాతనత్వమును గూడ విచారించుకొనవలయు నను విషయమును కాల్డువెల్లు మొదలగు వారుమఱచిపోయిరి. దక్షిణాపథములో దక్షిణపుఁగోననుండి ప్రజలు నిర్మానుష్యమై యుండిన యుత్తరదిగ్భాగమును గ్రమక్రమముగా నాక్రమించుకొనినట్లు తెలియవచ్చుచున్నదని యిదివఱకే వ్రాసియుంటిని. ఈదక్షిణపుఁగోనయందలి పూర్వ్వలభాష అరవము దీనినుండి మళయాము కన్నడము తెలుఁగు లోనగుభాషలు పుట్టినవి. ఈబాషలు పైకి వ్యాపించినకొలఁది మూలముకంటె భిన్నములుగాను గోమలములుగాను గాన్పింపఁజొచ్చినవి. అది సహజమే కదా. అరవభాషయును నాదేశమును బ్రాచీనములనియు నందుండి యితరద్రావిడభాషలు పుట్టినవనియుఁ దెలియఁజేయు విషయము నిఁక నొకదాని నిచ్చెదను.

ఉత్తరమునుండి సంస్కృతమును మాటలాడు నార్యులు దక్షిణమునకువెళ్లి యాదేశముల వెలయించి రనికదా యిప్పటివారు తలఁచుచున్నారు. దీనిని బట్టియే దక్షిణాపథముయొక్క దక్షిణపుఁగోనమాత్రమే మొదట వాసయోగ్యమును జనాకీర్ణము నై యుండెడి దనియు నాపై గోదావరివఱకును గల భూభాగమరణ్యమై యుండ దానిని దాక్షిణాత్యులు క్రమక్రమముగా నాక్రమించి రనియు గ్రహించుకొనవచ్చును. ఎట్లన:—సంస్కృతమునందుండి పుట్టిన తద్భవము లీయర్థమును బోధించుచున్నవి. ఆర్యులు దక్షిణమునకు వ్యాపించుటలో గోదావరీకృష్ణల. నడుమ దేశముండిన ముందు దానియందు నివసించి యాపై దక్షిణమునకు నేగియుందురు. అట్లు జరగినయెడల తెలుఁగునందలి సంస్కృతభవములు అరవమునందలి వానికన్నఁ బ్రాచీనములగుట కలుగును గాని యిట్టిస్థితి యీతద్భవములకుఁ గలుగలేదు. మళయాళము, కన్నడము, తెలుఁగు నాదిగాఁగల భాషలందలి తద్భవములకంటె నరవమునందలివి మిక్కిలి ప్రాచీనములై యున్నవి. ఈవిషయమై రెవరెండు కాల్డువెల్లుదొర యిట్లు వ్రాయుచున్నాఁడు.

"Another evidence of the antiquity consists in the great corruption of many of the Sanskrit tadbhavas or derivatives found in Tamil. The Sanskrit contained in Tamil may be divided into three parts of different dates.

* * * * * *

Nearly the whole of the Sanskrit derivatives found in Telugu, Canarese, and Malayalam belong to the periods now mentioned, or at least they accord on the whole with derivatives found in the Tamil of those two periods, especially the former or more recent. They are divided accordingly to the degree of permutation or corruption to which they have been

subjected, into the two classes of tat-sama the same with it—*i. e.* words which are identical with Sanskrit—and tadbhava of the same nature with it = derived from it *i. e.* words which are derived from a Sanskrit origin, but have been more or less corrupted or changed by local influences. The former class or tat-sama words, are scarcely at all altered and generally look like words which have been used only by Brahmans or which had been introduced into the vernaculars at a period when the sanskrit alphabetical and phonetic systems had become naturalized through the predominance of the later forms of Hinduism. Sanskrit derivatives of the second class which have been altered more considerably or tadbhava words do not appear to have been borrowed direct from Sanskrit, but are represented by Telugu and Canarese grammarians themselves as words that have been borrowed from the Prakrits, or colloquial dialects of the Sanskrit, spoken in ancient times in the contiguous Gaura provinces.

(3) In addition to the Sanskrit tat-sama and tadbhava derivatives of the two periods now mentioned—the modern Vedantic, Saiva and Vaishnava periods and the Jaina period—Tamil contains many derivatives belonging to the very earliest period of the literary culture of the language—derivatives which are probably of an earlier date than the introduction of Sanskrit into the other dialects. The derivatives of this class were not borrowed from the northern Prakrits (though much more corrupted than even the derivatives borrowed from those Prakrits by Canarese and Telugu) but appear to have been derived from oral intercourse with the first Brahmanical priests, scholars and astrologers and probably remained unwritten for a considerable time. The Sanskrit of this period is not only greatly more corrupted than that of the period of the Jainas but its corruptions are of a different character. The Jainas altered the sanskrit which they borrowed in order to bring it into accordance with Tamil euphonic rules; whereas in the Sanskrit of the period now under consideration—the earliest period—the changes that have been introduced seem to be in utter defiance of rule. The following are instances of derivatives of this class:—(*a*) The Sans: *Sri*, sacred, was altered into *tiru*, whilst a more recent alteration of the Sanskrit word is into *Siri Seri* and *Si*. (*b*) The Sans: *Kurman*, a work, is in the Tamil of the more modern periods altered into *Karuman* and *kanman*; but in the older Tamil it was corrupted into *Kam* (*c*) several of the names of Tamil months supply us with illustrations of early corruptions of Sanskrit. The Tamil months though now solar-sidereal are named from the old lunar asterisms, the names of which asterisms and still more the

names of the months borrowed from them are greatly corrupted. E. G., the asterism *Purvashadam* is changed into *Puradam*: *Ashadam* also is changed into *adam* from which is formed *adi*, the Tamil name of the month July-August. The name of the asterism *asvini* has been corrupted into *eippasi*, which is the Tamil name of the month October-November. The change of the *purvabhadra-pada*, the Sanskrit name of one of the asterisms, into *purattasi* is still more extra-ordinary. *purva-bhadra pada* was first changed into purattadi the name of the corresponding asterism in Tamil; and this again by the shortening of the first syllable and the change of *di* into *si* became *purattasi* the Tamil month September-October. The corresponding names of the asterisms and months in Telugu, Canarese &c. are pure, unchanged Sanskrit; and hence the greater antiquity of the introduction of those words iuto Tamil or at least the greater antiquity of their use in Tamil written compositions, may safely be concluded."

అని కాల్డువెల్లుదొర చెప్పినట్లుగా "తిరు" మున్నగునవి ప్రాచీనతద్భవములు. "సిరి" మున్నగునవి నవీనములు. తద్భవతత్త్వమును బాగుగా విచారించి చూడఁగా నార్యులకుఁ గర్ణాటకులు, ఆంధ్రులు మొదలగువారికంటె ముందుగా నరవలతో విశేషసంబంధ మున్నట్లు కాన్పించుచున్నది. అరవలకు, నార్యులకును నడుమ నున్న యాంధ్రాదులతో సంబంధము లేకయే ముందుగా నరవలతో నార్యులకు సంబంధ మెట్లువచ్చినది? అరవలకు నార్యులకు సంబంధము కలియునాఁటికి నారియుభయుల నడుమను నాంధ్రాదులు లేరు. ఈనడిమిప్రదేశము వట్టియరణ్యప్రదేశము. అందుమూలముచే నార్యులకు నరవలకుఁ బురాతనసంబంధ ముండుటయు నాంధ్రాదులకు లేకపోవుటయుఁ గలిగిన దని దీనిమూలముగా గ్రహింపవచ్చును.

మఱియును సంస్కృతపదములు కొన్ని ప్రాకృతములద్వారా ఆంధ్రాదులలోనికి వచ్చినట్లే మఱికొన్ని తద్భవములు అరవములోనికి ముందు వికృతులై వచ్చి యందుండి తెలుఁగు మున్నగు భాషలలోనికి దిగినవి. దేశములయొక్క వరుసనుబట్టి చూడఁగా నార్యులు, ఆంధ్రులు, ద్రావిడులు నై యుండఁగా నీయార్యులభాష నడుమనున్న యాంధ్రులనటుంచి ముందుగానరవములోనికి దిగి యందుండి యాంధ్రములోనికి వచ్చుట వింతకాదా? ఇది యరవమునుండి తెలుఁగు పుట్టినదని తెలియఁజేయుచున్నది. ఏకారణముచే మనవార లాంధ్రమునకుఁ బ్రాకృతమును బ్రకృతి యని యెంచిరో యాకారణము చేతనే యరవమును గూడ నగ్లెంచవలెను. మఱియు దేశ్యములుకూడ నరవపదముల వికారములై

యుండుటచేత నరవమునే యీవిషయమున నెక్కుడుగాఁ జూచుకొనవలయును. ఇంకను నరవలకు "తిగలార్" "తిగులార్" అను పేరుగలదు. వీనినుండి "తెలుఁగు" (తిగులార్) అను పదము పుట్టియుండు ననికూడఁ దోఁచుచున్నది. ఈవ్యుత్పత్తి త్రిలింగ త్రికళింగములయందుండి పుట్టిన దనుటకన్న సందర్భముగా నున్నదని తోఁచుచున్నది.

ఎట్లయిననేమి మనవారు మనభాషను "వికృతి" యని పిలుచుట బహుసమంజసముగానున్నది. ఇది యన్నివిధముల "వికృతి" యేయైయున్నది. ఇందలి పదములు, సంస్కృతము, ప్రాకృతము, అరవము, కర్ణాటకము మున్నగు భాషల తత్సమములును దద్భవములును నైయున్నవి. కాఁబట్టి యాంధ్రవాగ్వధూటి ద్రావిడకర్ణాటకముల పుత్రికగాని సోదరికాదు.

ఇఁక మనయాంధ్రకవితామతల్లికయొక్క జన్మమును గూర్చి ముచ్చటించుకొందము.

పైనఁ జెప్పినరీతిగా నిర్జనప్రదేశమగు నీనేలను నరవలు మొదలగువా రాక్రమించుకొని యిందు నివసించుటకుఁ బ్రారంభించిన తరువాతఁ గ్రమముగా నాంధ్రభాష పుట్టి పెరుఁగఁజొచ్చినది. మొదటి వేఁగినాటివార లరవమునే ముచ్చటించెడివా రని తోఁచెడిని. కుమారిలభట్టు ఆంధ్రద్రావిడమునకు నుదాహరణముగా నిచ్చినపదము లన్నియు నరవపదములే యై యున్నవి. ఈదేశముయొక్కయు నిందలి గ్రామములయొక్కయు నామములు చాలవఱకు నరవపదములై యున్నవి (వేఁగి, యోరుగల్లు మొదలగునవి) తొల్లి యీయాంధ్రులే యే దేశములందు వర్తకాదిసంబంధము చేసి వసించిరో యా యా దేశములందు నరవపదములు మాత్రమే నిలచియున్నవి గాని యిప్పటి మనతెలుఁగుమాట యొక్కటియును లేదు. కాఁబట్టి యీదేశమునందలి మొదటిభాష యరవమే యై యున్నదనఁదగును. అరవము స్వదేశమునందే తనలోఁ దాను గాలవశమున మారినట్లె యీప్రదేశమునందును స్వభావసిద్ధముగానె మార్పుచెందుచుండఁగా నింతలో నితరభాషల సాహచర్యమును విశేషముగా నంది ద్రావి, డాంధ్ర, కళింగ, కర్ణాటకముల వికారమై క్రొత్తవిలక్షణభాషగాఁ గొంతకాలమున కేర్పడినది.

## ఆంధ్రభాషయొక్క వయస్సు.

కాఁబట్టి తెలుఁగుపలుకు లించుమించుగాఁ గ్రీస్తుశకారంభమున జన్మించుటకు మొదలుపెట్టె నని తెలుపవచ్చును. కుమారిలభట్టు నాఁటికి (4వశతాబ్దమున)

అరవమును నాంధ్రమును విడఁదీయఁ దగు నంతటి మారుపు నీరెండుభాషలును నంది యుండలేదు. అందుమూలము చేతనే "ఆంధ్రద్రావిడ భాష" యని కుమారిల భట్టు వాడియున్నాఁడు. హుయ్యాన్ త్స్యాంగు అను చీనాయాత్రికుని నాఁటికి (7వ శతాబ్దమున) మనదేశమున నితరదేశభాషలకంటె భిన్నమగు భాషకలదు గాని యయ్యది సంస్కారశూన్యంబై యున్నది. అని అతనివ్రాఁతవలనఁ దెలియవచ్చుచున్నది.

ఇఁక శాసనము లేమిచెప్పుచున్నవో చూతము. ఈనూతనభాష పైప్రకారముగాఁ గ్రమక్రమముగా మాతృభాషల స్తన్యమును నైదవయేటనో యాఱవయేటనో (అనఁగాఁ గ్రీస్తుశక మయిదవశతాబ్దముననో యాఱవశతాబ్దముననో) విడిచి స్వతంత్రముగా సంచరించుట ప్రారంభించినను బదములబలము చాలక స్వేచ్ఛా సంచారము చేయఁజాలక పలుకులఁ దిన్నఁగ సర్వవిషయముల నుపయోగించు తెలివిచాలక కొంతకాలము సంస్కారశూన్యయై మెలంగుచున్నది. ఇయ్యది పదునొకండవశతాబ్దమువఱకును శాసించువారులేక కట్టునకు లోనుగాక తిరుగుచున్నది. ఇంతవఱకును బ్రజలు దీనిని తమతమ యభిప్రాయముల వెల్లడించుపనికి మాత్రము వినియోగించుచుండిరి కాని చదువను వ్రాయను నియోగించుటయేలేదు. అనఁగాఁ గోదుభాషాదులవలె సంస్కారశూన్యమై యున్న దని గ్రహింపవలెను. ఈ విషయమును శాసనములు రూఢిగాఁ దెల్పుచున్నవి. దక్షిణదేశమునందలి శాసనములను బాగుగాఁ బరిశీలించిచూచిన బర్నెలుదొర తన దక్షిణహిందూస్థాన ప్రాచీనలిపిశాస్త్రములో:—

"It is certain that the earliest literary culture in the Deccan was purely Sanscritic, and that compositions in the vernacular(except in Tamil) scarcely existed before the 10th century A. D,."

అనివ్రాసియున్నాఁడు. పదియవశతాబ్దములోఁ గన్నడము శాసింపఁబడినది. ఆశతాబ్దముననే శబ్దమణిదర్పణము వ్రాయఁబడినది. పదునొకండవశతాబ్దమున మన తెలుఁగు నన్నయభట్టారకునిచే శాసింపఁబడినది. ఇంతవఱకు దీనికి సంస్కారము లేదని బర్నెల్‌దొర యెట్లువ్రాసె ననఁగా శాసనములను బాగుగాఁ బరిశీలించి చూచిన దానికిఁ గారణము స్పష్టముకాఁగలదు. మనదక్షిణదేశమునఁ జిరకాలము నుండి శాసనములు కలవు కాని కర్ణాటకాంధ్రదేశములందుఁ గల వన్నియు సంస్కృతమున వ్రాయఁబడియున్నవి గాని దేశభాషలందు లేవు. ఈవిషయమున కాల్డువెల్లుదొర యిట్లువ్రాయుచున్నాఁడు:—

"In Karnataka and Telingana *every* inscription of an early date and the majority even of modern inscriptions are written in Sanscrit, even when the characters employed are those of the ancient Canarese or Telugu (characters which have been arranged to express the peculiar sounds of Sanscrit.)"

నన్నయభట్టారకునకుఁ బూర్వపుశాసనము లన్నియు సంస్కృతముననే యున్నవి కాని తెలుఁగుననొక్కటియును లేదు. అతనికిఁ దరువాత తెలుఁగు శాసనములు కలవు. దీనిచేఁ దెలుఁగు నన్నయభట్టారకుని కాలమువఱకును వ్రాయంబడు నవస్థవఱకే రాలేదని తెలియవచ్చుచున్నది. ప్రత్యేకముగాఁ దెలుఁగు దేశముననే వ్రాయఁబడు తెలుఁగులిపి యొకటి యున్నను దెలుఁగుభాషలో శాసనములు లేకపోవుటఁజూడ నీభాష యాకాలమున నింటికడ మాటలాడుకొనుటకు మాత్రమే వాడఁబడుచుండెడిది గాని తదితరవ్యవహారమునకు వాడఁబడుటయే లేదనియు నీభాష వ్రాఁతలోనె పెట్టఁబడెడిది కాదనియుఁ దోఁచుచున్నది. అరవములోఁ జిరకాలమునుండి గ్రంథరచనయును గలదు. ఆభాషయందు శాసనములును గలవు. అరవదేశమునందలి శాసనములను గూర్చి కాల్డువెల్లుదొరవారిట్లు వ్రాయుచున్నారు:—

"In the Tamil country, on the contrary, *all* inscriptions belonging to an early period are written in Tamil."

అరవదేశములో మొదటిశాసనము లన్నియు నరవభాషయందే యున్నవి. ఇటీవల వానిలోఁ గొన్ని సంస్కృతపువి కూడ నున్నవి. మనతెలుఁగునందన్ననో దానికి వ్యతిరేకముగా మొదటివన్నియు సంస్కృతమున నున్నవి. తరువాతవి కొన్ని తెలుఁగునం దున్నవి. కాఁబట్టి దీనిచే సంస్కృతము దక్షిణదేశమున వ్యాపించుటకుఁ బూర్వమే యరవభాష రచనాదికమును గలిగియున్న దనియుఁ దెలుఁగు సంస్కృతము బాగుగా దేశమున వ్యాపించిన తరువాత దానిప్రోత్సాహముచే రచనాదికముల నిటీవల నందినదనియుఁ దెలియవచ్చుచున్నది. మఱియును నరవలిపి సంస్కృతమును వ్రాయఁదగిన గుఱుతులను గలిగియుండలేదు. తెలుఁగన్ననో సంస్కృతము వ్రాయఁదగిన గుఱుతులనే యందియున్నది గాని స్వశబ్దముల నుచ్చరించు గుఱుతులనైన నందియుండలేదు. దంత్యములగు చజల వ్రాయుటకిటీవల ౘ ౙలగుఱుతులనుగా నేర్పరచుకొనవలసివచ్చినది. శకటరేఫమును దెలియఁజేయు "ఱ" అను గుఱుతు మనలో మొదటవాడుకలో లేదు.

తరువాత వచ్చినది. The Telugu and Canarese languages also required an additional sign for r, this is represented by ఱ or ఱ. The origin of this sign is not clearly ascertained; it occurs in early inscriptions in Canasese but later in Telugu" అని బర్నెల్లుదొరవారు వ్రాసియున్నారు. కావున కాల్డువెల్లుదొరవారు చెప్పినట్లుగా మన తెలుఁగక్షరములు మొదట సంస్కృతము వ్రాయఁబడుటకే కనిపెట్టఁబడి నన్నయభట్టారకునికాలము వఱకును నందులకే వినియోగింపఁబడినవి. తిక్కనసోమయాజినాఁటికి తెలుఁగుభాషయందు శాసనము లుండుటయు నన్నయభట్టారకునాఁటి కొక్కచిన్నశాసనమైన లేకుండుటయుఁ జూడ నన్నపార్యునినాఁడే తెలుఁగు వ్రాయఁబడుస్థితికి వచ్చిన దనియు నప్పుడే యీభాష శాసింపఁబడి-రచనకెక్కిన దనియుఁ దెలియవచ్చుచున్నది కాన బర్నెలుదొర వ్రాసినది న్యాయముగానేయున్నది. అంతకుఁ బూర్వము తెలుఁగు వ్యవహారయోగ్యత నంది రచనాదికమును గలిగియుండిన లిపికలిగియు నేల వ్రాయంబడకుండును ?

ఇట్లు బర్నెలులోనగు ఖండాంతరులు మాత్రమే వ్రాసిరాయనిన నొక్క ఖండాంతరులు మాత్రమే వ్రాసియుండలేదు. మనవారును నన్నయభట్టారకునకుఁ బూర్వము భాషాసంస్కారమును దగురచనయు లేవని పూర్వమే వ్రాసిరి. కవిత్రయములో నొక్కఁడగు నెఱ్ఱాప్రెగ్గడ తననృసింహపురాణమునందు :—

"ఉ. భాసురభారతార్థముల భంగులనిక్క మెఱుంగ నేరమిన్
గాసటబీసిచేచదివి గాథలఁద్రవ్వ తెనుంగువారికిన్
వ్యాసమునిప్రణీతపరమార్థము తెల్గుగఁ జేసినట్టి య
బ్జాసనకల్పులం దలఁతు నాద్యుల నన్నప తిక్కనార్యులన్.

అని నన్నయభట్టారకునకుఁ బూర్వ మీతెలుఁగు గాసటబీసటగా నుండెడి దనివెక్కిరించుచు వ్రాసినాఁడు. "గాసటబీసట" యనఁగా సంస్కారశూన్యమైన భాషయని(అనఁగాఁ గోదుభాషవంటిదని) మనవారు నిఘంటువులందు వ్రాసికొనియేయున్నారు. పైపద్యమునందు శంభుదాసుఁడు నన్నపతిక్కనార్యుల నాద్యులనియు నబ్జాసనకల్పులనియు వ్రాసియున్నాఁడు. అంతకుఁబూర్వపుఁ దెలుఁగును "గాసటబీసట" యనినాఁడు. ఇఁక దీనిభావమును బుద్ధిమంతులు బాగుగా నాలోచింతురుగాక.

మనవారివ్రాఁతలు నన్నయకుఁ బూర్వము తెలుఁగు గాసటబీసటగా నుండెడి దని చెప్పుచున్నవి. దీనిని శాసనములు రూఢిచేయుచున్నవి. పూర్వకాలమునం దీదేశమునకు వచ్చి చూచిపోయిన విదేశస్థులవ్రాఁతలును దదనుగుణముగా నున్నవి.

ఇంతియేగాక నన్నయభట్టారకునకు "శబ్దశాసన" బిరుద మొకటి యున్నట్లు భారతము సాక్ష్యమిచ్చుచున్నది. అదివఱకు భాష సంస్కారశూన్య మని తెల్పఁ దగినజాడ లనేకము లుండఁగా నేపురుషుఁడు దాని సంస్కరించినాఁ డని మనము చెప్పఁబోవుచున్నామో యామహాపురుషునకు "శబ్దశాసన" బిరుద ముండఁగా నతఁడే భాషను మొదట శాసించినవాఁ డని చెప్పుకొనుటకు సందియ మింతయు నుండ నవసరము లేదు. మఱియును నన్నయభట్టునాఁటికి భాష యెట్టిస్థితియం దున్నదో మనవ్యాకరణములును బోధింపఁగలవు. ప్రస్తుతము మనకు లభించిన వ్యాకరణములలో నిప్పటిబుద్ధిమంతులచే మొదటి దనియెన్నఁబడుచున్న యాంధ్రభాషాభూషణము మిక్కిలి చిన్నవ్యాకరణ మైయుండి యాంధ్రభాషా వధూటియొక్క బాల్యావస్థనే తెల్పుచున్నది. ఈచిన్నివ్యాకరణమును వ్రాసినందుకుఁ గేతన తన్నుఁగూర్చి:—

"క. భాషావేదులు నను విని, యాషణ్ముఖపాణినులకు నగు నీ డని సం
తోషింప నాంధ్రభాషా, భూషణ మనుశబ్దశాస్త్రముం గావింతున్."

అని పొగడుకొనియున్నాఁడు. ఇదియే మొదటివ్యాకరణము గాకుండిన నీచిన్నిపొత్తమును వ్రాసినందుల కింతగా వర్ణించుకొనుట యసంగతమగును. మఱియును నించుమించుగా నీకాలపువాఁడే యైనయథర్వణుఁడును దన్నునట్లే పొగడుకొనినాఁడు. మొదటిగ్రంథము లగుటచే వీరిట్లు పొగడుకొనుట కలిగినది. కావున నన్నయభట్టారకునాఁటికిఁ దెలుఁగువ్యాకరణ మేదియును లేదు. ఈవిషయమును నన్నయభట్టారకుఁడు భాషను మొదట శాసించె ననుట విరుద్ధము గాదని బోధించుచున్నది.

ఇంకను నీభాషాసంస్కారమునుగూర్చి లోకమున నొక్కకథ కలదు. అదియును బాగుగా నాలోచించిచూచిన నన్నయభట్టారకుఁడు రాజరాజనరేంద్రునిచేఁ బ్రేరేపింపఁబడి యీభాషాశాసనమును జేసినట్లు పొడకట్టుచున్నది. పూర్వకాలమునం దాంధ్రవిష్ణు వనెడు రాజొకఁ డుండెడివాఁ డనియు నతనికాలములో నీభాషాసంస్కారము చేయఁబడిన దనియు నొకప్రతీతికలదు. ఈవిష్ణు

వెవరో మాత్రము తెలియుటలేదు. కాఁబట్టి యిప్పటిబుద్ధిమంతు లీతఁడు కల్పితుఁడుగాని నిజమైనరాజు కాఁడని తలంచుచున్నారు. కాల్డువెల్లుదొరవారు వీని విషయములో:—

"Possibly, however, the Telugu king Andhra-Raja was merely a creation of the poets"

అని వ్రాసియున్నారు. ఈయాంధ్రవిష్ణ వను నాంధ్రరాయఁ డేశాసనము నందును లేఁడు. ఏచారిత్రమునందును లేఁడు. కాఁబట్టి దొరవారు చెప్పినట్లుగా నీతఁడు కవికల్పితుఁడే యని తెల్పుకొనవలసివచ్చుచున్నదికాని విషయమంతయుఁ గల్పిత మనరాదు.

భావకు గౌరవమును దెచ్చుటకై మనవారు పలువిషయములఁ గల్పించిన మాట సత్యమేకాని యాకల్పనము కొంచెము సత్యముతో సంబంధము కలదై యుండుటయును గలదు. ఒకనామముకలవానికి మఱికొన్ని గూఢసంజ్ఞల నిడుట గొప్పప్రజ్ఞ కలవానియందు దేవత్వ మారోపించుట మున్నగుపనులను జేయుచుందురు. ఈవిష్ణువునుగూర్చిన విషయములలోఁ బ్రధానములు రాజనరేంద్రుఁ దలఁపించుచున్నవి. అవియెట్లన:—

(1) ఈవిష్ణువు సుచంద్రునితనూభవుఁ డని వ్రాయఁబడియున్నది. ఇందలి "సు" అనునది చంద్రశబ్దమునకు ముందు శ్లోకగమనికకై చేర్చఁబడిన నిఁకఁ జంద్రతనూభవుఁ డని తేలుచున్నది. అనఁగాఁ జంద్రునిగోత్రాపత్య మని మనము గ్రహించుకొనవలెను. గోత్రాపత్యమును గవులు తనూభవులనుగా వర్ణించుట కలదు. రఘువంశములో నజమహారాజు రఘుమహారాజుయొక్క పుత్రుఁడని వ్రాయఁబడియున్నది కాని నిజముచే నాతని గోత్రాపత్యముగాని తనూభవుఁడు కాఁడు కాఁబట్టి యీవిష్ణువు చంద్రవంశమువాఁ డని తెల్పుకొనవలసియున్నది. కాన నిది రాజనరేంద్రునం దన్వయించుచున్నది.

(2) ఈతఁడు గోదావరీతీరమునకు వచ్చి నివసించినట్లు తెల్పఁబడినది. ఇదియును రాజనరేంద్రునే రూఢిగా సూచించుచున్నది. మనతొల్లింటిరాజులలో గోదావరీతీరమున, ననఁగా రాజమహేంద్రవరమున మొదట నివసించినరాజు రాజరాజనరేంద్రుఁడే. ఈతనికిఁ బూర్వులు (వారు చాళుక్యులుకానిండు, పల్లవులుకానిండు, గాంగాదులుకానిండు) గోదావరీతీరమున నెవరును నివసించియుండలేదు.

(3) ఈయాంధ్రనాథునకు విష్ణు వనిపేరుండుటకూడ రాజనరేంద్రునే బోధించుచున్నది. ఎట్లన, రాజనరేంద్రునకుఁ బూర్వము తెలుఁగుదేశ మరాజకమయినది. రాజు పాలించు నప్పుడైనను గాంగులు, కదంబులు, పల్లవులు, చోళులు మొదలగువారి బాధ విశేషముగాఁ గలిగి ప్రజలకుఁ జాలబాధ కలుగుచుండెడిది. అట్టియాపత్తులనుండి రక్షించి రాజనరేంద్రుఁడు 41 ఏండ్లు నిరాతంకముగా నేకచ్ఛత్రాధికారమును జేసినాఁడు. విష్ణుమూర్తివలెఁ బ్రజలను జక్కఁగాఁ బరిపాలించినాఁడు గాన నీతనికిఁ బ్రజలు నారాయణబిరుదము నిచ్చి నారాయణునిగా భావించుచుండెడివారు. ఈతనికి విష్ణుసంజ్ఞ కలదనియు నీతనిని బ్రజలు విష్ణువుఁగాఁ జూచెడివారనియు భారతమే బోధించుచున్నది. నన్నయభట్టారకుఁడు భారతమున నాశ్వాసాద్యంతపద్యములలో నీతనిని విష్ణువుగా నే చెప్పుచువచ్చినాఁడు. “శ్రీవనితావల్లభ వే, గీవిషయాధీశ,” “శ్రీలలనాస్తనఘటితవిశాలోరస్థల,” “శ్రీనాథమూర్తి,” “శ్రీదయితోరస్థల,” “శ్రీరమణీప్రియ” “శ్రీకీర్తిశ్రీవల్లభ” యని పలుతావుల నీరాజనరేంద్రుని సాక్షాద్విష్ణునిఁగా స్తోత్రము చేసినాఁడు. ఇయ్యది “నావిష్ణుఃపృథివీపతిః” అను న్యాయముచేఁ జేసినట్లుగాఁ గొందఱు తలంచుచున్నారు గాని యది న్యాయ మగుతలంపు కాదు. ఆన్యాయముచే వ్రాసిన నొకచోటవ్రాయును రెండుచోట్లవ్రాయును గాని యించుమించుగాఁ బ్రతిపద్యమునందును నట్లొనర్చియుండునా! మఱియును:—

వసంతతిలకము.

“వీరావతార సుకవిస్తుత నిత్యధర్మ, ప్రారంభ శిష్టపరిపాలనశక్తరాజా
నారాయణాఖ్య కరుణారసపూర్ణ వీర, శ్రీరమ్య రాజకులశేఖర విష్ణుమూర్తి”

అని వ్రాసియున్నాఁడు. ఇందు రాజనరేంద్రుఁడు “నారాయణాఖ్యుఁ” డనియు “విష్ణుమూర్తి” యనియుఁ దెల్పఁబడినది కాఁబట్టి రాజనరేంద్రునకు విష్ణునామము కలదనుట స్పష్టము.

రాజనరేంద్రు నిట్లు విష్ణువుఁగాఁ బావులూరిమల్లన్నయును స్తుతిచేసినాఁడు. ఈతనిపద్యమువలన రాజనరేంద్రునకు “ఆంధ్రరాయఁ” డను నామముకూడ నున్నట్లును స్ఫురించుచున్నది. అదియెద్దియన:—

“ఉ. శ్రీలల నేలుఁ డాంధ్రనృపశేఖరుఁడై చను రాజరాజభూ
పాలకు చేతఁ బీఠపురిపార్శ్వమునన్ నవఖండవాడయన్
ప్రోలువిభూతితోఁ బడసి భూరిజనస్తుతుఁడైన సత్కళా
శీలుఁడు రాజపూజితుఁడు శివ్వనపుత్రుఁడు మల్లనాఖ్యుఁడన్.”

శ్లో॥ పరిత్రాణాయసాధూనాం। వినాశాయచదుష్కృతాం । ధర్మసంస్థాపనార్థాయ । సంభవామియుగేయుగే॥ అను గీతావచనమునుబట్టి యన్నివిషయములందునుగూడఁ బ్రసిద్ధివహించిన రాజనరేంద్రుని ప్రజలు విష్ణుమూర్తియొక్క యవతారముగాఁ దలంచినారనుట కింతయు సందియములేదు గాన విష్ణు వనునది రాజనరేంద్రునం దన్వయించుచున్నది.

ఇఁక నిశంభుఁ డనురాజును జంపుట మున్నగువాని నెట్లన్వయించుకొనిను నన్వయించుకొనవచ్చును. రాజనరేంద్రుఁ డేదుర్మార్గులను ఖండించెనో వారినెల్ల రాక్షసులనుగా మనవారు వ్రాసియుందురు.

కావున నాంధ్రినాథునికథ రాజనరేంద్రునికాలమున భాషాసంస్కారము జరగినదని బోధించుచున్నది.

భాషాస్థితియు దీనినే బోధించుచున్నది కదా. ఇదిప్రత్యేకభాషగా మారుటకే క్రీస్తుశకమునఁ గొన్నిశతాబ్దములు పట్టినది. ఆపయిన నైనను సంస్కృతసహాయములేకుండఁ బూర్తిగా వ్యవహారోపయోగిని గానట్టిదైనది. అంతియగాక పలుభాషలనుండి పుట్టిన క్రొత్తసంకరభాష యగుటచే దీనియందు విజ్ఞులకు గౌరవబుద్ధియే కొంతకాలము పొడమినదికాదు. మనవారు బిరుదములు మొదలగు వానికై సంస్కృతమును అరవమును గన్నడమును వాడుటయే దీనియందుఁ బూర్వులకెట్టి తలం పుండెడిదో తెలియఁగలదు. ఇప్పుడు కోదుభాషను మనవా రెట్లుచూచుచున్నారో తొల్లి మనపూర్వులు తెలుఁగుభాష నట్లు చూచెడివారు. నీతిమతాచారాదివిషయములకై మనవా రిప్పటికిని దెలుఁగును వాడరు. మఱియును నప్పకవ్యాదులు :—

"క॥ క్షితి మ్లేచ్ఛభాష శ్రుతిగ, ర్హితమగు నట్లైన నీధరిత్రిని దానిన్
మతిరోసి విడువఁగూడదు, సతతము వ్యవహారహాని సంధిలుకతనన్॥"

మొదలగు రీతిగాఁ దెలుఁగునఁ గవిత్వమును జెప్పు విషయమున క్షమార్పణము చేసికొనుచున్నారు. అరవాదులవిషయమున నిట్టితలంపులేదు. అరవము సంస్కృతమువలెనే సర్వవిషయములఁ జిరకాలమునుండి గౌరవము నందుచున్నది. ఇందు వేదమునకుఁ బ్రతివేదము కలదు. నీతిమతాచారవిషయమున దీనిని గౌరవముగాఁజూచి దీనియందుఁ బూర్వులు గ్రంథములను వ్రాసి బోధించియున్నారు. కన్నడమును గర్ణాటకులును గౌరవముగాఁజూతురు. తెలుఁగున కట్టిగౌరవము లేదు.

ఇది యొకమనోహరత్వవిషయముననేగాక పలువిషయముల నిటాలియను భాషను బోలియున్నది. అదియును వికృతి యిదియును వికృతి. అదియు నించుమించుగా 12 వ శతాబ్దమువఱకును గౌరవింపఁబడక పడియున్నది యిదియు నట్లే పడియున్నది. (ఇటాలియన్ భాషవిషయములో:—It must be remembered that for a long time,—as late as the 12th century, in fact, Latin remained the language of literature, and Italian was considered as a mere jargon unfit to be written. When this prejudice was over come by Dante and others writing in the "lingua volgari," the words were, in many cases, written down as they were pronounced without any regard to their derivation. Much of the peculiarity of Italian spelling is due to this fact" అని జాన్ బీమ్సు దొరవారు వ్రాసిరి.) మనదేశమునందును గవిత్వాదులకును వ్రాఁతలకును సంస్కృతమే వాడఁబడుచుండెడిది. తెలుఁగును మ్లేచ్ఛభాషగాఁ దృణీకరించెడివారు. తెలుఁగునఁ గవిత్వమును జెప్పుట స్త్రీశూద్రులకొఱకని మనవారు వ్రాసిరి. ఇటాలియను భాషవలెనే యిదియును మొదటఁ దిరస్కరింపఁబడి నన్నయాదులు గ్రంథముల నిందు వ్రాసినతరువాత నిది లెక్కలోనికి వచ్చిన దగుటచేతనే నన్నయాదుల గ్రాంథికపువాడుకలను బట్టి మనవారు వ్యాకరణములను వ్రాసి శబ్దముల తత్త్వమునుబోధించుటలోఁ బెడత్రోవలఁబడిరి. దేశ్యములను వ్యుత్పత్తి లేని వానినిగా గ్రహించిరి.

ఇట్లు తిరస్కారము నందుచున్న భాషను సంస్కరించి యిందుగ్రంథములను వ్రాయుట యను పని నెవరు నెత్తిపైఁ బెట్టుకొందురు. అట్లు చేసిన వారిని మెచ్చువా రెవరు? ఇట్లు చూచువారు లేక దైవానుగ్రహము చేఁ దనంతఁ దానే పెరుఁగుచున్న యీయాంధ్రభాషావధూటిని గర్భద్వాదశవర్షాంచితయై యొప్పుచున్న దానిని రాజనరేంద్రుండు చూచి దిక్కులేని వారికి రాజే దిక్కు కావునఁ గనికరించి యామెను నన్నయభట్టారకునిచేతి కప్పగించె.

## ఆంధ్రకవితాసతిజననము.

చేపట్టినవాఁడు మిక్కిలి సమర్థుఁ డగుపండితకవి (సంస్కృతమున)గావునఁ జక్కఁగా శాసించుటచే దాన నాంధ్రకవితాసతి వొడమినది.

రాజులు పూనుకొనినంగాని యడుగంటియున్న భాషలు పైకి రాఁజాలవు కదా. తెలుఁగందఱిచేతను దృణీకరింపఁబడుచుండినను మహారాజవలంబించుటచే నది తత్క్షణమే మంచిస్థితిలోనికి వచ్చినది.

రాజనరేంద్రునకుఁ బూర్వ మీ దేశమును బరిపాలించిన నృపు లెవ్వరును నాంధ్రభాషను నాదరింపఁ దగిన స్థితి నందియే యుండలేదు. రాజనరేంద్రునకుఁ బూర్వపుకాల మంతయు బహుభంగసంగతము. నేఁడు వచ్చిన రాజు రే పుండుట లేదు. ఒకవైపుననుండి గాంగులు మఱియొక ప్రక్కనుండి కదంబులు నిఁకనొక చక్కనుండి చోడులు వేఱొకచాయనుండి కళింగులు వచ్చి యీదేశమును ముట్టడించుచుండెడివారు. ఆదినములలో నీదేశము వేఁడిమంగలమువలె నుండెడిది. ఇందలిప్రజ లీబాధను నందఁజాలక నలుదిక్కులకును జెదరి పోవుచుండిరి. ఇట్టి సమయంబున భాషాభివృద్ధియుఁ గవితాప్రచారమును నుండఁజాలవు కదా! రాజ రాజనరేంద్రునకుఁ బూర్వ మీదేశమున నందుమూలముచేత నే సంస్కృతమునఁ గూడ నంతగా గ్రంథములు పుట్టియుండలేదు ఇఁకఁ దెలుఁగుమాట చెప్ప నేల?

ఇఁక రాజనరేంద్రుని కాల మన్ననో యాతని మహాపరాక్రమమహిమచే మిక్కిలి సుఖప్రదముగా 41 ఏండ్లు సాగినది. ఈతఁడు మిక్కిలి పరాక్రమము కలవాఁడై చిల్లరరాజుల నడఁచి చుట్టుపట్టులం గల దేశముల నన్నిటినిఁ దన వశము చేసికొనినాఁడు. చోడులతో సంబంధము కలియుటచే వారు హితులయినారు. ఈతనితండ్రి యగు విమలాదిత్యుఁడు చోడదేశనృపాలుని కూఁతురగు కుందవాంబను వివాహమాడె. వారిరువురకును నీరాజనరేంద్రుఁడు కలిగినాఁడు. ఈతఁడును జోడదేశపురాజును దనమేనమామయును నగు రాజేంద్రచోళుని కూఁతురైన యమ్మంగదేవినిఁ బరిణయమాయె. కాన నీతని దీర్ఘపరిపాలనము నిష్కంటకముగా జరగినది. సరసుఁడును "కావ్యగీతిప్రియుఁడును" నగుటచే నాదినములలో కవులు గాయకులు పండితులు మొదలగువారి సద్గోష్ఠితోఁ గాలము చల్లఁగఁ బుచ్చుచుండెడివాఁడు. ఇట్టి మహాసరసుని మనోహరపరిపాలన సమయముననే యాంధ్రభాషయొక్క యదృష్టవశమున బహుభాషాపండితు లేకరంగమునకుఁ జేరుట తటస్థించినది. రాజనరేంద్రుఁడు చోళులకు మేనల్లుండును నల్లుండును నగుటచేతను నితరరాజ్యములను జయించిన వాఁ డగుటచేతను నీతని సభను నరవపండితులు కన్నడపండితులు మొదలగునారును నలంకరించుట తటస్థించినది. వారిమూలముగా నరవము మున్నగు దేశభాషలందు గ్రంథము లుండుట విశేషించి భారతాదులు భాషాంతరీకరింపఁబడి యుండుట తెలియవచ్చినది. * ఇతరదేశభాషలందు గల భారతముల వినుటచే రాజునకుఁ దనదేశభాషయందుఁ గూడ భారతము

* ఆంధ్రదేశము ప్రత్యేకరాష్ట్రముగా మాఱినతరువాత ననఁగాఁ జళుక్యాదు లీదేశము నాక్రమించిన తరువాత నరవముతో సంబంధము బొత్తిగాఁ బోయినది.

జేయింప నిచ్ఛ పుట్టినది. అప్పుడు పండితులకుఁ దగు ప్రోత్సాహము నిచ్చి యీ భాషను సంస్కరింపించి భారతమును భాషాంతరీకరింపించినాఁడు. తమపూర్వుల చరిత్ర మగు భారతమును బహుభాషలయం దుండునట్లు చేయుటయందలి యభిలాష మహారాజునకుఁ బూర్తిగాఁ గలుగుటచే సమర్థులగు పండితు లీచిన్నచూపు చూడంబడుచున్న తెలుఁగు పలుకులను సంస్కరించి మంచిస్థితిలోనికిఁ దెచ్చుట కలిగినది. ఈవిషయమును భారతమే సూచించుచున్నది.

"చ॥ విమలమతిన్ బురాణములు వింటి ననేకము లర్థధర్మశా
స్త్రములు తెఱం గెఱింగితి నుదాత్తరసాన్వితకావ్యనాటక
క్రమములు పెక్కు చూచితి జగత్పరిపూజ్యములైన యీశ్వరా
గమములయందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోన్"

వ. అయినను నాకు ననవరతంబును శ్రీమహాభారతంబునందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయై యుండు.

మ॥ ఇవి యేనున్ సతతంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండుఁ బా
యవు భూదేవకులాభితర్పణమహీయఃప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీపతిపదాబ్జధ్యానపూజామహో
త్సవమున్ సంతతదానశీలతయు శశ్వత్సాధుసాంగత్యమున్.

వ. మఱియు నదియునుంగాక.

చ॥ హిమకరుఁదొట్టి పూరుభరతేశకురుప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్తలనఁగా మహి నొప్పిన యస్మదీయవం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్."

అనుపద్యములు రాజనరేంద్రునకు భారతమునం దెంత యభిమానము కలదో బాగుగాఁ దెల్పఁగలవు. మఱియును.

"క॥ బహుభాషల బహువిధముల, బహుజనములవలన వినుచు భారతబద్ధ
స్పృహు లగువారికి నెప్పుడు, బహుయాగంబులఫలంబుఁ బరమార్థ మిలన్॥"

అను పద్య మీరాజనరేంద్రుఁడు బహుభాషల బహుజనములవలన భారతమును విని యింకను దాని సాధ్యమగునంతవఱకుఁ బల్వురచేఁ బలుభాషలందు వినఁగుతూహలము కలవాఁడై యుండి-

" జనస్తుత కృష్ణద్వైపా, యనముని వృషభాభిహితమహాభారతబ

ద్ధనిరూపితార్థమేర్పడఁ, దెనుఁగునరచియింపుమధికధీయుక్తిమెయిన్'' అని.

అధికమైన బుద్ధివిశేషముగల నన్నపార్యుని దెనుఁగునఁ గూడ భారతమును వ్రాయఁ బ్రోత్సాహము చేసె నని నన్నపార్యుని పీఠికవలనఁ గాన్పించుచున్నది. అరవభాషలో పేరునోయివారు చేసిన భారత మావఱకే యున్నది. ఇట్టివానిని వినుటచే రాజనరేంద్రునకుఁ దెనుఁగునఁ గూడ గ్రంథముల రచింపింపఁ గుతూహలము కలిగినది. తెలుఁగును దెలుఁగుగ్రంథములును రాజనరేంద్రునకు భాషాభివృద్ధి నొనరింపఁ బ్రోత్సాహమును గలిగించియుండలేదు. బహుభాషలందు భారత ముండుటయే యీతనిని దెలుఁగును బాగుచేయింపఁ బురికొల్పినది.

ఇట్లు మహారాజుచేఁ బ్రేరేపింపఁబడి యధికధీయుక్తుండును విద్వత్కవిశిరోమణియు నగునన్నపాచార్యుండు వాఙ్మయధురంధరుం డగునారాయణభట్టారకుని సహాయముతో నీయాంధ్రభాషను సంస్కరించి యిందు గ్రంథములను వ్రాసి వాగనుశాసనుండును నాదికవియు నై విరాజిల్లెను.

శాసనములలో నన్నయలిఖిత మని యొకశాసనము కలదు. అందు నారాయణభట్టు కర్ణాటకభాషయందుఁ బండితుఁ డని తెలుపఁబడియున్నది. కావున నీకన్నడపండితుని సహాయముచే శబ్దమణిదర్పణపద్ధతిని మనయాంధ్రమును భట్టారకులవారు శాసించిరి. ఇంతకుఁబూర్వ మీ భాష "త్రిలింగభాషాయాః కోధాతుః? కః ప్రత్యయః? కిం ప్రాతిపదికమ్?" అనిమనపూర్వు లధిక్షేపించి రనురీతిని బ్రకృతిప్రత్యయనిరూపణమైన లేక యనాగరికస్థితియం దుండెడిది. అట్టిదానింబట్టి ప్రకృతిప్రత్యయవిభాగము చేసి కొన్నిపద్ధతులును నేర్పాటుచేసి శబ్దశాసనుఁడు వాసిఁగాంచె. ఇప్పటినన్నయభట్టీయ మనునాంధ్రశబ్దచింతామణి నన్నయభట్టారక విరచితము కాకపోవచ్చును గాని యీతఁ డేవో కొన్ని నిబంధనముల నేర్పాటు చేసి యుండు ననుటకు మాత్రము సందియ మించుకయును లేదు. అయ్యది ప్రత్యేకపరిచ్ఛేదములు గల యొకవ్యాకరణముగా నుండకపోయినను బ్రకృతిప్రత్యయములను గూర్చిన నిబంధనమై యుండును. ఇట్టి కట్టుపాట్లనుబట్టియే కేతన తన వ్యాకరణమును వ్రాసియుండును. కావున నే:—

"క॥ మున్ను తెలుఁగునకు లక్షణ, మెన్నఁడు నెవ్వరును జెప్ప రేఁ జెప్పెద వి
ద్వన్నికరము మది మెచ్చఁగ, నన్నయభట్టాదికవిజనంబులకరుణన్॥"

అని నన్నయభట్టారకాదికవిజనులకరుణచేఁ దెలుఁగునకు లక్షణమును జెప్పెద నని తెల్పినాఁడు. ఇయ్యది లక్ష్యములను మాత్ర మొసంగుటచేఁ గలిగినది

కాదు. నన్నయభట్టారకుడును దరువాతివారును సువ్యక్తవిషయ మగువ్యాకరణమును దేనిని వ్రాయకపోయినను నాయావిషయములనుగూర్చి కొన్ని యేర్పాటులను జేయుచు రాగా వానినిబట్టి యాభారతాదిలక్ష్యములను బట్టియు నీవ్యాకరణమును వ్రాసియుండుటచే "నన్నయభట్టాదికవిజనంబులకరుణన్" అని కరుణపదమును బ్రయోగించి యుండు ననితోఁచుచున్నది.

మఱియును సమస్తకవులును నన్నయభట్టారకుని నాదికవినిగా స్తోత్రము చేసియున్నారు. లోకప్రతీతి వాగనుశాసనుండే యాంధ్రకవితాసతికి జనకుం డని పలుకుచున్నది.

నన్నయభట్టారకునిభారతము మొదట సంస్కృతశ్లోకమును గలిగియుండుట కవిస్తుతి యుండియుఁ దెలుఁగుకవులస్తుతివి గలిగియుండకుండుట లోనగునవియుఁ దెలుఁగుకవిత్వమునకు నిదియే ప్రారంభ మని తోఁపఁజేయుచున్నవి.

ఈవిధముగా దేశస్థితి, భాషాగతి, జనశ్రుతి, గ్రంథద్యుతి, కవిస్తుతి యన్నియును గూడ నేకగ్రీవముగా నన్నయభట్టారకుఁడే యాదికవియని ఘోషింపుచుండఁగా నిప్పటిబుద్ధిమంతులు కొందఱు కొన్ని వెడఁగుయుక్తులను గల్పించుకొని నిరాధారముగానే నన్నయభట్టారకుఁ డాదికవి గాఁడని చెప్ప సాహసించుచున్నారు. లోకము నిర్మలమగుసత్యమును నమ్మఁజాలదు. ఘోరమగు నబద్ధమును నమ్మజాలదు, గాని సత్యమువలెఁ గాన్పించు నబద్ధమువలనలో మాత్రము నిముషములోఁ బడిపోవును. తరిచిచూచినంగాని సత్యము తేలదు కాఁబట్టి యోపికతో విషయపరిశోధనమును జేసి సత్యమును దీయ లోకము పాటుపడదు. కేవలాసత్యము ప్రత్యక్షముగనే ఘోరముగాఁ గాన్పించుచుండును గాన దాని నంగీకరింపను నంగీకరింపదు. ఇఁకఁ జేయునది యేమనఁగాఁ బైకి సత్యముగాఁ దోఁచుదానిని స్వీకరించును. కాఁబట్టి మనవారు నన్నయభట్టారకుఁడు ఆదికవి కాఁడనుటకుఁ జెప్పు చూపు లసత్యములనే లోకము శిరసావహించుచున్నది. ఆయుక్తిరాజము లెవ్వియనిన:—

(1) నన్నయభట్టారకునకుఁ బూర్వమునఁ గవిభల్లటాదు లుండుట.

(2) నన్నపార్య నాదికవినిగా నిటీవలికవులు మాత్రమే స్తోత్రము చేయుట.

(3) అంతకుఁ బూర్వము కవిత్వమే లేకపోయిన నన్నయ యన్నికట్టుపాట్లతో నంతనిర్దుష్టముగాఁ గవిత్వమును జెప్పుటకుఁ జాలి యుండఁ డనుతలంపు.

(4) నన్నయకుఁ బూర్వపుగ్రంథములు రాష్ట్రమంతయుఁ దగులుపడిపోవుటచే నందు నవియుఁ దగులుపడిపోవుట.

ఈకారణములచే నన్నయ యాదికవి కాఁజాలఁ డనికవులచరిత్రములో రావుబహదర్ వీరేశలింగము పంతులవారు వ్రాసిరి. ఈయుక్తులను జూచి జనులు మేలనుచున్నారు కాఁబట్టి వీనిని గ్రమముగా విమర్శింతము.

(1) మనవారు నన్నయభట్టారకునకుఁ బూర్వమున, భాస్కర, రంగనాథ భీమనాథర్వణులను గవిభల్లటుని బెట్టుచున్నారు. వీరిలో మొదటినల్వురు నెప్పటివారో మన మీగ్రంథమునందును భాస్కరోదంతమునందును నిర్ధారణము చేసియే యున్నారము వారు నన్నయకుఁ దరువాతివారు గాని పూర్వులు కారు. మొదట నెట్లువ్రాసినను దరువాత వీరు నల్వురను గూడ నన్నయభట్టారకునకుఁ దరువాతివారనియే కవులచరిత్రయు నంగీకరించినది. ఇఁకఁ గవిభల్లటుఁడు మిగిలియున్నాఁడు. భట్టభల్లటునిశ్లోక మొకటి క్షేమేంద్రునిచే నుదాహరింపఁబడినది కాఁబట్టి యీ భల్లటకవి నన్నయభట్టారకునకుఁ బూర్వపువాఁ డయినను గావచ్చును గాని యీతఁ డొకసంస్కృతకవి గాని తెలుఁగుకవి యెంతమాత్రమును గాఁడు. ఈతని వాసస్థలము కాశ్మీరదేశము, జయ్యట, కయ్యట లొల్లట మమ్మట భల్లటాదు లందఱును గాశ్మీరదేశస్థులు. తుదినల్వురును జయ్యటునిపుత్రు లనియు నల్వురును నాలుగుశాస్త్రములందుఁ బ్రవీణు లనియు నొకకథ కలదు. ఈభల్లటభట్టుచే విరచింపఁబడిన శతక మొకటి కాశ్మీరదేశమున సుప్రసిద్ధమై యున్నది. దానికిఁ గవిభల్లటీయ మనిపేరు. ఆశతకము నీనడుమ ముంబాపురంబునఁ గావ్యమాలవా రచ్చొత్తించిరి. అందీకవిచరిత్రమును వారు వ్రాసియున్నారు. ఈతనియునికిపట్టునుగూర్చి చెప్పుటలో "కాశ్మీరక ఏవ" అనివ్రాసిరి. ఎచటనో హిందూదేశముయొక్క తుది నున్నకాశ్మీరదేశస్థుఁ డగుకవిభల్లటుఁడు తెలుఁగునకు లక్షణమును జెప్పి కవిత్వము చెప్పెననుటకన్న వింత కలదా! తెలుఁగుదేశముయొక్క మధ్య పుట్టి పెరిఁగి తెలుఁగే దేశభాషగాఁ గల నన్నయభట్టారకుఁడే తెలుఁగునకు మొదటికవి యనిన నది సందర్భముగ నుండ దనితలంచు నీబుద్ధిమంతులు తెలుఁగెట్టిదో యెన్నఁడును గని విని యైన నుండుట కింతయు నవకాశము లేని కాశ్మీరదేశ మందలివాఁ డయినకవిభల్లటుఁడు తెలుఁగునఁ గవిత్వమును జెప్పి యాదికవియై లేక యాదికవులలోనివాఁ డైయొప్పెనని యెట్లు తలంచిరో! ఇది యసంగతము. భల్లటభట్టు తెలుఁగునఁ గవిత్వమును జెప్పియుండలేదు దీనికి లక్షణమును జెప్పియుండలేదు. అప్పకవివ్రాఁతనుబట్టి చూడఁగా నాతఁడు ప్రాకృతమునకు లక్షణమును జెప్పినట్లు తోఁచుచున్నది. కావ్యమాలవా రీతనిఁగూర్చి వ్రాయు

టలోఁ దెలుఁగునకు లక్షణమును వ్రాసె ననికాని కవిత్వమును జెప్పె ననికాని ప్రాకృతలక్షణము చెప్పె ననికాని వ్రాయలేదు గాని యప్పకవివ్రాఁతనుబట్టి మాత్ర మీతఁడు ప్రాకృతమునకు లక్షణమును జెప్పినట్లుఁ గాన్పించుచున్నది. దానికే "కవిభల్లటఫక్కి" యనిపేరు. ఈతఁడు ప్రాకృతమునకు లక్షణము చెప్పె ననిన సందర్భహానియును లేదు. ఈతనిఫక్కిక ప్రాకృతమునకా దెనుఁగునకా యనినఁ బ్రాకృతమునకే యని యప్పకవి వ్రాఁత చెప్పుచున్నది. ఎట్లన:—అప్ప కవి తెలుఁగు, సంస్కృతప్రాకృతదేశ్యములనుండి పుట్టిన దని తలంచుచుండు వాఁడు మూఁడుభాషలలోని గ్రంథములను గూడ నిచ్చుచు ప్రతాపరుద్రీయము, కువలయానందంబును, రసమంజరియును, సాహిత్యచంద్రోదయంబును, సాహిత్య రత్నాకరంబును, వృత్తాంతరత్నాకరంబును, జమత్కారచంద్రికయును (ఇవి సంస్కృతమును గూర్చి) షడ్భాషాచంద్రికయును, షడ్భాషావివరణంబును, త్రివి క్రమవృత్తియు, హేమచంద్రఫక్కికయును, కవిభల్లటఫక్కికయును, నధోక్షజ ఫక్కికయును (ఇవి ప్రాకృతమునకు) శబ్దానుశాసనీయంబును, కవిరాక్షసీయం బును,......నరసభూపాలీయంబును (ఇవి తెలుఁగునకు) అని వరుసనిచ్చియు న్నాఁడు. ఈవరుసలో కవిభల్లటఫక్కిక ప్రాకృతలక్షణగ్రంథముల మధ్య నిడఁబడియున్నది. కాఁబట్టి యిదియును బ్రాకృతలక్షణగ్రంథమే యనిగ్రహింప నగును. మనవారు తెలుఁగు నొకప్రాకృతభేదముగా గ్రహించియుండుటచేతఁ బ్రాకృతలక్షణకర్తలగ్రంథములను గూడ దీనికిఁ బ్రమాణముగాఁ దీసికొనియు న్నారు. ప్రాకృతలక్షణమును దీనికిని బట్టించుచువచ్చిరి. అప్పకవి అయిదవ యాశ్వాసములో నాంధ్రశబ్దచింతామణిస్థసంధిసూత్రముల వివరించి యాపై:—

తే.గీ. హేమచంద్రత్రివిక్రమనాములాదిఁ, బ్రాకృతముత్రోవఁజూపిరాప్రాకృతంబు
నందుభేదంబుగావునాంధ్రమునకుఁ, గలుగులక్షణమెల్లఁగఁగవలయుఁగవులు.

అని త్రివిక్రముఁడు ప్రాకృతమునకు లక్షమును జెప్పె ననివ్రాసినాఁడు గాని తెలుఁగునకు లక్షణమును జెప్పెనని తెలుపలేదు. కానఁ ద్రివిక్రముఁడు ప్రాకృతమునకు మాత్రమే లక్షణమును జెప్పె ననిగ్రహించుకొనవలయును. ఇట్టి త్రివిక్రమునిమతమును తనతెలుఁగులక్షణగ్రంథమున గ్రహించి "త్రివిక్రమమత సంధులు" అనుశీర్షికతో "తేసా మితశ్చ తద్వత్త్రివిక్రమమతేన" అనుసూత్రము నిచ్చియున్నాఁడు. ఈత్రివిక్రమమతము తెలుఁగులక్షణమును గూర్చినదా? కాదు. తెలుఁగులక్షణమును గూర్చిన దైనయెడల హేమచంద్రత్రివిక్రనాములు

ప్రాకృతముత్రోవఁ జూపిరి. ఆప్రాకృతములలోఁ దెనుఁగును నొక్కటియగును గాన దీనిలక్షణమును గవులు తెలిసికొనవలయు నని యుప్పకవి యేల వ్రాయును? త్రివిక్రముఁడు తెలుఁగులక్షణమును జెప్పె ననియే వ్రాసియుండును. అట్లనే కవి భల్లటమతసంధు లని "కవిభల్లటైఃక్రియాణాం నామ్నాంచోల్లోపఇష్యతేప్యేషు" అనుచింతామణిసూత్రము నిచ్చి కవిభల్లట ఫక్కికమాటను దలఁపెట్టినాఁడు. కానఁద్రివిక్రమగ్రంథమువలెనే యిదియును బ్రాకృతలక్షణ గ్రంథమనియు దాని నిబట్టి యీవిషయమునఁ దెలుఁగులక్షణమును వీరు చేసికొనిరనియు మనము గ్రహించుకొనవలెను. లేకున్నఁ గవిభల్లఁటుఁడెక్కడ! తెలుఁగెక్కడ!

కావునన న్నయభట్టారకునకుఁ బూర్వమునందు నాంధ్రకవులుగాని లాక్షణికులుగాని యెవరును లేరు. ఉండిననన్నయభట్టారకునకు శబ్దశాసనబిరుదమును నాదికవియను ఖ్యాతియును రాకయేయుండును. కవిచరిత్రాదులం దక్కడక్కడ వీరేశలింగము పంతులుగారు మొదలగువారు నన్నయభట్టారకునకుఁ బూర్వమున గ్రంథములు కాన్పించుట లేదనియే వ్రాసియున్నారు.

(4) మఱియును నట్టిగ్రంథము లేయున్న యెడల నవియుండియే యుండును. అట్లు లేవు కావున నన్నయభట్టారకుఁడే యాదికవియని గ్రహించుకొనవలయును. కాని యట్టిగ్రంథము లేవియును లేకపోవుటకుఁ బంతులవారొక యుక్తిరాజమును దెల్పుచున్నారు. అదియేదియన "నాంధ్రదేశమంతయు నొకసారి పరరాష్ట్రాధిపతుల చేత దగ్ధము చేయఁబడినట్లును, నందుచేతనే యీదేశమునకు దగ్ధరాష్ట్రమనియు వేఁగిదేశమనియు నామములు కలిగినట్లును, జెప్పఁబడియున్నది. ఆమహాదహనసమయమునందదివఱకున్న పుస్తకములన్నియు తగులఁబడిపోయి యుండవచ్చును" అనినిపుణముగా విలిఖించిరి. ఈవ్రాఁతకాధార మేగ్రంథమందుఁగాని యేశాసనమందుఁగాని సూచనామాత్రముగానైనఁ గాన్పింపదు. ఒక్కఁడిది బ్రహ్మాండపురాణమునందున్నదని యతిసాహసముగానుడివెనుగాని దానిని బంతులవారైన నంగీకరించియుండ లేదు. ఇఁక దీని కాధారమేమనఁగా "నోభయందగ్ధరాష్ట్రజాః" అను వెఱ్ఱిమొఱ్ఱిశ్లోకము. ఇది యిటీవల బ్రాహ్మణులు తమతమ తెగలనుగూర్చి వ్రాసికొనినశ్లోకము. ఇందు వేఁగినాటివారు దగ్ధరాష్ట్రులని వ్రాయఁబడిరి దీనికిఁ గారణమేమనఁగా వేఁగుటయనఁగా దగ్ధమగుటయని యర్థమును జేసికొని, (కాకినాడనువాయసపురమనియుఁ, బెద్దాపురమును జ్యేష్ఠపురమనియుననినట్లె) దగ్ధరాష్ట్రులు అనుసంజ్ఞ వాడఁబడినది కాఁబట్టి మనవారుచెప్పినకథ వట్టిమృషయైయున్నది. అయి

నను వాదముకొఱకుఁ గొంతసేపు వీరు చెప్పినట్లుగా నీరాష్ట్రము తగులఁబడి పోయినదనియు నందుమూలముచే దీనికి దగ్ధరాష్ట్రమనియు వేఁగి దేశమనియు నామములు వచ్చినవనియు నామహాదహనసమయంబునఁ బూర్వపు గ్రంథములన్నియుఁ గాలిపోయినవనియు నంగీకరింతము. అట్లయ్యును మనవారివాదమునకింతయును లాభములేదు. ఏమన నీమహాదహనము నన్నయభట్టారకునకుఁ బూర్వమునజరగినదా? పరమునజరగినదా? పూర్వముననే జరగియున్న యెడల నన్నయభట్టారకుని నాఁటికే యాగ్రంథములు లేవు గావుననన్నపార్యుఁడువాని సహాయము నందియేయుండలేదు కాన నూతనసృష్టి నేచేసియున్నాఁడని చెప్పవలెను. పరమందు జరగియుండెనా? అట్లన నామహాదహనసమయంబున నన్నయగ్రంథములు వానితోడిపాటే యందియుండును. నన్నయవిమాత్రము మిగిలి తక్కినవన్నియు భస్మమగుట యెట్లుకలుగును! అగ్నిహోత్రునకు నన్నయభట్టారకుఁడులంచమిచ్చితనగ్రంథముల నిలుపుకొనెనందురా! అట్లుకాదు నన్నయవాని నన్నిటినిజదువుకొనితాను గ్రంథములను జేయఁబోవుచుండఁగా నీనడుమనీమహాదహనము తటస్థించియుండును. అట్లయిన నన్నయగ్రంథములు మిగులుటయుఁదక్కినవి పోవుటయు సంభవింపఁగలదు. ఒకవేళనన్నయభట్టారకుఁడేతనకాదికవియను ప్రసిద్ధివచ్చుటకై గ్రంథములనన్నిటిని బాగుగాఁ జదువుకొని యాపైరాష్ట్రమునంతను బరశురామప్రీతి కావించియాపై గ్రంథములను వ్రాసియుండెనేమో. లేక యధర్వణుని యిల్లుకాల్పించినప్పుడా పట్టుపట్టురాష్ట్రమంతయు దగ్ధమైపోయినదో. ఏదోయిట్టివిచిత్రముజరగినంగాని యీతనిగ్రంథములు మిగిలి యితరగ్రంథములు నుసియగుటతటస్థముకాఁజాలదు. బుద్ధిసంపన్నులారా! యీ దేశముదగ్ధమైనదనినంతన లాభముండునా? యదియెప్పుడు జరగినదో చూచుకొననక్కఱలేదా? ఈదేశముదగ్ధమెప్పుడైయుండునో ముందువిచారింతము. ఈరాష్ట్రముదగ్ధమగుటచేతను గదా దీనికి దగ్ధరాష్ట్రమనియు వేఁగిదేశమనియు నామములు వచ్చినవని చెప్పుచున్నారు. మంచిది, యిఁకనీదేశమెప్పుడు తగులఁబడిపోయినదోకనుగొందము. దగ్ధరాష్ట్రమను పేరెచటను వాడుకలోలేదు గానివేఁగియను పేరు పలుశాసనములందుఁగలదు. క్రీస్తుశకము మూఁడవలేక నాల్గవశతాబ్దమందలిశాసనములందుఁ గూడ వేఁగియను సంజ్ఞ కాన్పించుచున్నది. అంతకుఁబూర్వమేయీమహాదహనముజరగియుండవలెను కాఁబట్టి తుదకు రెండవ శతాబ్దముననో మూఁడవ శతాబ్దముననో మనవారు చెప్పిన మహాదహనము జరగియుండవలెను. కాఁబట్టి

యీ గ్రంథములన్నియు నన్నయభట్టారకునకు నేడెనిమిదిశతాబ్దములు పూర్వమె కాలిపోయినవి. ఇఁక నేడెనిమిదిశతాబ్దములు గడచిన తరువాతఁబుట్టిన నన్నయభట్టారకుఁడు తెలుఁగుకవిత్వము చెప్పెననిన నప్పటిగ్రంథసహాయము కలిగియుండు నను బుద్ధిమంతులుకూడ నుందురా! లేక యీనడుమ నేమయినగ్రంథములు పుట్టినవా? పుట్టిన నవి యేమైనవి? ఇంతయేల మనవారు బాగుగా నాలోచింపక యీ తప్పువ్రాఁతను వ్రాసిరి. వారివ్రాఁతయంతయును నసంగతము. ఒకరాలోచించియో యాలోచింపకయో దగ్ధరాష్ట్రమను పేరున్నదిగాన రాష్ట్రమంతయు కాలిపోవుటచే నీపేరువచ్చినదని వ్రాసియుండఁగా దాని బలపఱచుటకై మఱియొకరది బ్రహ్మాండపురాణమున నున్నదనఁజొచ్చిరికాని యెద్దీనినదనిన దూడనుగట్టివేయుమనుచున్నామని గ్రహింపలేకపోయిరి. లోక మిట్లంధపరంపరఁగాఁ బోవుచున్నది. ఇఁక మనవారు వ్రాసినది తప్పనినమ్ముట కింతయు సందియములేదుగదా. వేఁగియనఁగా నేమో నే నిదివఱకె వ్రాసియున్నాఁడను కాననీశ్లోకమబద్ధము. రాష్ట్రముకాలిపోవుట కల్ల. గ్రంథము లందునాశనమగుట మృష.

ఇఁక గ్రంథములుగాని వాని నామములుగాని కవులనామములుగాని లేకపోవుటకుఁ గారణమేమి? మఱి యేకారణమును లేదు. అభావమే కారణము. ఉన్న నన్నయభట్టారకుఁడు పేర్కొనియేయుండును. కాఁబట్టి వాగనుశాసనునకుఁ బూర్వమందైన యీకవితాభావము ప్రాగభావమేగాని ప్రధ్వంసాభావముకాదు.

(2) ఇఁక నన్నయభట్టారకు నాదికవినిగా నిటీవలివారుమాత్రమె స్తోత్రము చేసిరికాని పూర్వకవు లెవరును నట్లు స్తుతింపలేదని ప్రతిపక్షులు వ్రాసినయంశమునుగూర్చి చర్చించుకొందము. నన్నపార్యు నాదికవినిగా నిటీవలివారుమాత్రమే స్తుతించిరని రావుబహాద్దర్ వీరేశలింగము పంతులవారు వ్రాసిరిగాని యది న్యాయమగు వ్రాఁతకాదు. ఏమన నీవఱకును మనకుఁ దెలిసియున్న కవివరులలో నన్నయభట్టారకుని తరువాతి మొదటికవిగా నెన్నఁదగిన తిక్కన సోమయాజి నాఁటినుండియునుగూడ నీస్తోత్రము గానవచ్చుచున్నదిగాని యిటీవలికవులనుండిమాత్రమే వచ్చియుండలేదు. నన్నయభట్టారకునకును దిక్కన సోమయాజికిని నడుమ నొక పెద్దగర్తముమాత్ర మున్నదేగాని యెన్నఁదగిన కవి యెవఁడును లేడు. పావులూరి మల్లన్న యొకఁడు గలఁడుగాని యాతఁ డొకచిన్నగణితమును బద్యమయముగా నొనర్చెనేగాని మంచికావ్యమును దేనిని విరచించియుండలేదు కాన నన్నయభట్టు తరువాత తిక్కన్న కాలముననే మరలఁ గవితాసతి యుజ్జీవింపఁజేయఁబడిన

దని యెన్నఁదగియున్నది. ఇంచుమించుగా నీతిక్కన్న కాలమునందుఁ బల్వురు కవులు బయలువెడలిరి. కాఁబట్టి తిక్కన్న నాఁటినుండియు నన్నయయాదికవిగా స్తుతింపఁబడినాఁడనిన నాదినుండియు నిట్టి స్తుతికిఁ బాత్రుఁడైయుండెనని నిరాతంకముగాఁ జెప్పుకొనవచ్చును. ఇఁక నాస్తోత్రపాఠములేవో వానిని వివరింతము. తిక్కన సోమయాజి తన మొదటిగ్రంథమగు నిర్వచనోత్తరరామాయణములో:—

చ. హరిహరపద్మగర్భులను నాదికవీంద్రులనూత్నసత్కవీ
శ్వరులనుభక్తిఁగొల్చిమతివారికృపన్ గవితావిలాసవి
స్తరమహనీయుఁడైననను సర్వగుణోత్తరమూర్తిమన్మభూ
వరుఁడుశగంగరాఁబనిచివారనిమన్ననసాదరించుచున్''

అని కవిస్తుతియొనరించియున్నాఁడు. ఈపద్యమునందు నాదికవులను నూత్నకవులనుగూడ స్తుతించియుండుటచే నన్నయభట్టారకుని నాదికవినిఁగా నెన్నినట్లుమనము గ్రహించుకొనవలసియున్నది. ఈపద్యము నే యాధారముగాఁగొని రావుబహద్దర్ వీరేశలింగముపంతులవారు నన్నయను నూత్నకవులలోఁ బంతించినట్లుగా, వ్రాసిరికాని యది యనుచితమును నాధారశూన్యమును నైయున్నది. ఏమన నీపద్యమునఁ దిక్కకవినన్నయోపాధ్యాయుని పేరెత్తియుండలేదు. అట్టిచో నన్నయను నూత్నకవులలో వీరెట్లుచేర్చిరో తెలియకున్నది. నీవు పూర్వకవులలోఁజేర్చినట్లుగామాత్ర మెట్లుచెప్పఁగలవందురేనిఁ బల్వురు నన్నయభట్టారకుని నాదికవినిగాస్తుతించియుండిరి గావున నీపద్యమునందును నాదికవియనిన నావాడుకనుబట్టి నన్నయయనియే భావించెదమనుటయుక్తిసహమేకదా. వీరాదికవులు వీరునూత్నకవులునని చెప్పక యాదికవులు నూత్నకవులునని మాత్రముచెప్పి యూరకుండినప్పుడాదికవియను వాడుక యెవరికిఁగలదో వారాదికవులనియు నూత్నకవులని వాడుక యెవరికిఁగలదో వారు నూత్నకవులనియుఁ దలఁచుట యుచితముగావునను నన్నయభట్టునకు నాదికవియను వాడుకకలదు గావునను దిక్కన్ననన్నయను నాదికవులలోఁ జేర్చెననుటయే న్యాయముగాని పంతులవారి వ్రాతఁకేమి యాధారమున్నది? ఏదియునులేదుగాని వారొకకారణాభాసమును మాత్రము చూపిరి. అది యేదియన:—భారత విరాట్పర్వములో సోమయాజి

''ఉ. ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబుగల్గియ
ష్టాదశపర్వనిర్వహణసంభృతమైపెనుపొందియుండునం
దాదిదొడంగిమూఁడుకృతులాంధ్రకవిత్వవిశారదుండువి
ద్యాదయితుండొనర్చెమహితాత్ముఁడు నన్నయభట్టుదక్షు

అని వ్రాసినపద్యము తమవ్రాతకూఁతకట్టియని పంతులవారు వచించిరి. "ఆంధ్రకవితావిశారదుండైన నన్నయభట్టు మొదటిమూఁడు పర్వములను దెనిఁగించెనని చెప్పెనేకాని యాతని నాదికవినిఁగాఁ జెప్పిస్తుతింపలేదు. అందుచేతఁ దిక్కన్న నన్నయభట్టారకుని నూత్నకవినిగాఁబరిగణించినట్లుస్పష్టమగుచున్నది" అనిపంతులవారు వ్రాసిరి. ఇంతవింతకలదా? ఇందు నాదికవినిగా వర్ణించియుండ లేదు గావున నూత్నకవిగాఁ బరిగణించెదరఁట! మంచిది, యిందు నూతనకవిగను జెప్పియుండలేదే నూతనకవియనిమాత్రమువీరెట్లెంచెదరో ? ఇందునూత్నకవినిగా వర్ణించి యుండలేదుగావున నాదికవినిగాఁ బరిగణించినట్లేలతలంపరాదు ? ఆంధ్ర కవితావిశారదుఁడైనవాఁడనుటచేతనా ? అట్లనుటచే నూత్నకవియని చెప్పవలసి యుండునా? ఆదికవిని నాంధ్రకవితావిశారదుఁడనఁదగదా ? ఇందునన్నయభట్టారకుఁడు భారతములో మొదటిమూఁడుపర్వములును దెనిఁగించెనని చెప్పుటయే తిక్కనకవసరముగాని నన్నయయొక్కస్థితిగతులన్నియుఁ దెల్పుటయవసరము కాదుగదా. ఇఁక నాంధ్రకవిత్వవిశారదుఁడని మాత్రము చెప్పెనేకాని యాదికవియని తెల్పలేదననేల? పంతులవారు తలఁచినట్లెంచునెడల నాంధ్రకవితావిశారదుఁడని మాత్రముచెప్పుటచే నన్నయభట్టారకుండు సంస్కృతకవికాఁడని చెప్పవలసివచ్చును. నన్నయచారిత్రమును వ్రాయుచునాతనినాదికవియని తెల్పకుండిన నావిషయమున సందేహింపవచ్చునుగాని యిటనట్లు చెప్ప వచ్చునా ? తనకుఁ బూర్వమీ భారతము నెవరెంతభాగమును దెనిఁగించిరోయెట్లు తెనిఁగించిరో తెల్పుటయిందుఁదిక్కన కవసరముగాన మూఁడు కృతులు నన్నయభట్టుదక్షతతోఁదెనిఁగించి నాఁడనితెల్పి యున్నాఁడు. అంతమాత్రముచేనన్నయ భట్టుయొక్కలక్షణమంతయు నిందువర్ణింపఁబడినదనఁదగునా ?

అదియటుండ నీరెండు పద్యములవలనను గూడ నన్నయభట్టారకుఁడాది కవిగాఁబరిగణింపఁబడినదియు లేనిదియునుగూడ స్పష్టముగాఁ దెలియవచ్చుటలేదు కావున నుభయులవాదమునకును గూడ నీపద్యములంతగా నక్కఱకువచ్చుచుండుటలేదు. కాఁబట్టినన్నయభట్టును గూర్చితిక్కననాఁడెట్టివాడుక యున్నదో తిక్కన పల్కినయాదికవులెవరో నూత్నకవులెవరో తెలిసికొనుటకై యితరాధారములఁ జూచుకొందము.

నన్నయభట్టును గూర్చి తిక్కన కాలమున నెట్టివాడుకయున్నదో తెలిసికొనుటకై యాతిక్కన కాలమునందలి యితరకవుల వ్రాఁతలనాధారముగాఁ దీసి

కొందఱు. దీనివలననన్నియును బాగుగాఁ దేలఁగలవు. పరికించిచూడఁ దిక్కన్న కాలములోఁ బల్వురు కవులున్నట్లు తెలియవచ్చుచున్నదిగాని వారిలోఁ గొందఱి గ్రంథములు కానరాకున్నవి. కేతన్న మారన్న యను వారి గ్రంథములు మాత్రము లభ్యములగుచున్నవి. వీరిలో కేతన్న తిక్కన్న చెలికాఁడు. ఇతఁడు తనదశకుమారచరిత్రమును సోమయాజికే కృతియిచ్చియున్నాఁడు. మఱియు నితఁడు

“గీ. కవిత చెప్పియుభయకవిమిత్రు మెప్పింప, నరిది బ్రహ్మకైన నతఁడు మెచ్చఁ
బరఁగ దశకుమార చరితంబు చెప్పిన, ప్రౌఢ నన్ను వేఱె పొగడ నేల?”

అని చెప్పుకొనియున్నాఁడు. కానఁ దిక్కనతో మైత్రి కలయీతఁడు కవులను గూర్చి యేమి చెప్పినాఁడో చూతము.

ఈతఁడు తనదశకుమారచరిత్రములోఁ గవులవర్ణించియుండలేదు కాని తన యాంధ్రభాషాభూషణములో :—

“క. మున్ను తెలుఁగునకు లక్షణ, మెన్నఁడు నెవ్వరును జెప్పరేఁ జెప్పెద వి
ద్వన్నికరము మది మెచ్చఁగ, నన్నయభట్టాదికవిజనంబులకరుణన్”

అని వ్రాసియున్నాఁడు. ఇందు నన్నయభట్టాదికవిజనులని కవిజనులకు నన్నయభట్టు మొదటనిడఁబడియున్నాఁడు. తక్కినవారి పేరులు లేనేలేవు. దీనిని బట్టి యాకాలమున నన్నయభట్టారకుఁడు కవులందఱిలో నగ్రగణ్యుఁడుగా నుండెడివాఁడని తెలుచున్నది. నన్నయభట్టునకుఁ బూర్వమందుఁ గవులేయున్న యెడల వారు నన్నపార్యునికంటెఁ బ్రసిద్ధులును విశేషించి వ్యాకరణకారునకుఁ బరమప్రమాణపురుషులును నై యుందురుగదా. అట్లున్నచో శబ్దశాస్త్రమును విరచించుచున్న కేతన వారి పేరులఁ దలపెట్టక “నన్నయభట్టాదికవిజనంబులకరుణన్” అని నన్నయభట్టును బెద్ద చేసి యాతని పేరుమాత్రమే యుగ్గడించుటకుఁ గతమేమి? తనలక్షణగ్రంథమునకు లక్ష్యములు నన్నయభట్టారకుఁడాదిగాఁగల కవి లోకముచే ననఁగా నన్నయనాఁటినుండియు లక్ష్యములు లభించుటచేత నే కదా యట్లనినాఁడు. పంతులవారు చెప్పినట్లుగా నీకేతనకాలమున (అనఁగాఁ దిక్కనకాలమున) నన్నయ నూత్నకవిగా నెంచఁబడుచుండి తిక్కనాదులచే నాదికవులుగాఁ గొనియాడఁబడినవారు మఱికొందఱు పూర్వులుండినచో వారి గ్రంథములకంటె నూత్నకవియగు నన్నయది కేతనకు నెక్కుడు లక్ష్యము కాదుగదా పూర్వుల పేరెత్తక నూత్నకవియగు నన్నయ పేరెత్తుట యెట్లు సంభవమగును. ఆపూర్వుల పేళ్లిప్పటికి గగనపుష్పములయినయట్లె యానాఁటికిని నైనవా? లేక వారు

నన్నయయంత దక్షులుకారా? కవితాశోభను దెచ్చుటలో నన్నయకుఁ జాలకుండినను బూర్వులగుటచేఁ బ్రయోగములకు వారే యెక్కుడు ప్రమాణమగుదురుకదా. కావున నట్టివారే యున్నయెడల కేతన్నవారినే పేర్కొనియుండును. అట్లుచెప్పక నన్నయనే ముందిడినాఁడుగావున నాకాలమున నన్నయభట్టారకుండే యాదికవిగాఁ బరిగణింపఁబడుచుండెడివాఁడని దీనిమూలముగాఁ దెలియవచ్చుచున్నది.

అయినను కేతన వ్రాఁతయందును నన్నయ యాదికవియని విస్పష్టముగాఁ జెప్పఁబడియుండలేదు కాన మనవ్రాఁతకుమఱియొకయాధారమును జూచుకొందము.

మఱియును మారన వ్రాఁతవలన మనసందియములన్నియు జక్కఁగా విడిపోవుచున్నవి. ఈమారనకవి తిక్కనసోమయాజిపుత్రుఁడని కొందఱును వేఱొక తిక్కన్నపుత్రుఁడని కొందఱును జెప్పుచున్నారుగాని తిక్కనసోమయాజిశిష్యుఁడనిమాత్ర మందఱును నంగీకరించియున్నారు. మారన్న తనగ్రంథములలో:—

"శ్రీమదుభయకవిమిత్ర తిక్కన సోమయాజి ప్రసాదలబ్ధ సరస్వతీపాత్ర తిక్కనామాత్యపుత్రమారయనామధేయ ప్రణీతంబు"

అనిగద్యలవ్రాసికొనియున్నాఁడు. కాఁబట్టి సోమయాజిశిష్యుఁడనుటకావంతయును సందియములేదు మనపనికి శిష్యుఁడైనను కుమారుఁడైనను నొక్కటియే కాననీతఁడు నన్నయభట్టారకుని గూర్చియేమిపలికిననదితిక్కన యభిప్రాయానుసారముగావచ్చినదేయని చెప్పుకొనవచ్చును గాఁబట్టియీ మారనశబ్దశాసనునిగూర్చియేమివ్రాసినాఁడో చూతము. ఈతఁడు తనగ్రంథములలో నన్నయతిక్కనలనుమాత్రముస్తుతించినాఁడు. అందులో:—

ఉ. సారకథాసుధారసమజస్రము నాగళపూరితంబుగా
నారఁగఁ గ్రోలుచున్ జనులుహర్షరసాంబుధిఁ దేలునట్లుగా
భారతసంహితన్ మునుత్రిపర్వము లెవ్వఁడొనర్చెనట్టివి
ద్యారమణీయునంధ్రకవితాగురునన్నయభట్టుఁగొల్చెదన్.

అనినన్నయభట్టును స్తుతించినాఁడు. ఇందువాగనుశాసనుని "నాంధ్రకవితాగురున్" (ఆంధ్రకవిత్వమునకుఁ దండ్రిని) అనికొనియాడినాఁడు. ఇంతకన్ననేమిచెప్పవలయును? ఇట్లునన్నప్పను నాంధ్రకవిత్వమునకు జనకునిగా వర్ణించినవాఁడు తిక్కన సోమయాజియొద్ద విద్యను నేర్చుకొనిన మారనకవి. ఇఁకతిక్కనకాలమున నన్నయనుగూర్చి తిక్కనాదుల కెట్టితలంపుండెడిదో బుద్ధిమంతులూహించుకొనుఁడు. ఇట్లుశిష్యునకు నాదికవియైనవాఁడు గురునకు నూత్నకవి కాఁడుగదా?

ఇఁక నిప్పుడు తిక్కనసోమయాజి వ్రాసిన "ఆదికవీంద్రుల నూత్నసత్కవీశ్వరులను" అను దానికిఁ దాత్పర్య మేమైయుండునో బుద్ధిమంతు లూహించుకొనుఁడు. మారన వ్రాసినదానిని బట్టి తిక్కన్న నన్నపార్యుని నాదికవులలోఁ జేర్చినాఁడే కాని నూత్నకవులలోఁ జేర్చియుండలే దని బాగుగాఁ దెలియవచ్చుచున్నది. "ఆదికవీంద్రుల"నని బహువచనమువాడ నేల యందురేని సావధానముగాఁ జిత్తగింపుఁడు. తిక్కన యాదికవియైన నన్నపార్యునందుఁ బరమభక్తివిశ్వాసములు కలవాఁడు. ఆతని ననుసరించి కవిత్వము చెప్పి యున్నాఁడు. ఆతఁడు గ్రంథాదిని "శ్రీవాణీగిరిజాః" అని శ్లోకమును వేసియుండుటచేఁ దానును దనగ్రంథాదిని "శ్రీరాస్తామ"ని చెప్పియున్నాఁడు. ఆతఁడు దేవతాస్తుతియుఁ గవిస్తుతియు నెట్లు చేసినఁ దానును నట్లె యొనర్చియున్నాఁడు. చూడుఁడు:—

"తరల. హరిహరాజగజాననార్కషడాస్యమాతృసరస్వతీ
గిరిసుతాదికదేవతాతతికి న్నమస్కృతి చేసి దు
ర్భరతపోవిభవాధికుల్ గురుపద్యవిద్యకు నాద్యు నం
బురుహగర్భనిభుం బ్రచేతసుపుత్రు భక్తిఁ దలంచుచున్".

అని నన్నపార్యుఁడు రచించియుండఁగాఁ దిక్కనార్యుఁడు:—

"చ. హరిహరపద్మగర్భులను నాదికవీంద్రుల నూత్నసత్క
వీశ్వరులను భక్తిఁ గొల్చి" అని చెప్పియున్నాఁడు.

ఆతఁడు దేవతాస్తుతికవిస్తుతి రెండును గలపి యొకపద్యమునందుఁ జెప్పియుండుటచేఁ దానును నీరెండుస్తుతులును నొకపద్యమునందే కావించినాఁడు. అతఁడు "హరిహరాజ" అని ప్రారంభింపఁగాఁ దాను "హరిహరపద్మగర్భుల"నని ప్రారంభించినాఁడు (ఇది భారతాదిం గలహరిహరహిరణ్యగర్భుల నను దానిని గూడఁ దలఁపించుచున్నది.) ఆతనికిఁ దెనుఁగున నాదికవులు లేరుగాన సంస్కృతమునఁ బద్యవిద్యకు నాద్యుఁడైన వాల్మీకిని మాత్రము స్తుతించియుండఁగాఁ దనకు సంస్కృతమున నొకయాదికవియుఁ దెలుఁగున నొకయాదికవియు నుండుటచే "నాదికవీంద్రులన్" అని బహువచనము వాడినాఁడు. తా నుభయకవిమిత్రుఁడు గాన నుభయకవిత్వములకును నాద్యు లగువారి నిందు స్తుతించె. కాన "ఆదికవీంద్రుల"నని తిక్కన వ్రాసినదానికర్థ మేమనఁగా సంస్కృతమున కాదికవియైన వాల్మీకిని దెలుఁగున కాదికవియైన నన్నపార్యుని నని యర్థము.

నన్నయభట్టారకునందుఁ దిక్కనసోమయాజి కంత హెచ్చుగా గౌరవప్రపత్తి కలదని వ్రాసియుంటివి గదా యాతఁ డాదికవి యనుతలంపును దిక్కన్నకుఁ

గలదంటివిగదా యట్టి ఘనగౌరవప్రపత్తి గలయాతఁడు తనవిరాట్పర్వమునందలి పద్యమునందు నించుక సూచించియైన నుండఁడా యందురేని వినుఁడు. తిక్కయజ్వ నన్నయను గూర్చి యెంత హెచ్చుగా వ్రాయవలయునో యంత హెచ్చుగా విరాట్పర్వమున వ్రాసియే యున్నాఁడు. దానిని బంతులవారు బాగుగాఁ గని పెట్టక "అనంతరమున రచియించిన భారతమునం దైనను, ఆంధ్రకవితావిశారదుం డైన నన్నయభట్టు మొదటి మూఁడుపర్వములను దెనిఁగించె ననిచెప్పె నే కాని యాతని నాదికవినిగాఁ జెప్పి స్తుతింపలేదు." అని వ్రాసిరి. మహితాత్ముఁడు నాంధ్రకవిత్వవిశారదుండు నగు నన్నయభట్టు దక్షతతో మూఁడుకృతు లొనర్చె నని చెప్పుటయే కాక యిఁక నొకవిశేషణమును గూడ వాడియున్నాఁడు. పైవానివలననే నన్నయభట్టారకుని కవితాసామర్థ్య మెంతటిదో సువ్యక్తమగుచున్నను నిఁక నొకవిశేషణము గూడ నాతనిని గూర్చి తిక్కన్న వాడినాఁడు. అది యేది యన "విద్యాదయితుండు "అనునదియే. ఈవిశేషణము సామాన్యమయినది గాదు. పండిత మాత్రత్వమును దెల్పునదియును గాదు. విద్య దయితగాఁ గలవాఁడనఁగా బ్రహ్మ యనియర్థము. "వాగనుశాసనుండు సృజియింపఁగ "అని యిటీవలి కవులు వర్ణించినదానియం దెంతభావము కలదో దీనియందును నంతభావము కలదు. సృష్టికర్తయొక్క యవతారమూర్తి నన్నయభట్టారకుఁ డని తిక్కనతాత్పర్య మయినట్లుగా నీవిశేషణము వలనఁ దెలియవచ్చుచున్నది. ఎందుచేత సోమయాజి నన్నపార్యునిని బ్రహ్మగా వర్ణించినాఁడు? అనిన నీతఁడాంధ్రకవితాసతిని సృజించి యుండుటచేతనే యని తెల్పుకొనవలసియే యున్నది గదా. కాఁబట్టి తిక్కనసోమయాజి, కేతన, మారన, మొదలయినవారందఱును గూడ నన్నయభట్టోపాధ్యాయుని నాదికవినిగా వర్ణించి రనితెల్పుకొనుట కించుకయును సందియములేదు గావున నన్నయ యాదికవి యనువాడుక మొదటినుండియును గలదు. ఇటీవలికవులే కాక మొదటికవులుకూడ నాతనిని నాదికవిగా స్తుతించి యున్నారు. కానఁ బంతులవారు వ్రాసినది పొరపాటువ్రాఁతయే యై యున్నది.

(3) ఇఁక "నంతకుఁ బూర్వము కవిత్వమే లేకపోయిన నన్నయ యన్నికట్టు దిట్టములతో నంత నిర్దుష్టముగాఁ గవిత్వమును జెప్పుటకుఁ జాలియుండునా?" అనువిషయమును గూర్చి ముచ్చటించుకొందము.

ఈసందియము దూర మాలోచించుటకుఁ దమఘనశను శ్రమపెట్టఁదలంపని బుద్ధిమంతులందఱును దప్పక యందురు. అందుచున్నారు. ఇది దొంగయాబి

యుక్తి యగుటచే నిందుఁ గాలు వేయనివా రుండుటయరుదు. ఈతలంపును మొదటఁ దెచ్చిపెట్టినవారు విదేశస్థులగు రివరెండు కాల్డువెల్లుదొరవారు. దీనిని దరువాతఁ బ్రకాశింపఁజేసినవారు రావుబహదర్ కందుకూరి వీరేశలింగముపంతులు ఎఫ్.ఎమ్.యు. గారు మొదలగు స్వదేశపండితప్రకాండులు. మొదటిదొరవారు మనదేశ భాషాస్థితులు బాగుగాఁ దెలిసికొనుటకుఁ దగినంతస్థితి కలవారు కారు. నన్నయభట్టారకుఁ డెట్టివాఁడో, యెట్టిబుద్ధివిశేషము కలవాఁడో, యెట్టిసహాయసంపత్తి కలవాఁడో యేరీతిసంస్కారము తెలుఁగు భాషకుఁ జేసినాఁడో యీవిషయములన్నియు దొరవారు బాగుగాఁ దెలిసికొనఁ జాలినవారు కారు, తెలుఁగుభాష యందలి కవిత్వము విశేష మగుకట్టుదిట్టములను గలిగియుండుటను మాత్రము చూచి యీయేర్పాటంతయు మొదటనే జరగినదా యనిసందేహించిరి. కావున వా రట్లుతలంచుట వింత కాదు గాని సమస్తవిషయములును బాగుగాఁ దెలిసికొనుటకు సర్వోపపత్తులును గల మనదేశపండితులును దొరవారు పాడినదానినే పాడుట మాత్రము వింతను బుట్టించుచున్నది.

మొదటి కవియే యంతనిర్దుష్టముగాఁ గవిత్వమును జెప్పఁగలఁడా యనువిషయముం గూర్చి ముందు ముచ్చటించుకొందము. తెలుగుకవిత్వము సంస్కృతపదములతోఁడను దెలుఁగుపదములతోడను దత్సమ తద్భవ దేశ్యములతోడను నిర్మింపఁబడుచున్నది. ఇఁక నంతనిర్దుష్టముగా ననెంతనిర్దుష్టముగానో తెలియకున్నది. ఈనిర్దుష్టత సంస్కృతపదరచనావిషయమా? యాంధ్రపదరచనావిషయమా? యన మొదటిది కాదు. ఏమనఁ దద్రచన నన్నయభట్టారకునినాఁటికిఁ జాల విరివిగా నున్నది. భాషయంతయును జక్కఁగా సంస్కరింపఁబడి మంచివ్యాకరణములను నిఘంటువులను లక్ష్యగ్రంథములను విశేషముగాఁ గలిగియున్నది కావున సంస్కృతమున నాయాగ్రంథములను జదివి మంచిపండితులై దానియం దనర్గళమైన కవిత్వము చెప్పఁగల నన్నయభట్టారకుఁ డారచనను నిర్దుష్టముగాఁ జేయుట వింతకాదు. ఇఁక రెండవదియును గాదు. ఏమనఁ దెలుఁగునకు నన్నయభట్టారకుఁడు వ్రాసిన దేదియో యదియే లక్షణమగుచున్నది గావున, దుష్టతాదుష్టతలు బాస సంస్కరింపఁబడి విద్యావైభవము నందినతరువాత నగుకవిత్వమునం దెంచఁదగును గాని మొదటిభాషా సంస్కర్తల వ్రాఁతలం దెంచఁదగదు. వారేది చెప్పిన నదియే లక్షణమగును గదా! సకారాంతములలో "పయ" శ్శబ్దమునకు "పయ" మనియాధునిక కవులు వాడిన నది లక్షణవిరుద్ధ మని మనము నిందించుచున్నారము. నన్నయ శిరము

మొదలగురూపములను వాడియుండఁగా వానిని సాధువు లనుచున్నాము. అట్లనుటకుఁ గారణమేమి? వక్షశ్శబ్దమును వక్షమనియు వక్షస్సనియు వ్రాసిన నవిసాధువులై పయశ్శబ్దమును బయమనియుఁ బయస్సనియు వ్రాసిన నిందుఁ బయమనునది యసాధు వెట్లయినది? ఆదికవు లట్లువాడియుండలేదు కావున ; భారతమున నన్నయ యెచటనైనఁ బయమనినచో దానిని మనము సాధువనుటకు వెనుదీయము గదా; ఇఁక మనలక్షణమునందలి సూత్రములన్ననో.

''గీ. కనియె ననుటకుఁ గనె నని యనఁగ వచ్చు,
భారతమున నన్నయభట్టు పల్కుఁ గాన''.

అని చెప్పుకొనుచున్నారము. నన్నయభట్టారకుఁడు తనకాలమున భాష యెట్టస్థితియం దున్నదో యాస్థితినే సంస్కృతవ్యాకరణములు, కర్ణాటవ్యాకరణములు నెట్టిమార్గమున నున్నవో యట్టిమార్గమును బట్టి తనబుద్ధికిఁ దోచినట్లు కొంత సంస్కరించి యారీతిగాఁ గవిత్వమును జెప్పియున్నాఁడు. ఈతనిపదప్రచార మేరీతిని బోయినదో యించుమించుగా నారీతినే తిక్కనాదులును నడచిరి. వీరందఱు నలుగఁద్రొక్కినమీఁదట నొకమార్గ మేర్పాటయినది. ఇప్పుడు మనపద మొక్కింత యామార్గమున కావలఁబడినను, నీవలఁబడినను గూడ నదిపెడత్రోవలఁ బడుట యగునుగాని నలిగినమార్గము లేనప్పుడు మొదటినాఁడు పెడత్రోవలఁ బడెననుట కవకాశముండునా? నలిగినత్రోవ లేనప్పు డన్నియును ద్రోవలే యగును, నలిగినత్రోవ యిప్పటివారికిఁ గొంచెము వక్రముగా నున్న నదియే సుపంథ యగును దానిని దాఁటిన పదములు కంటకబాధితములగును కావున నన్నయకవిత్వ మంతసలక్షణముగ నెట్లున్న దనియడుగుటలో నర్థములేదు. అతఁ డేదిచెప్పిన నదియే లక్షణముకావున నని మరల నొక్కి వక్కాణించెదను.

ఇఁక మొదటికవియే యిన్నికట్టుదిట్టములను జేయఁగలఁడా యనుశంకను విమర్శింతము లోకములో బుద్ధులన్నియు నొక్కతీఱున నుండునవికావు. ఒకబుద్ధికి సాధ్యము కానిది యిఁకనొకబుద్ధికి సాధ్యము కావచ్చును. అంతియకాక యొకానొకప్పు డసాధారణబుద్ధివిశేషము లుత్పన్నములై లోకమునకు సామాన్య మగు పనికన్న మించినపనిని జేయుచుండును. లోక మెప్పుడును సామాన్యబుద్ధిని బ్రమాణముగాఁ దీసికొని విషయవిమర్శనమును జేయుచుండును గానఁనట్టి యసామాన్యబుద్ధుల యపూర్వకార్యము లసంభవము లని యెన్నుట కలవాటుపడి యుండును. అట్టి యసాధారణమనీషావిశేషసంపన్నుల చెయ్వులను లోకసామాన్యప్రమాణమునుబట్టి మచ్చుచూడరాదు.

అట్లు చూచినసత్యమున కొకానొకప్పుడు హానివచ్చుచుండును. లోకములో సాధారణముగా నాలేండ్లబాలకు లక్షరాభ్యాసమైనఁ గలిగియుండరు. అట్టిస్థితిలో నాలేండ్ల బాలకుఁడు కవిత్వమును జెప్పెననిన నదినమ్మఁదగి యుండదుకదా. అయినను నట్టిపిన్నవయస్సున రమ్యతమ మయినకవిత్వమును జెప్పినవా రరుదుగఁ గలరు. రాజచూడామణియను కవిశిఖామణి గర్భసప్తమహాయనమందే (సామాన్యదృష్టిచే నాఱవయేట) శృంగారరసపేటిక యయిన కమలినీకలహంసనామనాటికను విరచించితి నని వ్రాసికొనియున్నాఁడు. ఆ యేండ్లబాలకుం డెక్కడ! కమలినీకలహంస యను రమ్యమయిన నాటికయెక్కడ! యని మన మారాజచూడామణివ్రాఁతను ద్రోసివేయవచ్చునా! ఉదాహరణములు విశేషముగా నుండినంగాని మనము నమ్ముటకుఁ జాలియుండము. ఇయ్యవి యసాధారణము లగుటచే నిరుపమానములై మరల బుజువునకుఁ దగిన యుదాహరణములు లేనివై యుండును. అంత మాత్రముచే మన మట్టివింతలఁ ద్రోసివేసిన సత్యమును ద్యజించినవార మగుదుము. హూణులలో మిల్లను శాస్త్రజ్ఞుఁడును బైరను నను కవియునుగూడ నతిబాల్యమునందే కవిత్వములను జెప్పియున్నారు. కాని రాజచూడామణియంతటిబాల్యమునఁ జెప్పియుండలేదు. మఱి యట్టివారి నిఁక నొకరిఁ జూపుమన మనము చూపఁగలమా? అంతమాత్రముచేఁ బైవా రతిబాల్యమునఁ గవిత్వమును జెప్పియుండుట యబద్ధ మగునా? మఱియును నాలేండ్లకుఁ దక్కువవయస్సు గలకుఱ్ఱవాఁడు "ఒకటి రెండు" అని లెక్కించుటకైన సమర్థుఁడు గాకుండునుగదా. అట్టిస్థితిలో నాలేండ్లకు దక్కువవయస్సు గలబాలకుఁ డొకఁ డెంతటిచిక్కులెక్కల నైన మనస్సునఁ జేసిచెప్పుచు వచ్చినట్లు కార్పెంటరుస్ మెంటల్ ఫిజియాలాజీలోఁ జెప్పఁబడియున్నది. ఈబాలకునకు నీఁబడిన ప్రశ్నము లెట్టివో యించుక మచ్చుచూపెదను.

"He was asked how many minutes there are in 48 years; and before the question could be written down, he replied 25,228, 800, immediately afterwords he gave the correct number of seconds" (48 సంవత్సరములలో నెన్ని నిముషము లున్న వనియడుగఁగా నీప్రశ్న వ్రాయుటకాకమునుపే తక్షణము 25,228,800 నిముషము లని చెప్పి వెంటనే లిప్తలెన్నియో కూడఁ జెప్పె) ఇట్టి వాఁడు మరల మనకొకఁడు దొరకునా! దొరకఁడు. అందుమూలముచే నాబాలునిశక్తి సత్యము కా దనవలసినదియా? కాదుగదా. ఒక్క వ్యాసులవారు పంద్రెండు గ్రంథములను వ్రాసియుండిరి. ఇది సామాన్యముగా సాధ్యముకాదు. కొందఱు బుద్ధిమంతు లొక్కఁ డిన్ని గ్రంథములు వ్రాయుట

యసంగత మనిచెప్పి వ్యాసులవారిని గ్రంథకర్తృత్వమునుండి తోసిరాజనుచు న్నారు. * ఈకారణము చెప్పి వ్యాసులవారిని దొలఁగించుట న్యాయము కాదు. ఇప్పుడు వ్యాసులకంటె హెచ్చుగా గ్రంథములను వ్రాసినవా రొకరిద్దఱు కాన్పించుచున్నాడు.

ఈయుదాహరణముల నన్నిటిని నేనెందుల కిచ్చితి ననఁగా బుద్ధివిశేషము యొక్క మహిమ యపారమనియు నొకానొకచోట నిరుపమానమనియుఁ జదువరులహృదయములకు నాటుటకు. కావున "అదివఱ కేమియుఁ బుస్తకములే లేకయుండినపక్షమున నన్నికట్టుదిట్టములతో నంత నిర్దుష్టముగా నూతనముగా గ్రంథరచన చేయుట నన్నయభట్టునకుఁగాని మఱియొవ్వరికిఁ గాని సాధ్య మయియుండదు" అని వ్రాయసాహసించుటకు మన కధికారము లేదు. ఎందుచేత నిది యసాధ్య మనితలంచుచున్నాము? నిరుపమాన మగుటచేత. ఇట్టివారిఁక నొకరుండిన మీరిది యసాధ్యమనరుగదా? ఇఁక నిరుపమాన మగుటచేత నసాధ్యమందురా? అట్లనఁ దగదు. అందఱికిని సాధ్యము కాకపోవచ్చును గాని యొకానొక మహానీయుని యసాధారణబుద్ధి విశేషమునకు సాధ్య మైనఁ గావచ్చును. కావున నిఁక మనమెట్టిప్రశ్నమును జేసికొనవలసియుండు ననఁగా:— ఆదికవియే యిన్ని కట్టుదిట్టములతో నింత నిర్దుష్టముగాఁ గవిత్వమును జెప్పుట యసాధారణకార్యము కావున నన్నయభట్టారకుఁ డట్టియసాధారణ మగుబుద్ధిమహిమ గలవాఁడా? ఇది మనుజబుద్ధికి సాధ్య మగునది యగునా? కాదా? యనునంశములఁ దర్కించుకొనవలసి యున్నది.

నన్నయభట్టారకుఁడు కవిమాత్రుఁడు గాఁడు. ఈతఁడు మిగుల ఘనమైన బుద్ధివిశేషము కలవాఁడు. అసాధారణ మైనప్రజ్ఞ కలవాఁడు. ఈతఁ డసాధారణ మైనబుద్ధివిభవము కలవాఁ డనుటకు నాధార మేమి యందురేని భారతమే యీవిషయమున సర్వవిధముల సాక్ష్య మిచ్చుచున్నది. భారత మీమహాకవినిగూర్చి ముచ్చటించుటలో "సత్యమరాధిపాచార్య సుజను నన్నపార్య" నని తెల్పి యున్నది. బుద్ధిచేత బృహస్పతి ననివివేకి యైనన్నన్నపార్యుఁ డేదో ఘన మైనబుద్ధి వైలక్షణ్యమును జూపకుండిన వ్రాసికొనునా? మహారాజువెదుట నిది విద్వత్సభలోఁ జదువఁబడునది గదా? అట్టిచో ఘన మైన బుద్ధివిశేషమును జూపి యాపై మత్యమ

* కొన్ని యిటీవలివి వ్యాసుల పేరుపెట్టఁబడినవియును వ్యాసుల గ్రంథములందేనూతనముగాఁ జేర్పఁబడినభాగములును నుండవచ్చును. ఉన్నవి.

రాధిపాచార్యుఁడ నని వ్రాసికొని యుండును. అయ్యది యేది యనిన నాంధ్రకవితా గురుండై చక్కఁగాఁ గవిత్వమును జెప్పుటలోఁ దనబుద్ధివైశద్యమును జూపుటయె కావున భారతము సర్వవిధముల నన్నయభట్టారకుఁడు మత్యమరాధిపాచార్యుఁడనిబోధించుచున్నది. అంతటిబుద్ధివిశేషము కలవాఁ డన్నికట్టుదిట్టములతోఁ గవిత్వమును మొదటనే చెప్పుట యసాధ్య మెట్లు కాఁగలదు కట్టుదిట్టము లంతటివైన బుద్ధియు నంతటిదై యున్నది. ఇఁక సందియ మేల!

ఇయ్యది మనుజబుద్ధికే యసాధ్యమందురా! అట్లనఁదగినదికాదు. గొప్పబుద్ధి విశేషముకలవానికి సాధ్యమగునదియేకాని మనుజబుద్ధికే లొంగనిది కాదు. పంతులవారు వ్రాసినట్లుగా నదివఱ కేమియుఁ బుస్తకములే లేకయుండినపక్షమున నన్నికట్టుదిట్టములతో నంతనిర్దుష్టముగాఁ గవిత్వము చెప్పుట యమరాధిపాచార్యునకైనను సాధ్యముకాదనిన ననవచ్చును. అనఁగా నన్నయభట్టు తెలుఁగుతప్ప మఱేభాషయును నెఱుంగక తెలుఁగుననే పుట్టిపెరిఁగి యేయితరసహాయమును లేకయే తెలుఁగునకుఁ బ్రాథమికకవియైనచో నన్నికట్టుదిట్టములతోఁ జెప్పఁజాలఁ డనుటకేసందియము లేదందుముగాక. కాని నన్నయస్థితి యిట్టిదికాదు. అదివఱ కేమియుఁ బుస్తకములు లేకపోలేదు. అదివఱ కనేకములగు పుస్తకములు పరిపూర్ణమయినకట్టుదిట్టములు కలవి కలవు వాని నన్నిటిని నన్నయభట్టారకుఁడు బాగుగాఁ జదివి చక్కఁగా గ్రహించియున్నాఁడు. వానిసహాయము చేతనే యిన్నికట్టుదిట్టములతోఁ గవిత్వమును జెప్పఁగలిగినాఁడు. కావున నదివఱ కేమియు గ్రంథములు లేకయుండఁగాఁ దానె కవిత్వమును జెప్ప మొదలుపెట్టినవాఁడు కాఁడు. అట్లయిన నీతఁడాదికవి యెట్లగునందురేని నట్లయినను నీతఁడాదికవియే, యేమన నీతఁడే మొదటఁ దెలుఁగుకవిత్వమును జెప్పినవాఁడు. అట్టిచో నదివఱకే పుస్తకము లెట్లువచ్చినవనిన నీతఁ డాంధ్రకవితాగురుఁడు గాని కవితాగురుఁడు కాకపోవుట చేత నని గ్రహించునది. ఆంధ్రమున నదివఱ కేమియును గ్రంథములు లేకపోయినను సంస్కృతమునను గన్నడమునందునను విపుల మగుగ్రంథసామగ్రి కలదు. దానిని బాగుగాఁ జదివి తెలిసికొని యందుసమర్థుఁ డగు కవిపుంగవుఁ డైయుండి తన్మహాసహాయము చేఁ దద్రీతినే యాంధ్రమునఁ గవిత్వమును వాగనుశాసనుఁడు సృజించె. అయ్యది గొప్పబుద్ధిగలవానికసాధ్యమా? కాదు. గింజవేసి సద్యఃఫలితము చేయుట యేరికిని సాధ్యముకాదుగాని యంటుకట్టి సద్యఃఫలితము చేయుట యేరికైన సాధ్యము కాకపోవునా? అట్లనుటకు బుద్ధిమంతు లేరును సాహసింప రనితలంచెదను. నన్నయ

భట్టారకుఁడు చేసినది యంటుకట్టుట. గీర్వాణభాష యనుమహాకల్పవృక్షము శాఖోపశాఖలుగా పెరిఁగి చిరకాలమునుండి పూచి కాచి ఫలించుచున్నది. అయ్యది విబుధవరుఁ డగునన్నయ భట్టారకునకుఁ బెరటికల్పకమై యున్నది. మఱియు నాంధ్రభాషానామకతరుణాంకుర మొకటి యీతనికాలమున బయలుదేఱుచున్నది. అయ్యది తనంతఁ దాఁ బెరిఁగి పూచి కాచి ఫలించుటయే గలుగవలసివచ్చునెడల నెంతకాలమున కెట్టిఫలముల నిచ్చునోగాని యాతనినాఁటి కీయఁజాలదు. కాని యద్భుతమతిమంతుఁ డగునన్నయ యా తెలుంగుమొలకను దెచ్చి చిరకాలమునుండి రసవత్ఫలంబుల నిచ్చుచున్న గీర్వాణభాషామరభూజముతో నేర్పుమీఱ నంటుకట్టినాఁడు. అందుచే మొలక యల్పపుదియు క్షుద్ర మయినదియు నైనను దానికిఁ దోడయిన వృక్షము సర్వవిధములఁ బరిపూర్ణమయినదియును ఘనతరులలో నగ్రగణ్యమును గావున మొదటనే మంచిఫలములు లభ్యములైనవి. తోఁటవాఁడంటు నాటుకొనిన దాదిగాఁ బూచి కాచుటకు సిద్ధమైనను నాపూవుల నొకటి రెండేండ్లు త్రుంచివైచుచు వచ్చునట్లే యాదికవియును నొకటిరెండేండ్లు తా రచించిన పద్యములను దీసివేయుచు వచ్చియే తుదకీ భారతఫలమును బండించి యుండును.

ఇయ్యది యండఱికిని సాధ్య మగుపనికాకపోవచ్చును గాని మత్యమరాధిపాచార్యునకును సాధ్యము గాకుండునా! మఱియు నుదితవయస్కుఁ డగునౌరసపుత్రు నొక్కమాఱుగా సంపాదించుట యెరికిని సాధ్యముకాదుగాని దత్తపుత్త్రుని సంపాదించుటయును నసాధ్యమగునా! ఆంధ్రభాషకు సంప్రాప్తమయిన కవితాపుత్రిక దత్తపుత్త్రికగాని యౌరసపుత్రికకాదు. ద్రావిడభాషలలో నౌరసపుత్రిక కలది యొకయరవముమాత్ర మయియున్నది. ఆంధ్రకర్ణాటకముల కవితాపుత్రికలు దత్తపుత్రికలు. దత్తపుత్రప్రాప్తి నందఁగోరువారు పరులు కష్టపడి కని పెంచిన పిల్లలఁ దెచ్చి కొన్నిసంస్కారములు చేసికొని యదివఱకున్న పేరును దీసివేసి క్రొత్తనామ మిడి తమకడనుంచుకొని తాము సంతానవంతు లనిపించుకొందురు. అట్లనే సంస్కృతకవులు కష్టపడి కనిపెంచిన కవితాయువతినే తెచ్చి కొన్నిసంస్కారములను జేసి సంస్కృతకవిత యనునామమును దీసివేసి యాంధ్రకవిత యనునామమిడి యొక్కసారిగా నాంధ్రకవితాపిత యై నన్నయభట్టారకుఁడు విరాజిల్లె. పేరునకు మాత్రమే యాంధ్రకవిత్వముగాని న్యాయముచే సర్వవిధముల దీనిని సంస్కృతకవిత్వమనియే చెప్పఁదగును. ఇయ్యది యండఱికిని

సాధ్యము కాకపోవచ్చును గాని లోకోత్తరబుద్ధివిభవముకలవానికిని సాధ్యము కాకుండునా? మఱియును బూర్వ మెట్టిస్థితియం దున్నను ప్రస్తుతకాలమున మనదేశమునఁ జిత్రకర్మ (Painting) చాల వెనుకపడియున్నది. యూరపుదేశ మీకళయందుఁ బరిపూర్ణదశయం దుండినది. ఇప్పు డొకహిందువు యూరోపుదేశమందుఁ బరిపూర్ణతనందియున్న యాచిత్రకర్మను వారివలన నభ్యసించి యందు మిక్కిలి విచక్షణుఁడై యొకహిందూదేశయువతిని గళావిశేషమంతయు మెఱయునాగున లిఖింపఁజాలి యుండఁడా? అందఱు హిందువులును నట్లు ప్రకాశింపఁజాలరుగాని యొకానొక యపూర్వప్రజ్ఞానిధి చాలి యుండకపోఁడు. పల్వురు రవివర్మ లుండకపోవచ్చును గాని యొకరవివర్మ యుండకపోఁడు. ఇప్పుడు మనదేశమునందు లభ్యములగునుపకరణములతోడనే రవివర్మ చిత్రలేఖనమును జేయవలసివచ్చు నెడల నెన్నటికి నింతనైపుణ్యమును జూపఁజాలియుండఁడు. చిత్రలేఖనము బొత్తిగ లేని దేశమునందుఁ బుట్టినవాఁ డయినను స్వతస్సిద్ధముగా మంచిబుద్ధికలవాఁ డైయుండి యైరోపీయపండితులకడ భక్తిశ్రద్ధలతో నాకళనభ్యసించి వచ్చి చిత్రలేఖన మెట్టిదో యెఱుంగని తనదేశమున నొక్కసారిగానే యాకళ నన్నికట్టుదిట్టములతోడను వెలయింపవచ్చును. అదియసాధ్యము గొప్పబుద్ధి కలవానికిఁ గాదు. ఆతీరుననే తాను సంస్కృతమును బాగుగా నభ్యసించి యందుఁ గవిత్వము చెప్పుటలో నిపుణుఁడై యాకళనె (art) తెలుఁగులోనికి దింపినాఁడు. నన్నయ యనాగరికుఁడు కాఁడు నాగరికుఁడు. అపండితుఁడు గాఁడు ఘనపండితుఁడు (ఆంధ్రమాత యగుసంస్కృతమున) అల్పబుద్ధి కలవాఁడు గాఁడు. అసాధారణ మైనబుద్ధి గలవాఁడు. తెలుఁగుదేశస్థుఁడు తెలుఁగుమాట లాడువాఁడు. ఇట్టివాఁడు తెలుఁగునకుఁ దల్లియైన సంస్కృతమునం గలపద్ధతుల నపూర్వముగాఁ దెలుఁగులోనికిఁ దెచ్చి వానిని వెలయింపఁజాలఁడా! రాగిచెంబు చేయువాఁ డిత్తడిచెంబు చేయఁజాలఁడా! ఇఁక నన్నయభట్టారకుఁడు చేసిన దేదో యది పరికింతము. ఈతఁ డన్నికట్టుదిట్టములతోఁ గవిత్వమును జెప్పె ననఁగా నవి యేవిషయిక మైనకట్టుదిట్టములు!

## ఛందోవిషయ మైనవా?

ఛందస్సు తెలుఁగున నావఱకు లేకపోయినను సంస్కృతమునఁ బరిపూర్ణముగా నున్నది. దానియందు నన్నయభట్టారకునకు మిగులఁ బరిచయము కలదు. ఆసహాయముచే దానినె తెలుఁగులోఁ దెచ్చి పెట్టినాఁడు. సంస్కృతమునఁ బద్యములు వృత్తములుగను జాతులుగను విభజింపఁబడి యున్నట్టి [illegible] నావిభజనమునె [illegible]

డు. అందలి శార్దూలమే యిందలి శార్దూలము. దాని మొదటిగురువును రెండులఘువులు చేసిన మత్తేభము, అందలి స్రగ్ధరయే యిందలి స్రగ్ధర. దాని మొదటిగురువును రెండులఘువులు చేసిన మహాస్రగ్ధర. అందలి చంపకమే యిందలి చంపకము. దాని మొదటిరెండులఘువులును గురువుచేసిన నుత్పలము. అందలి యార్యయే యిందలి కందము. ఈరీతిగా వృత్తకల్పన విషయమున సంస్కృతమే తెలుఁగులోనికి దిగినది. సంస్కృతవృత్తములను దెనుఁగులోనికిఁ దెచ్చుటలోఁ గొన్నిమార్పులు పెట్టఁబడి యవి చాలవఱకు సర్వజనసమ్మత మైనమాట నిజము. ఉన్నదానిని సరసముగా మార్చి క్రొత్తదిచేయుట యొక బుద్ధిమంతునకు సాధ్య మగునదియే కాని యసాధ్య మయినది కాదు. ఈమార్పులను జేయుటలోఁ గొన్నిటిలోఁ దేలి పోయినాఁడు. ఈతఁడు తెచ్చిపెట్టిన వన్నియును నెగ్గలేదు. చంద్రగణములమూలముగా నక్కరలను మధ్యాక్కరలను గల్పించినాఁడు గాని వానిని లోక మంగీకరింపలేదు. మొదటికవులుమాత్ర మొక రిద్దఱీపద్యముల నించుక వాడినను దరువాతివారు వీనిని బొత్తిగాఁ ద్రోసి వైచిరి. ఈవిధముగాఁ గొన్నిటిలో నెగ్గినాఁడు. మఱి కొన్నిటిలో నెగ్గ లేకపోయినాఁడు. ఉన్నదాని కీవిధముగా వన్నెలఁ బెట్టుట బుద్ధిమంతుల కసాధ్యమా! ఈమార్పులఁ బెట్టుటలో నైనను గన్నడ మీతనికి సాయపడినది. తెలుఁగుకంటె ముందుగాఁ గర్ణాటకవులు సంస్కృతపద్యముల నించుక మార్చియును మార్పకయును గన్నడమునఁ గవిత్వ మారంభించిరి. దానినుండి నన్నయభట్టారకుఁడు తెలుఁగునఁ బద్యనిర్మాణమును గావించె. తెలుఁగు పలుభాషలతో సంబంధించినది కావున దీనిని శాసించుటకై నన్నయ కాయాభాషల వైఖరి తెలిసికొన నవసరము కలిగినది. వానిని గొంత తెలిసికొని తెలుఁగును శాసించుటచేతనే నన్నయభట్టారకునకు "సకలభాషావాగనుశాసనుఁ" డను బిరుదము కలిగినది. సకలభాషావాగనుశాసనుఁ డనఁగా లోకమునందలి భాషల నన్నిటిని శాసించినవాఁ డని యర్థము కాదు. మనవా రప్పటికిఁ దెలుఁగుతో నేయేభాషలు సంబంధించిన వని తలంచుచుండెడివారో యాయాభాషల గమనికను దనకు సాధ్య మగునంతవఱకుఁ దెలిసికొని యాయాపదముల శాసించుకొనుట యని యర్థము. అనఁగా సంస్కృతము ప్రాకృతమును, గన్నడము (అరవమును) తెలిసికొని వానిసహాయముచేఁ దెలుఁగును గొంత శాసించెను గావునను దెలుఁగుతో సంబంధించిన భాష లివియే యని వారితాత్పర్యము గావునను నీమహానీయుని సకలభాషావాగనుశాసనుఁ డని పిలిచిరి. మహారా జగురాజనరేంద్రునిసహాయముచే నీమత్యమరాధిపాచార్యుఁడు భాషాసంస్కారమునకుఁ బూనినాఁ డనియు నారాజేంద్రుని యాస్థానమండపమును నరవము, గన్నడము, ప్రాకృతము, సం

సంస్కృతమును గూడ నలంకరించుచు వచ్చిన వనియుఁ జదువరులు తెలిసికొనవలెను. అట్టి స్థితిలోఁ గుశాగ్రబుద్ధి గలపండితుఁ డాయాభాషలయందలి పండితులసహాయముచే నాయాభాషలగమనికలఁ దెలిసికొనుట యసాధ్యము కాదు. నన్నయభట్టు నారాయణభట్టు సహాయముచేఁ గన్నడమునందలి విశేషములను దెలిసికొనియె; నారాయణభట్టు కన్నడమునందుఁ గవియైనట్లుగా నందంపూడి శాసనమువలనఁ గాన్పించుచున్నది. క్రీస్తుశకము 1053 వ సంవత్సరమున రాజనరేంద్రుఁడు నన్నయభట్టారకుని మిత్రుఁ డగునారాయణభట్టునకు నందంపూడిగ్రామమును దానమీయఁగా నప్పుడు దానశాసనమును నన్నయభట్టారకుఁడు వ్రాసినాఁడు. దానియందు నారాయణభట్టునుగూర్చి "యస్సంస్కృతకర్ణాటప్రాకృతపైశాచికాంధ్రభాషాసుకవిరాజశేఖర ఇతి ప్రథిత స్సుకవిత్వవిభవేన । కవీన్మనీషాలవదుర్విదగ్ధాన్ మనోహరాభిర్నిజసూక్తిభిర్యః । కుర్వ న్నగర్వాన్ పటుభి ర్బభర్త్తి కవివజ్రాంకుశనామ సార్థం" అని వ్రాయఁబడి యున్నది. కొందఱు తెలుఁగునుండి ఛందస్సు కన్నడములోనికి వెళ్ళినట్లు తలంపఁబోవుచున్నారు కాని యది సరికాదు. తెలుఁగునుండి కన్నడములోనికే వృత్తనిర్మాణము వెళ్ళినయెడలదానియందును యతినియమ ముండి యుండును. వృత్తసంవర్ధనక్రమములను బట్టి చూడఁగా అరవము తరువాతఁ గన్నడమును దానితరువాత నాంధ్రమును గవితావిభవము నందినట్లు విస్పష్టముగాఁ గాన్పించుచున్నది. అరవమునఁ బ్రాసము మాత్ర మున్నది. అదియును బలుతావుల నైచ్ఛికము. కన్నడమునందును బ్రాసనియము మాత్రమే యున్నది గాని యది విధాయకము. తెలుఁగున న్రాప్రాసనియమమును యతినియమమును గూడఁగలిగినవి. కాఁబట్టి నన్నయభట్టారకుఁడు నారాయణభట్టుసహాయముతో సంస్కృతమునుండి కన్నడములోనికి మాఱిన ఛందస్సును మరలఁ దెలుఁగులోనికి మార్చినాఁడు.

వృత్తనిర్మాణము నీరీతిగా సంస్కృతమునుండి చేయుచుఁ గన్నడమునుండి ప్రాసమును గ్రహించి తనబుద్ధివిశేషముచే నంతకంటెను గవిత్వమును రమ్యముచేయుటకై సంగీతమునుండి యతిని గూడఁ దెచ్చిపెట్టి యన్నిటికంటె దీనిని రమ్యతమ మైనదానినిఁ జేసినాఁడు. తా నీరమ్యత్వమును గ్రొత్తగాఁ దెచ్చిపెట్టుటను భారతమునందె:—

"ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తితో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెలుంగున న్మహా
భారతసంహితారచనబంధురుఁ డయ్యె జగద్ధితంబు గాన్."

అను పద్యమున సూచించి యున్నాఁడు.

ఇవి యన్నియు నాలోచించి చూడఁగా నన్నయభట్టారకుఁ డున్నదానికి వన్నె పెట్టెనే గాని క్రొత్తసృష్టిని జేయలే దని తేలుచున్నది. కాఁబట్టి నన్నయభట్టు వేఱొక రేవున సిద్ధముగా నున్న పద్యవిద్య యను సరకును దన యసామాన్యబుద్ధి యను నావయం దుంచి తెచ్చి మన రేవున నొక్కసారిగా దింపిన సుధీవరుఁడు గాని తా నా సరకును బండించిన కర్షకుఁడు గాఁడు. తన తెలుఁగు ఛందమునకు సంస్కృతము మూలముగానఁ దాను బద్యవిద్యకు నాద్యుఁడు గాఁడు. అందు మూలము చేతనే తాను బద్యవిద్యకు నాద్యుఁడ నని చెప్పుకొనక విపులశబ్దశాసనుఁడ నని మాత్రము వ్రాసికొని పద్యవిద్యకు నాద్యుఁడు వాల్మీకి యని భారతపీఠికలో నన్నప్ప వ్రాసినాఁడు. కాఁబట్టి తెలుఁగు ఛందస్సు[illegible] గల కట్టుదిట్టము లొక్కసారిగా నన్నయభట్టారకుని వలనఁ బుట్టినవి కావు. ఇవి [illegible] సంస్కృతము కన్నడము మొదలగువానియందుఁ గ్రమక్రమముగాఁ బుట్టి పెరిఁగి[illegible]డి తెలుఁగులోని కొక్కసారిగా నారాయణసహాయుఁ డగు వాఁగనుశాసను మూలముగా వచ్చి చేరినది. ఇది యసంభవమా? ఎంతమాత్రమును గాదు. ఇయ్యది యందఱకును సాధ్యము కాదు గాని మత్యమరాధిపాచార్యునకు సాధ్యమే యగును.

## రచనావిషయమైనవా?

కన్నడాదిభాషావధూటులచే నదివఱకే యెట్లెట్లో పాలింబడినను నిలుచుటకు సామర్థ్య మింతయును జాలక మెల్లఁగఁ బ్రాఁకుచు నున్న తెలుంగునకుఁ దనపాలు పూర్తిగ నిచ్చి పెంచి పదదార్ఢ్య మిచ్చి యేభాషావధూటి నేలపై నిలువఁబెట్టెనో యా సంస్కృతమునందు నన్నపార్యుఁడు కావ్యరచనాభిశోభితుఁడై యున్నాఁడు. అట్టి కవిశిఖామణి యారచననే యాయన్వయమునే యాశైలినే యాపాకమునే పెక్కుల సర్వవిధముల నాపద్ధతులనే యీ తెలుఁగునందును బెట్టినాఁడు. మూఁడువంతులు పదములు కూడ సంస్కృతపదములే తీసికొనినాఁడు. పేరునకు మాత్రమే తెలుఁగుకవిత్వము గాని వస్తుతత్త్వముచే దీనిని సంస్కృత మనియే తెల్పవలయును. భారతమందలి మొదటి తెలుఁగుపద్య మెట్లున్నదో చూడుఁడు :—

"ఉ. రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజతే
జోజయశాలి శౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందుచంద్రికా
రాజితసర్వలోకుఁ డపరాజితభూరిభుజాకృపాణధా
రాజలశాంతశాత్రవపరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్."

ఇది తెలుంగురచనయా! తెలుఁగనుపేరును ధరించిన సంస్కృతమే కదా. మొట్టమొదటి వచనమును తిలకింపుఁడు :—

“(అని) సకలభువనరక్షణప్రభువు (లై) యాద్య (లైన) హరిహరహిరణ్యగర్భ పదోన్నమావాణీపతు (ల) స్తుతి (యించి) తత్ప్రసాదసమాసాదితనిత్యప్రవర్ధమానమహామహీరాజ్యవిభవు (ండును) నిజభుజవిక్రమవిజితారాతిరాజనివహు (ండును) నఖిలజగజ్జేగీయమాననానాగుణరత్నరత్నాకరు (ండును నై పరఁగుచున్న) రాజరాజనరేంద్రుండు” అని యున్నది. ఇయ్యది తెలుంగా? అది వఱకుఁ దెలుఁగుగ్రంథము లుండినంగాని యీదృశ మగురచనను సంస్కృతకవిశిరోమణి యగు “మత్యమరాధిపాచార్యుఁడు” చేయఁజాలఁడా! ఇది బుద్ధిమంతు లాలోచించి పలికిన పలు కగునా!

*“విమలాదిత్యతనూజో । విమలవిచారః కుమారవిద్యావాన్
ఉత్తమచాళుక్యో వివి । ధాగమవిహిత శ్రమ శ్శశికాంత్యా.”

అని విరచించిన నిందు నన్నయ కసాధ్య మేదియును లేదు గదా. ఇఁక నీమత్యమరాధిపాచార్యుఁడు :—

“విమలాదిత్యతనూజుఁడు । విమలవిచారుఁడు కుమారవిద్యాధరుఁడు
త్తమచాళుక్యుఁడు వివిధా । గమవిహితశ్రముఁడు తుహిన కరుఁడురుకాంతిన్”

అని విరచించుటకు నదివఱకుఁ దెలుఁగుగ్రంథము లుండినం గాని చాలకుండునా! మఱియును :—

*శా. త్రేతాద్వాపరమేళనే ఘనమదాంధీభూతవిద్వేషిజీ
మూతోగ్రశ్వసనస్సరామ, ఇ, రుషాత్రిస్సప్తవారంరణ
ప్రీత్యావైరినృపాన్ జఘానచ బహూన్ భూత్వోల్లసద్దీర్ఘని
ర్ఘాతక్రూరకుఠారలూననిఖిలక్ష్మ త్త్రోరుకాంతారకః.

అని నన్నయభట్టారకుఁడు విరచించిన నది సాధ్యమే యనుట కంగీకరింపనివా రుండరు గదా. అది యామహాకవికి సులభసాధ్యమే కదా! ఇఁక :—

“శా. త్రేతాద్వాపరసంధి నుద్ధతమదాంధీభూతవిద్వేషిజీ
మూతోగ్రశ్వసనుండు రాముఁ డలుకన్ ముయ్యేడుమాఱుల్ రణ
ప్రీతిన్ వైరిధరాతలేశ్వరులఁ జంపెన్ బల్విరన్ దీర్ఘని
ర్ఘాతక్రూరకుఠారలూననిఖిలక్షత్త్రోరుకాంతారుఁడై.”

అని విరచించుట యాసంస్కృతమహాకవికి, నాపండితశిరోమణి, కామత్యమరాధిపాచార్యునకు నసాధ్య మగునా? పైపద్యమునకును గ్రిందిపద్యమునకుఁ గలభేద మేమి? “అలుకన్ ముయ్యేడుమాఱుల్” “చంపెన్ బల్విరన్” అని నాలుగు తెలుఁగుముక్క లిందుండుటచేత నిది యావాగనుశాసనున కసాధ్య మగునా! నడుమ నొక్కొ-

క్క తెలుఁగుపదంబును వాడుచు సంస్కృతముతోడనే తనరచనాచాతుర్యము నంతను జూపి యున్నాఁడు.

"చ. అనవరతార్థదానయజనాభిరతుణ్ భరతాన్వయాభివ
ర్ధను సకలప్రజాహితవిధాను ధనంజయసన్నిభుణ్ భవ
జ్జనకుఁ బరీక్షితుణ్ భుజగజాలుఁ డనవ్యావిషోగ్రధూమకే
తనహతిఁ జేసి చేసె నతిదాంతుఁ గృతాంతనికేతనాతిథిణ్."

ఇం దేమైనఁ దెలుంగు కలదా! ఒకమూలఁ జేసె నను తెలుఁగుపదము మాత్రము కలదు. తక్కిన దంతయు ను సంస్కృతపుంజము. ఇది యసాధ్యమా! ఈపద్యమే సంస్కృత మను పేరితో:—

*పంచకము. అనవరతార్థదానయజనాభిరతంభరతాన్వయాభివ
ర్ధనమఖిలప్రజాహితవిధానముపర్య్ధనన్నిభంభవ
జ్జనకపరీక్షితంభుజగజాల్మఉదగ్రవిషోగ్రధూమకే
తనహతినాచకారఅతిదాంతమిహాంతకమందిరాతిథిం.

అని వ్రాసినను సాధ్యమే యందురు గదా. పేరు మాఱిన సాధ్యముకాదా! ఈ రీతిగానే నన్నయభట్టారకునికవిత్వము మొదటినుండి తుదివఱకు సంస్కృతరచనాప్రాయమయియే నడచినది. ఈతనితుదిపద్యముం గనుఁడు.

"ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపఙ్క్తులణ్
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభము "దాల్చి" సుధాంశువికీర్యమాణక
ర్పూరపరాగపాండురుచిపూరము లంబరపూరితంబులై."

ఇది తెలుఁ గను నామమాత్రమునే ధరించిన సంస్కృత మనుట కించుక యైన సందియము కలదా? కొన్నితావులఁ దెలుఁగుమాట లింతకంటె హెచ్చుగను గూడ నుండుచు వచ్చినవి కాని మొత్తముమీఁద రెండువంతులకంటె హెచ్చుగా సంస్కృతపదములు నొకవంతుమాత్రము తెలుఁగుపదములును నీతనికవిత్వమునం దుండును. "ఈయనకవనమం దించుమించుగా రెండువంతులు సంస్కృతపదములు ఒకవంతు తెలుఁగుపదము లుండుడును" అని పంతులవారే వ్రాసిరి. తెలుఁగు సంస్కరించుటకయి తనజీవితమును ధారపోసిన యీసంస్కృతకవిశిఖామణి సంస్కృతములో నక్కడక్కడఁ దెలుఁగుమాటల నతుకుచుఁ గవిత్వనిర్మాణమును జేయఁ జాలఁడా! ఈ తెలుఁగుమాటలనైన

---

*ఇట్టిచోటులఁ బద్యముయొక్క నడకనే ప్రధానముగాఁ జూచికొనుఁడు.

ట్లు ప్రయోగించె నందురా? తెలుఁగుదేశమునఁ బుట్టి సదా తెలుఁగుమాటలాడుచుం డువాఁ డామాత్రము తెలుఁగు వాఁడఁ జాలఁడా? ఇందులకై తెలుఁగంతయు నాతనికిఁ దెలిసియుండ నవసరము లేదు. తన యోపినమట్టుకు సంస్కరించుకొని వానిని బ్రయోగించినాఁడు. ఆసంస్కారమైన నప్పు డెట్లు భాష మాటలాడఁబడుచుండెనో దానినే యించుక యొకవరుసలో నుంచుటయే కాని యంతకంటె నెక్కువది కాదు. మఱియు ను సంస్కృతరచనను బట్టి తెలుఁగురచనను జేయుచు వచ్చినాఁడు. తెలుఁగు బాగుగాఁ దెలియకపోయినను దనకుఁ బాండిత్యము కలభాష ననుసరించి పద్యకల్పనమును జేయుట కాన నది యసాధ్యము కాదు. పెద్దనార్యుఁడు:—

మ. సమరక్షోణిని కృష్ణరాయలభుజాశాతాసిచేఁ బడ్డను
ర్దమహోర్దండపుళిందకోటి యవనవ్రాతంబు సప్తాశ్వమా
ర్గమునం గాంచి శబాసహైబుహరిహారంగాఖుబాబుఖోద్ధాకితే
తుముకీబాయిలబాయిదేమలికియందుర్ మింటికిం బోవుచున్.

మఱియును:—

† "శా. రాయగ్రామణి కృష్ణరాయ భవదుగ్రక్రూరఖడ్గాహిచే
గాయం బూడ్చి కళింగదేశనృపతుల్ కానిర్ఝురీపోషణీ
మాయాభీకుమటూకులోటుకుహుటూమాయానటాజాహారే
మాయాగ్గేయమడే య టంట్రుడు దివి రంభాజారునిన్ యత్నునిన్."

అని విరచించి యుండెను. ఇట్లన్యభాషాపదముల నెట్లు ప్రయోగించి పద్యరచన చేయఁ గలిగె. ఒకదానియందుఁ గవిత్వము చెప్పఁగలవాఁడు కావున నామార్గముననే యన్యభాషాపదములతో నిట్టివిరచనమును జేయఁ జాలి యుండెను. ఈకవికే యొకమహారాజు తగుప్రోత్సాహ మిచ్చినచో నాపులిందభాషయందలి క్రియలఁ గొన్నిటిని, అవ్యయములు విశేషణములు, సుబంతములును గొన్నిటిని దెలిసికొని సంస్కృతవాక్యముల నడుమ నాభాషాపదముల నిమిడించుచు నీవృత్తములతో రమ్యతరమైనప్రబంధముల విరచింపఁ జాలకుండునా? ఇప్పుడు తగుప్రోత్సాహము కలిగించువా రుండిన నీఛందస్సు, నీసమాసములు నీపద్ధతులును బెట్టి యక్కడక్కడ దేశ్యముల వాడుచుఁ గోదుభాషయందుఁ బ్రబంధరచనమును జేయువా రుండరా? స్వభాష కానిభాషయందే మనపండితులు మనపద్ధతుల ననుసరించి చక్కఁగాఁ బద్యరచనఁ జేయజాలియుండఁగా స్వభాషయందు

† ఇది ముక్కుతిమ్మన్నదని పంతులవారు.

నన్నయభట్టారకుఁడు సమస్తవిషయములఁ గల్పవృక్షమై యున్న సంస్కృతసహాయముతో నాపద్ధతి ననుసరించి కర్ణాటపండితుఁడైన నారాయణభట్టుసహాయముతోఁ దెలుఁగుపేరిటి సంస్కృతకవిత్వమును నావఱకుఁ దెనుఁగున గ్రంథములు లేకపోయినను జెప్పుటయె యొకయసాధ్యపు పని యగునా! అట్టివాని కసాధ్యము కాదు.

ఇతరశక్తులు కవికి సహజముగాఁ బుట్టవలసినవే కాని యొరులఁజూచి నేర్చుకొనవలసినవి కావు గదా. సంస్కృతభాషాపాండిత్యము బుద్ధికమిత మగువికాసమును గలిగింపనే కలిగించినది కదా. ఇట్టి మత్యమరాధిపాచార్యుఁడు తెలుఁగుపేరిటి సంస్కృతకవిత్వము నన్నికట్టుదిట్టములతోఁ జెప్పుట యేమి వింత! ఏమియసాధ్యము! గొప్పపండితకవిశిఖామణి మతిమంతులలో నగ్రేసరుఁడు నగు నాతఁడు సత్పండితకవిసహాయముతోఁ మహారాజప్రోత్సాహముతోఁ దనయావచ్ఛక్తిని వినియోగించి వ్రాయుటచే నావ్రాసినది తెలుఁగున కాదియే యైనను సంస్కృతమున కొకవికార మగుటచే నన్నికట్టుదిట్టములతో నంతనిర్దుష్టముగా నీయాంధ్రకవితాసతి మొదటనే ప్రకాశించినది. అదృష్టవశమున నాదికవియే మిక్కిలిసమర్థుఁ డగుట తటస్థించుటచే నాదియందే తెనుఁగుకవిత్వము మిక్కిలి చక్కఁగా విరాజిల్లినది. తెలగనార్యునివిషయమున మనపంతులవారేమి వ్రాయుచున్నారో చూడుఁడు:—

"అచ్చతెలుఁగునందు గ్రంథములు రచియించుట మిక్కిలి కష్టము" అని చెప్పి వెంటనే "ఈకవికిఁ బూర్వమునం దెవ్వరును శుద్ధాంధ్రభాషలో బ్రబంధములు చేయుటకుఁ బ్రయత్నించినవారైనను లేరు. ఇట్టిగ్రంథరచన కితఁడు మొట్టమొదటివాఁడే యైనను, ఈకవిరచించిన యయాతిచరిత్రము సర్వవిధములచేత ను గూచిమంచి తిమ్మకవి రచియించిన యచ్చతెలుఁగు పుస్తకములకంటె శ్రేష్ఠతరముగా నున్న దని నా యభిప్రాయము" కంటిరా మొదటిగ్రంథకారునికవిత్వము హెచ్చయినదిగాను దరువాతివారు రచియించినవి దానికిఁ దీసిపోవునవిగాను నుండుట తటస్థమయినది. ఇందుఁ గవిత్వము చెప్పుట సులభ మేమో యనిన మిక్కిలి కష్ట మని పంతులవారే చెప్పిరి. ఎట్లింతటికష్టతమకార్యమునందు మొదటివాఁడు చక్కఁగా నెగ్గుటయును దరువాతివారు నెగ్గలేకపోవుటయు ను గలిగినది? అదృష్టవశమున మొదటియాతఁడు మిక్కిలి ప్రౌఢుఁ డగుట తటస్థ మగుటచేతనే కదా. అట్లనే తెలుఁగున కాదికవి మిక్కిలి సమర్థుఁ డగుటచే మొదటనే దానికి మిక్కిలి రమ్యత కలిగినది. కాఁబట్టి పయిసంశయము పల్వురకుఁ గల్గుచున్నదే యయిన ననాలోచనపూర్వకముగా గలుగునది కావున ననాదరణీయమే యగుచున్నది.

ఈరీతిగా నన్నయభట్టారకుఁ డాదికవి గాఁ గనుటకు మనపండితులు చూపిన యుక్తు లన్నియు నిస్సారములై పోయినవి కావున నాదినుండియు మనవారు తలఁచిన ట్లే మనమును నీతఁడే యాదికవి యని యెన్నఁదగును. నన్నయభట్టారకుఁడే మిక్కిలి సమర్థతతో నొక్కసారిగా నాంధ్రకవిత్వమును మంచికట్టుదిట్టములతోఁ బుట్టించెను గావున నే యాతఁ డించుక విరచించి మృతినందుటచే మిగిలినభాగము నించుమించుగా రెండువందలేండ్లవఱకును గూడఁ బూరించువాఁడు లేక పడియున్నది. కవిత్వము ధారాళముగాఁ జెప్పుటయే యప్పు డుండిన నది యంతకాలమువఱకు నట్లు పడియుండు నా ? పంతులవారు తమకవులచారిత్రములోఁ బాఖులూరి మల్లన్నను గూర్చి వ్రాయునం దర్భమున- "రాజనరేంద్రు కాలములోనే నన్నయభట్టు కాక యిట్టికవిత్వమును జెప్పఁగలక వు లితరులుండుటచేత నాంధ్రకవిత్వమునకు నన్నయభట్టారకుఁడు మొదటివాఁడు కాఁ డనియు, అతని కాలమునందును నంతకుఁబూర్వమునందును దెలుఁగుకవు లుండిర నియు, వా రట్టికవిత్వమును జెప్పుటకుఁ గావలసినలక్షణగ్రంథము లదివఱకే యుండిన వనియు స్పష్టమగుచున్నది" అని వ్రాసిరి. ఇది మహాత్సాహసము. నన్నయభట్టారకుని కాలమువాఁడు మల్లన్న యగునా కాఁడా యని ముందు విచారింపవలసి యున్నది. ఈతఁడు తనగణితములో రాజనరేంద్రుఁడు తనతండ్రికి నవఖండవాఁడ యనుగ్రామ మి చ్చినట్లు వ్రాసికొనినాఁడు. ఇందుచే నీతనితండ్రి నన్నయభట్టారకుని కాలమువాఁ డగు చున్నాఁడు. ఈతఁడును నించుమించుగా నాకాలమువాఁడే కావచ్చును గాని నన్న య భట్టారకుని తుదికాలము వాఁడు కావలసినవాఁ డగుచున్నాఁడు గాని నన్న యభట్టారకుని కంటె నీతఁడు పెద్దవాఁడు కావలసినవాఁడు కాఁడు. నన్నయభట్టారకుఁ డు భాషనుశాసించి యందుఁ గవిత్వము చెప్పుపద్ధతుల నేర్పఱచి కవిత్వముచెప్పుచుండఁ గా నారాజనరేంద్రునిసభలోనివాఁడే యైనమల్లన్న నన్నపార్యునివ్రాఁతనుజూచి తాను ను దనకోపినమట్టుకుఁ గవిత్వమును జెప్పిన నందు హాని యే మున్నది. నన్నయ తాను క విత్వమును బుట్టించినప్పుడు తనమిత్రులను శిష్యులను నందులకుఁ బ్రేరేపించును గదా. న న్నయభట్టారకుని చరమకాలమునం దేవఁడో మల్లన్న కవిత్వమును పేరితో నొకచిన్నగణి తమును విరచించియుండఁగా దానిని బట్టి పంతులవారు నన్నయభట్టారకునకుఁ బూర్వ ము కూడఁ గవిత్వము కలదనియు లక్షణగ్రంథము లదివఱకె కలవనియు నెట్లు గ్రహించి రో యూహింప సాధ్యము గాక యున్నది. నన్నయభట్టారకుఁడు చేసినకట్టుదిట్టముల ను బట్టి యే మల్లన్న యీపనిని జేసియుండవచ్చును గదా. పంతులవార లాంధ్రమున మొదటినవలను Novel బుట్టించితి మనుకొనుచున్నారు. మఱియును వారు నవలను

వ్రాసిన తరువాతనే దానిని జూచి వారిప్రోత్సాహముచే మఱికొందఱు నవలలను బేరి టిగ్రంథములను వ్రాసి తమచే మెప్పునందుచున్నారు. కొందఱు, వానిని రమ్యతరముగాఁ గూడ వ్రాయుచున్నారు. దీనినిబట్టి రాఁబోవుబుద్ధిమంతులు పంతులవారికాలముననేనవ లలు పుట్టినవి కావున వారికిఁ బూర్వమే యాంధ్రమున నవలలు కలవనియు వానికిఁ ద గినలక్షణగ్రంథము లంతకుఁ బూర్వమే యున్నవనియు తలంపవలసినదియా? అట్లనఁ దగదు. ఇఁకఁ బంతులవారు చెప్పిన దేశీయుక్తి? అట్లు తలంచుకన్న నిఁక నొకవిధము గాఁ దలంపవలసి యున్నది. ఎట్లన రాజనరేంద్రుకాలములో నాంధ్రకవులు కలరు వా రెవరనిన నన్నయభట్టారకుఁడు నారాయణభట్టు మల్లన్న యనువారు. నన్నయభట్టారకు నకు సహకారి యగు నారాయణభట్టు తెలుఁగునఁ గవియగుటకు సందియములేదు. ఆ తఁడు తెలుఁగుకవి యగుట నన్నయభట్టారకుని యాంధ్రకవితాగురుత్వమునకు భంగ మింతయును దేఁజాలదు. నన్నయభట్టారకుని యుద్యమమునకుఁ దోడయినవాఁడు గదా. ఇఁక మల్లన్న నన్నయకుఁ దుదికాలమున బయలువెడలి కవిత్వ మనిచెప్పఁజాలని చిన్న గణితమును మాత్రము చేసెను. ఇదియు భట్టారకుని యాంధ్రకవితాగురుత్వమునకు భం గము తేఁజాలదు. వీరికంటె నిఁక నెవరును గవులు లేరు. కాఁబట్టి రాజనరేంద్రుకాల మున నాంధ్రకవిత్వము కలదు. మరల మనుమసిద్ధికాలమునఁ గలదు. ఆకాలమునఁ ది క్కన్న, మారన్న, కేతన్న, భాస్కరుఁడు, బయ్యన్న మొదలగువారు కలిగిరి. రాజన రేంద్రునకును మనుమసిద్ధికిని నడుమ రెండువందలేండ్ల యెడముకలదు. ప్రోత్సాహము చేసి యాంధ్రకవిత్వమును వెలయింపఁజేసిన రాజనరేంద్రుకాలమందు నించుక కవులుం డి తరువాత రెండువందలేండ్లవఱకును లేకపోవుటచే మన మేమి తలంపవలసి యుండు ను. తిక్కనకాలమునుండి నేఁటివఱకు నొక్కరీతిగా విరామము లేకుండఁ గవిత్వము సాగుచున్నది. నన్నయకును దిక్కనకును మాత్రము నడుమ రెండువందలేండ్లవఱకు నొకపెద్దగర్తము కలదు. నన్నయభట్టారకునిచే సృజింపఁబడిన యీయాంధ్రకవితాలతి క తిక్కనకాలమువఱకు వృద్ధిలేక పడియున్నది. కొంతయాంధ్రీకరింపఁబడిన భారత మీరెండువందలేండ్లును మరలఁ దెనిఁగించువారు లేక నొకమూలఁ బడియున్నది. పంతు లవారు, తలఁచినట్లుగా నన్నయభట్టారకునకుఁ బూర్వమే లక్షణగ్రంథములును లక్ష్యగ్రం థములును గూడ నుండి యాకాలమునఁ గవిత్వమును జెప్పుట కాంధ్రులలవడియె యున్న యెడల భారత మీరీతిని రెండువందలేండ్లవఱకును మరలఁ జూచువారు లేక పడియుం డునా? ఎందుచేత నిట్లుపడియున్న దనిన నన్నయభట్టారకుఁడు మిక్కిలి సమర్థతతో ర మ్యతరముగ భారతమున మూఁడుకృతులు దక్షతమీఱ విరచించినాఁడు. ఇది యాంధ్ర

మున నపూర్వమార్గము. ఇట్టి యీయాంధ్రకవిత్వమును వెలయింపఁదలఁచినవాఁడు కూడ సంస్కృతమున ఘనపండితుఁడై కవియై తెలుఁగున నన్నయభట్టారకుని మార్గమును దెలిసికొనినవాఁడై యుండవలయును. కవితావ్యాసంగము మనయాంధ్రులం దప్పుడు లేకపోవుటచే నిదియంతయు బహుప్రయాససాధ్యమై యున్నది. అందుమూలముచే నెవ్వరును నీపనికిఁ బూనలేకపోయిరి. ఇట్లు రెండువందలేండ్లు గడచినతరువాత మరలఁ దిక్కనార్యుఁడు బయలువెడలి దీనిని బూరించినాఁడు. ఈనడుమ గ్రంథములు లేవు సరికదా కవియను పేరు గలవాఁడైన ను లేఁడు. ఏమి! పద్యములువిరచించుటకుఁ బ్రయత్నించినవారే లేకపోయిరా యన నట్లు కాదు. కవిత్వమును జెప్పుటకుఁ బల్వురు ప్రయత్నించినను నాదికవిమార్గమును సరిగా గ్రహించి చక్కఁగాఁ జెప్ప నేరక "పుట్టలోనిచెదలు పుట్టవా గిట్టవా" యనినట్లు పుట్టినవారు పుట్టినట్లే గిట్టుచు వచ్చిరి. ఈనడుమ నన్నయమార్గమును గనిపెట్టంజాలని కవిమాత్రులు పుట్టి కుకవిత్వమును జెప్పుచు వచ్చుటచేతనే తిక్కనార్యుఁడు తననిర్వచనోత్తరరామాయణమున మొదటఁగవిత్వమును జెప్పఁదలంచినవాఁడు పదముల నెట్లుగ్రహించి వాడవలెనో యన్వయ మెట్లుండవలయునో యతిప్రాసము లెట్లుండవలయునో తెలుపుచుఁ గుకవినిందను జేసియున్నాఁడు. అప్పటివారు తిక్కనను బ్రమాణముచేసికొని తమకవిత్వము లాతనికిఁ జూపి యాతఁ డౌనననే కవుల మని కవిత్వమును చెప్పుకొనుచు వచ్చిరి. కేతన బయ్యనాదులు తిక్కన్నచే మెప్పువడసితి మని వ్రాసికొనిరి. మారన్న యాతనివలన విద్యాస్వీకారమునే యందితి నని వ్రాసికొనియె. ఈవిధముగా నన్నయతరువాతఁ దిక్కన మరల యుద్యమమును బూరించినాఁడు. ఇట్టివాఁడు గూడ నన్నయమార్గమును బూర్తిగా గ్రహింపలేక పోయినాఁడు. ఇఁక దక్కినవారిమాట నుడువ నేల! తిక్కన యప్పటియవసరమునుబట్టి కుకవినిందనమును దనగ్రంథమునందుఁ జేసియుండఁగాఁ దరువాతికవు లంధపరంపరగాఁ దమగ్రంథములఁ గుకవినిందనమును బెట్టుచువచ్చిరి. ఇట్లు రెండువందలేండ్లు మొదటికవికిని రెండవకవికి నెడముండుట యాంధ్రకవిత్వముయొక్క హాటాత్సంభవమును బోధించుచున్నది. అని మనము గ్రహింపఁ దగినది గాని పంతులవారు తలఁచినట్లూహింపఁ దగినది కాదు.

నన్నయ, మల్లన, తిక్కనల గ్రంథములందు మొదట సంస్కృతశ్లోక ముండుట యాదినములందు సంస్కృతకవియైనవాఁడు గాని తెలుఁగుకవిత్వము చెప్పలేక పోయెడివాఁ డని బోధించుచున్నది. ఇది న్యాయమే కదా. ఇదియును దెలుఁ గెప్పు డెట్లు పుట్టినదో తెల్పుచున్నది. అనఁగా వారాదికవు లని తెలియవచ్చుచున్నది. మల్లన తిక్క-

నాదులు నన్నయను సూచియే యట్లు మొదటిశ్లోకమును వైచిరనుట యెక్కుడుసరసము
తిక్కన భారతమునందు మాత్రము పూర్వకవిస్తుతి చేసెననియు నప్పటినుండి
యు గ్రంథములందుఁ బూర్వకవిస్తుతి చేయఁబడుచున్నదనియు నంతకుఁ బూర్వ మీయా
చారము లేదు కావున నన్నయమల్లనాదులగ్రంథములందుఁ బూర్వకవిస్తుతి లేదుగాని క
వులుమాత్రము లేకపో లేదనియుఁ బంతులవారు మల్లనచారిత్రమున వ్రాసిరి. ఇది సరి
కాదు. తిక్కనసోమయాజి యేగ్రంథమునందుఁ బూర్వకవుల ననుసరించె నని పంతులవా
రు తలంచుచున్నారో యాయుత్తరరామాయణమునందే పూర్వకవిస్తుతికలదు గాని పంతు
లవారుతలంచినట్లు భారతమునలేదు. నన్నయయాదికవి యగువాల్మీకిని స్తుతియించె ఇ
ది కవిస్తుతి కాదా? ఈతఁడు నారాయణభట్టు తనకు సహాయుఁ డని వ్రాసె. పండితస
భలను స్తుతియించె. ఇట్టివాఁ డాంధ్రకవులావళికే యుండిన వారిని స్తుతింప కుండు
నా! కానఁ గవిస్తుతి చేయుట యాచారములేదు. కాఁబట్టి నన్నయాదులు పూర్వకవు
లను స్తుతింపలే దనుట న్యాయము కాదు.

పెక్కేల. ఏవిధమునఁ జూచినను నన్నయభట్టారకుఁ డాదికవియని చెప్పుటయం
దే సందర్భ మెక్కుడుగాఁ గాన్పించుచున్నది. కాని యాతనికిఁ బూర్వమునందును
నాంధ్రకవిత్వము కలదనుట కాధార మింతయును గాన్పించుటలేదు. లోకమున వా
డుకయును మొదటినుండియు నట్లేయున్నది. భారతంబును దీనినే బలపఱచుచున్నది.
కాఁబట్టి సర్వవిధముల నన్నయభట్టారకుఁడే యాంధ్రకవితాసతికి జనకుం డని యెన్నఁ
దగును.

అంతకుఁ బూర్వ మాంధ్రమున రచన బొత్తిగ లేదా యందురేనిఁ గలదనుటకుఁ
గాని లేదనుటకుఁగాని యేరికిని శక్యము కాదు. ఉండిననుండుఁగాక. ఉండకుండిన నుం
డకుండుఁగాక. ఉండితీరవలసిన యవసరము లేదు. ఒకవేళ నుండిన ననాగరికస్థితిలో
ననార్యమార్గమున నుండునేమో కాని నన్నయభట్టారకకల్పిత మగునీదృశకవిత్వము లే
దు. దీనికి నన్నయభట్టారకుఁడే జనకుఁడు ఎఱ్ఱన్న నన్నయకుఁ బూర్వులు "గానటబీ
సటలు" చదివెడి వారని వ్రాసినాఁడు. హేళనమంటఁ జదువుటయనఁగాఁ బలుకుట
యర్థమగును గావున ను నిందు హేళనమే కావునను నిచటఁ జదువుట యనిన నుడువు
టయని యే తలంపవలెను గాని యున్నదానిని బఠించుట యని యర్థముచేయరాదు. శా
సనముల సందర్భమును బట్టి చూడఁ దెలుంగుపలుకులు నన్నయనాఁటికి వ్రాయఁబడు నవ
స్థయందే లేవని తెలియవచ్చుచున్నది గదా. ఒకవేళ నెఱ్ఱన్న చదువుట యనుదానికిఁ బ
ఠించుట యనియర్థముచేసిన నదివట్టి గానటబీసటకదా. అనఁగాఁ గవిత్వమని చెప్పఁద

గానంతటిది. దీనినుండి నన్నయభట్టారకుఁడును తన్నకవిత్వమును బుట్టించి యుండలేదు. సంస్కృతమునుండి తత్పద్ధతి ననుసరించి కట్టుదిట్టములతోఁ గన్నడమ్మతోడును గూడ నంది తనయపూర్వకవితాసతిని బుట్టించి యున్నాఁడు. అంతకుఁ బూర్వము రగడలో తందనపదములో "తిండికైతె పదమందివసంతి తండులాలు గృహమందు నసంతి" యను వికారపుఁబద్దెములో యుండిన నుండవచ్చును. ఆగానటాబీనటకును నన్నయయొక్క కవితావిశేషమునకు ను నంబంధ మేమియును లేదు.

వేయేల నిప్పుడు తెలుంగుకవిత్వ మని మనము దేనిని బిలుచుచున్నారమో దానికిఁ దర్శక నన్నయభట్టారకుఁడే తండ్రి. అంతకుఁ బూర్వ మీదృశకవిత్వము లేదు. ఈ మాటను నే ననుటలేదు. ఆదికవులలోని వాఁడైన కవిబ్రహ్మ యనినాఁడు. ఆతనిశిష్యుఁడనినాఁడు. ఆతనిమిత్రుఁ డనినాఁడు. శాసనము లీవిషయమును సూచించుచున్నవి. భారత మీసంగతిని దెల్పుడుచేయుచున్నది. దేశకాలాదు లీయంశమును గూఢిచేయుచున్నవి. భాషాక్రమ మీయుద్దేశమును దృఢపఱచుచున్నది. లోకప్రతీతి యీదానినే ఢంకామీఁద దెబ్బకొట్టి చాటుచున్నది.

కాఁబట్టి బుద్ధిమంతులు నావ్రాసినవిషయముల నన్నిటిని బాగుగా విమర్శించి చూచుకొని సత్యమును గ్రహింతురుగాక. ఈయిరువదియవశతాబ్దమున నైనను మనదేశమున నాంధ్రకవిత్వమును వెలయించుటకై తనజీవితమును ధారవోసిన నన్నపార్యునకు న్యాయము లభించుఁగాక.

ఇది మొదటిభాగము.

# సవరణ.

ఈగ్రంథమునందు—

పుట 14 బంతి 3 లో రాజులలో

,, 16 ,, 21 లో విమలాదిత్యతనయుఁడు

,, 42 ,, 2-3 బంతులనడుమ, ప్రాచీనగ్రంథమగు మృచ్ఛకటికములోదశక్ర-ను నందలి దేశవివరణములోఁ గర్ణాట (కర్ణాట) ద్రివిడ (దవిడ) చోళ (చోల) ముఖదేశముల ప్రశంసమాత్రమే కలదు గాని యాంధ్రదేశము మాటలేదు.

,, 94 ,, 3 బంతి అందలి పంచకమె యుందలి చంపకము.

## ఈగ్రంథకర్తరచించిన పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | వివేకచంద్రికావిమర్శనము | ... | ... | 0 | 12 0 |
| 2. | భాస్కరోదంతము | ... | ... | 0 | 8 0 |
| 3. | ఉత్తరసరస్వతీశారదవిలాపము | ... | ... | 0 | 1 0 |
| 4. | తారకతారావళి | ... | ... | 0 | 0 6 |
| 5. | ఉపన్యాసమంజరీవిమర్శనము (మతమునగూర్చి) | | ... | 0 | 1 0 |
| 6. | డిటో పాపశిక్షణము | .. | ... | 0 | 1 0 |
| 7. | విక్టోరియావిలాసము | ... | ... | 0 | 3 0 |
| 8. | నన్నయభట్టారకచారిత్రము | ... | ... | 0 | 8 0 |

## సవరణ.

89 వ పుటలో 29 వ బంతిలో "ఒక్క వ్యాసులవారు పండ్రెండుగ్రంథములను వ్రాసియుండిరి" అనుదానిలోని "పండ్రెండు" నకు బదులుగా "బండెడు" అని చదువుకొనవలెను.

7 వ పుటలో 9 వ బంతిలో "యతిలౌకికము నపేక్షించి యమాత్యపదమును వాడుకొనె" అనుదానికి బదులుగా "యతిలౌకికమునపేక్షించి తదనుకూల (అమాత్య) బిరుదమును వాడుకొనె. లౌకికుఁడు యతి నపేక్షించి తదనుకూల (భట్ట) బిరుదమును వాడుకొనెను" అని చదువుకొనవలెను.